

# ఇక నిశ్చింతగా మీ జుట్టు సమస్యల గురించి మీరు మరిచిపోవచ్చు

ASWINI
Homeo Hair Oil

**90%** వెల్లడించారు ' జుట్టు రాలిపోవడం పూర్తిగా ఆగిపోయింది' అని

**88%** వెల్లడించారు ' చల్లబరుస్తుంది' అని

**75%** వెల్లడించారు ' చుండ్రు పూర్తిగా పోయింది' అని

**61%** వెల్లడించారు ' జుట్టు తెల్లబడటం ఆగిపోయింది' అని

## మరి మీరూ వాడి చూడవచ్చు కదా?

అగ్రగామి బిజినెస్ స్కూల్స్‌లో ఒకటైన ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అండ్ మేనేజ్‌మెంట్ (ITM) వారు మెరుగుపర్చిన అశ్విని హెయిర్ ఆయిల్‌పై కొంత కాలం పాటు విస్తృతమైన పరిశోధనలు జరిపి కొన్ని నిజాల్ని తేల్చి చెప్పారు. వివిధరకాల వ్యక్తుల కేశాలను నమూనాలుగా తీసుకొని శాస్త్రీయమైన రీతిలో పరీక్షలు నిర్వహించి, మెరుగుపర్చిన అశ్విని హోమియో హెయిర్ ఆయిల్ ప్రాథమిక కేశ సమస్యలను తీర్చగలదని వెల్లడించారు.




### మెరుగు పరచిన అశ్విని సుగుణాలపై పరిశోధనలో వెల్లడైన వాస్తవాలు

| సమస్య | నమూనాల సంఖ్య | పూర్తిగా సంతృప్తి పొందిన వినియోగదారులు | సంతృప్తి పొందని వారు | సంపూర్ణ సంతృప్తి శాతం |
|---|---|---|---|---|
| జుట్టు రాలిపోవడం | 70 | 63 | 7 | 90% |
| చల్లబర్చేగుణం | 64 | 56 | 8 | 88% |
| చుండ్రు | 63 | 47 | 16 | 75% |
| జుట్టు తెల్లబడిపోవడం | 46 | 28 | 18 | 61% |




మెరుగుపర్చిన అశ్విని హోమియో హెయిర్ ఆయిల్‌లో సహజసిద్ధమైన మూలికల వల్ల గాఢమైన వాసన ఉంటుంది.



ముడి పదార్థాలు సహజ సిద్ధమైనవి కాబట్టి జుట్టు రాలి పోవడాన్ని ఆపి, కేశ సంపదను పెంచుతుంది.



జుట్టు తెల్ల బడి పోవడాన్ని నిరోధించడానికి మెలనిన్‌ను పరిరక్షించడంలో చక్కగా పని చేస్తుంది.



చుండ్రును నియంత్రించి, సంబంధిత దురదలు, జుట్టు రాలి పోవడాన్ని సమర్థంగా ఆపుతుంది.

Contact : **ASWINI HOMEO & AYURVEDIC PRODUCTS LIMITED.** Hyderabad - 500 018 Ph:23703430 website : www.aswini.com

# వేసవి సెలవుల సందర్భంగా...

## రూ.420/-ల ఇంగ్లీష్ కోర్స్ పూర్తిగా ఉచితం!*

కోర్స్‌తో పాటు 8 ఫెంటాస్టిక్ గిఫ్ట్‌కోర్స్‌లు, 12 భాషల కోర్స్‌లు మరియు కోర్స్‌కు ఉపయోగపడే 5 గిఫ్ట్ పుస్తకాలు కూడా ఉచితం!

లేటెస్ట్ టెక్నాలజీ సహాయంతో తయారు చేయబడ్డ కోర్స్



## మొత్తం మూడు డివిజన్ల ప్రత్యేక ఇంగ్లీష్ కోర్స్

| డివిజన్-1 | డివిజన్-2 | డివిజన్-3 | |
|---|---|---|---|
| రూ.110/- | రూ.140/- | రూ.170/- | రూ.420/- |

**డివిజన్-1** ABCD ల నుంచి ఇంగ్లీష్ చదవటం, రాయటం, నేర్చుతూ, ప్రతి ఒక్కరికీ కావలసిన స్థాయిలో స్టాండర్డ్ ఇంగ్లీష్ నేర్చబడుతుంది. ఈ కోర్స్ ఫీజు రూ.110/-

**డివిజన్-2** తప్పులు లేకుండా ఇంగ్లీషు రాయుటకు కావలసిన ఆంగ్ల వ్యాకరణం పరిపూర్ణంగా సులభ సూత్రాలతో చాలా ఈజీగా నేర్చబడుతుంది. ఈ కోర్స్ ఫీజు రూ.140/-

**డివిజన్-3** ఎంతో సులభంగా, ఏ సందర్భంలోనైనా తడబడకుండా, తప్పులు లేకుండా, మంచినీళ్ళు తాగుతున్నట్లుగా మంచి ఇంగ్లీషు మాట్లాడటం నేర్చబడుతుంది. ఈ కోర్స్ ఫీజు రూ.170/-

## 8 ఫెంటాస్టిక్ గిఫ్ట్ కోర్స్‌లు ఫ్రీ
(8 ఇన్ 1 పాకెట్ సైజులో)

| | |
|---|---|
| 1. ఈజీ మనీ ఎర్నింగ్ కోర్స్ (సులభంగా డబ్బు సంపాదన) | 5. సక్సెస్‌ఫుల్ ఎగ్జామినేషన్ కోర్స్ (పరీక్షలకు తయారు చేసే కోర్స్) |
| 2. సీక్రెట్ మ్యాజిక్ కోర్స్ (మీరూ మ్యాజిక్ చేయవచ్చు) | 6. యోగా కోర్స్ (వివిధ యోగాసనాల వివరణ) |
| 3. జెంట్స్ స్మార్ట్‌నెస్ కోర్స్ (మగవాళ్ళ ఆకర్షణని పెంచే కోర్స్) | 7. పా 'మిస్టరీ' కోర్స్ (మీ చేతిరేఖలు చెప్పే భవిష్యత్తు) |
| 4. బ్యూటీ ట్రీట్‌మెంట్ కోర్స్ (అందంగా కనిపించడం ఎలా? | 8. కిచెన్ ట్రీట్‌మెంట్ కోర్స్ (వంటింట్లో స్త్రీల వైద్యం) |

## Free 12 రోజుల్లో 12 భాషలు Free
(12 ఇన్ 1 పాకెట్ సైజులో)

| | |
|---|---|
| 1. హిందీ స్పీకింగ్ కోర్స్ | 9. అరబిక్ స్పీకింగ్ కోర్స్ |
| 2. తమిళ్ స్పీకింగ్ కోర్స్ | 10. ఉర్దూ స్పీకింగ్ కోర్స్ |
| 3. కన్నడ స్పీకింగ్ కోర్స్ | 11. ఒరియా స్పీకింగ్ కోర్స్ |
| 4. మలయాళం స్పీకింగ్ కోర్స్ | 12. సాన్‌స్క్రిట్ స్పీకింగ్ కోర్స్ |
| 5. బెంగాలీ స్పీకింగ్ కోర్స్ | |
| 6. మరాఠీ స్పీకింగ్ కోర్స్ | |
| 7. పంజాబీ స్పీకింగ్ కోర్స్ | |
| 8. గుజరాతీ స్పీకింగ్ కోర్స్ | |



(బొమ్మలో చూపిన ప్రకారం కాకుండా పాకెట్ సైజు పుస్తకాలే అని గమనించగలరు)

## 5 కోర్స్‌కు ఉపయోగపడే గిఫ్ట్ పుస్తకాలు ఫ్రీ
(5 ఇన్ 1 పాకెట్ సైజులో)

| | |
|---|---|
| 1. ఇంగ్లీష్ డిక్షనరీ (ఆంగ్లపదం - తెలుగుఉచ్ఛారణ - తెలుగు అర్థం) | 5. సినానిమ్ & యాంటోనిమ్స్ డిక్షనరీ (ఆంగ్ల సమాన పదాలు & వ్యతిరేక పదాలు) |
| 2. వర్డ్ పవర్ (ఆంగ్ల పదాల అద్భుత శక్తి) | |
| 3. లెటర్ రైటింగ్ ప్రాక్టీస్ (ఇంగ్లీష్‌లో ఉత్తరాలు వ్రాసే పద్ధతి) | |
| 4. వెర్బ్స్ డిక్షనరీ (క్రియలు - వాటి రూపాలు) | |



## ఈ కోర్స్ ఫ్రీగా పొందటం ఎలా?

1. ఇది ప్రచార పథకంలో భాగంగా ఫ్రీగా ఇస్తున్న కోర్స్. ఈ కోర్స్ 5,000 మందికి మాత్రమే ఫ్రీ... కాబట్టి ముఖ్యమైన విషయం - మీరు కూపన్‌ని వెంటనే పంపాలి. 2. మీ పేరు, చిరునామా స్పష్టంగా రాయాలి. ఈ ప్రకటనలో ఉన్న కూపన్‌నే పంపాలి. జిరాక్సులు అంగీకరించబడవు. 3. దీని తర్వాత రాబోయే కొత్త కోర్స్‌లు కూడా మీకు పంపిస్తాము. ఇవి మీకు తప్పక ఉపయోగపడతాయనేది మా నమ్మకం. 4.ఒక్కొక్కరు ఒక కూపన్ మాత్రమే పంపాలి. 5.కూపన్‌లోని నిబంధనలు వర్తిస్తాయి. 6. ఈ స్కీమ్‌లో యాజమాన్య నిర్ణయమే ఫైనల్.

### ఈ కూపన్ పూరించి వెంటనే పొందండి.

**STUDENTS' ENGLISH INSTITUTE**

2480

New No.203,Ground Floor, Habibullah Road, T.Nagar, Chennai -17.

నాకు ప్రస్తుతం రూ.420/- లు విలువగలిగిన ఇంగ్లీష్ కోర్స్ మరియు (12+8+5) ఉచిత పాకెట్ సైజు పుస్తకాలు ఇవన్నీ కలిపి కేవలం *పోస్ట్, ప్యాకింగ్ మరియు అడ్వర్టైజింగ్ ఖర్చులు నిమిత్తం రూ.100/- లకే వి.పి.పి. ద్వారా పంపించండి. పోస్ట్‌మేన్‌కి సైకం చెల్లించి ప్యాకెట్‌ని తీసుకుంటానని హామీ ఇస్తున్నాను.

(మీ చిరునామా స్పష్టంగా అర్థమయ్యేలా ఇంగ్లీషులో వ్రాయండి. లేనిచో కోర్సును పంపుటకు వీలుపడదు)

Name: ..............................................

Address: ..............................................

..............................................

..............................................

.............................. Pin Code

'హాసం'
హాస్య-సంగీత పత్రిక
Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం

## ఇవీ సంగతులు

39














'సెంటర్ స్ప్రెడ్'లో
'అమ్మనాన్న ఓ తమిళ అమ్మాయి'
'విజయం'
సినిమా పాటల పుస్తకాలు
కలర్‌లో



ముఖచిత్రం
అన్మ

సంపుటి : 2 సంచిక:15

**1-15 మే 2003**

పేజీలు: 68 + 8

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $400

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

39

మే 11 ఘంటసాల అభిమానులకు ఆనందంతో పులకరించే రోజు కాబోతోంది. ఆనాడు ఘంటసాల విగ్రహం హైదరాబాదులోని రవీంద్రభారతి ప్రాంగణంలో పునఃస్థాపించబడుతోంది. సీనియర్లపై అమిత భక్తిశ్రద్ధలు కల గాయకుడు, సజ్జనుడు శ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం తన ఖర్చుతో ఘంటసాల గారి విగ్రహాన్ని తయారుచేయించి, పబ్లిక్‌గార్డెన్స్‌లో స్థాపింపచేయడం అందరికీ తెలిసినదే. పదేళ్ళక్రితం ఆ విగ్రహ ప్రతిష్టాపన జరిగింది కానీ దేశంలో అనేకమంది మహనీయుల విగ్రహాలలాగానే దానికీ ఆలనా, పాలనా కొరవడింది. ఫలితంగా విగ్రహాన్ని చూసినప్పుడు పులకింత కన్నా ఆవేదన ఎక్కువ కానారంభించింది.

ఫిబ్రవరి 11 న ఘంటసాల స్టాంపు విడుదల సమావేశం సందర్భంగా శ్రీ బాలసుబ్రహ్మణ్యం ఈ విషయం ప్రస్తావించి ఆ విగ్రహాన్ని రవీంద్రభారతి ఆవరణలోకి తరలించమని సభాముఖంగా ముఖ్యమంత్రిని అర్థించారు. కార్యశీలురు, కార్యశూరులు అయిన శ్రీ చంద్రబాబు వెంటనే సరేననేశారు. అనడమే కాదు, ఆ హామీ కార్యరూపం ధరించేటట్లు చేశారు, ఫలితమే మే 11 న ఘంటసాల విగ్రహం రవీంద్రభారతిని అలంకరించబోవడం.

ఆ రోజు రవీంద్రభారతి వార్షికోత్సవం కావడం కూడా ఒక విశేషం. అసలు రాష్ట్రానికి రవీంద్రభారతి వంటి ఆడిటోరియం ఉండటమే ఒక విశేషం. ఒక వేదిక లేనిదే కళాసరస్వతి శోభిల్లదని గుర్తించిన మహానుభావులు రవీంద్రభారతికి రూపకల్పన చేశారు. పూర్వకాలం ఏ కళాకారుడైనా సరే తన కళను ప్రదర్శించడాని దేవాలయాన్నే రంగస్థలం చేసుకునేవాడు. వాటికి ప్రవేశరుసుములు లేవు. దైవదర్శనానికి వచ్చిన భక్త సమూహం ఆ దేవుని కథను కావ్యరూపంగానో, నృత్యరూపంగానో చూసి తరించేవారు. తలవూపి కళాకారుడి వెన్నుతట్టేవారు.

ఈనాటి దేవాలయాలు అంత విశాలమైనవీ కావు, భక్తులంత తీరికున్నవారూ కారు. ఇల్లు చేరడం లేటవుతుందనిపించినా, ఏసీ పనిచేయక అసౌకర్యానికి గురయినా ప్రదర్శనకారుల మనోభావాలను కూడా లెక్క చేయకుండా కార్యక్రమం మధ్యలోనే నిష్క్రమించడానికి ఉద్యుక్తులవుతారు. అందువల్ల ఈ ఆడిటోరియంలు నగరం మధ్యలోనే నిర్మించవలసి రావడమే కాదు, ఏ విధమైన సాంకేతికమైన లోటుపాట్లు లేకుండా నిర్వహించవలసిన అవసరం కూడా ఉంది. అటువంటి సామర్థ్యంతో నడుస్తోంది కాబట్టే, ప్రతి జిల్లా ముఖ్యపట్టణంలోనూ రవీంద్రభారతి వంటి ఆడిటోరియంలు నిర్మించబడాలన్న నినాదం తరుచుగా వినబడుతూంటుంది. అద్దంకి వంటి చిన్న ఊళ్ళో జన్మభూమి కార్యక్రమం క్రింద ఆడిటోరియం వెలసినప్పుడు పెద్ద, పెద్ద ఊళ్ళలో ఆ విధంగా జరగడం అసాధ్యం కాదు. దాని అవసరాన్ని పాలకులు, ఊరిప్రజలు గుర్తెరగాలంతే!

ఈనాటి సమాజంలో టీవి ప్రజలను ఒకరికొకరిని దూరం చేస్తోంది. ప్రజలలో పఠనాసక్తి తగ్గింది. పెర్‌ఫామింగ్ ఆర్ట్స్ పైకి ప్రజలు తమ దృష్టి మరలిస్తే ఆ రూపేణా కళలు మరి కొంతకాలం మనగలుగుతాయి. ఆడిటోరియం వద్దకు ప్రజలు చేరడం, ఒకరితో మరొకరు చర్చించుకోవడం, కళాకారులను ప్రత్యక్షంగా చూసి అభినందించడం - ఇవన్నీ హర్షదాయకమైన పరిణామాలు. అందుకే ఊరూరా రవీంద్రభారతులు వెలిసే రోజు రావాలని "హాసం" కోరుకుంటోంది.

ఘంటసాల విగ్రహం రవీంద్రభారతికి తరలిరావడంపై "హాసం" మరొకవిధంగా కూడా హర్షం ప్రకటిస్తోంది. రవీంద్రుడు విశ్వకవే కావచ్చు. ఆయన పేర నగరం నడిబొడ్డున గొప్ప కళావేదిక నడుస్తూండవచ్చు. కానీ అది తెలుగుతనానికి ప్రతీక కాదు. ఘంటసాల రాకతో ఆ లోటు తీరిపోతోంది. తెలుగువారికి కర్ణాటక, హిందూస్తానీ సంగీతంతో బాటు ఘంటసాల సంగీతం కూడా ఉందని వేటూరివారు నికార్సైన సత్యం పలికారు. రవీంద్రభారతిలో పెర్‌ఫామ్ చేయబోయే ప్రతి సంగీతకళాకారుడికి ఆశీస్సులందించడానికి ఘంటసాల అక్కడ విచ్చేసివున్నారని అనుకుంటూ ఉంటే మనసు పులకరిస్తోంది.

సంగీతానికి భాషాభేదాలు లేవని అంటూనే ఈ పక్షపాతమేమిటని అడగబోయేవారికి మా జవాబు - ఈ స్వభాను.... కాదు, కాదు, స్వభాషా... సంవత్సరంలో కించిత్తు పక్షపాతం చూపినా క్షమార్హమేనని!



మంచి మూడ్‌లో అన్న మాటల్ని తన లవర్ డైలాగులుగా రాసేసి
రచంప్రతిగా పేరు తెచ్చేసుకుంటే - ఆమెనే ఇంటర్వ్యూ
చేయాల్సి వస్తే - ఓ జర్నలిస్ట్‌కి ఎలా ఉంటుందో తెలిపే సునిశిత హాస్యకథే.... ఈ...

# వీడని బంధం

- జయంతి కిరణ్మయి



సత్యం బాబాయి క్లబ్బులో ఓ రోజు సాయంత్రం అందరూ కాఫీ, టీలు సేవించి, వేడి వేడి పకోడీలు, బజ్జీలు లాగించి చిద్విలాసంగా కూర్చుని ఉండగా, వాళ్ళ కబుర్లు టీ.వి. సీరియల్స్ మీదకి మళ్ళాయి.

"వీళ్ళు ఇలా రెండొందలు, మూడొందలు ఎపిసోడ్స్ ఎలా రాస్తారో" అని విస్తుపోయాడు వాసు.

"అది సరే, ఒకేసారి నాలుగు అయిదు మెగా సీరియల్స్ ఎలా రాసేస్తారో అది ఆలోచించు" అన్నాడు శీను.

"ముఖ్యంగా ఆ కమల కోమలి అన్నేసి సీరియల్స్ ఒకేసారి ఎలా రాసేస్తుందో" ఆశ్చర్యంగా అన్నాడు ప్రసాదు.

అంతవరకూ అందరి మాటలూ చిద్విలాసంగా వింటున్న సత్యం బాబాయి గొంతు సర్దుకున్నాడు. మిస్సమ్మలో ఎన్.టి.ఆర్. లా ఓ సిగరెట్టు వెలిగించి, వాలు కుర్చీలో సర్దుకు కూచున్నాడు. వెంటనే అక్కడున్న అందరికీ అర్థమైపోయింది బాబాయి కథ చెప్పబోతున్నాడని.

"మిగతా వారి మాట ఎలా ఉన్నా. 'వావిరాల కమల కోమలి' 'పాకాల కమల కోమలి'గా ఉన్నప్పట్నించీ నాకు తెలుసు."

'వావిరాల అంటే ఆవిడ మీ చుట్టమా'? అడిగాడు అనంత్.

'ఆహా! మా విశ్వనాథాన్ని పెళ్ళాడాకే ఆవిడ వావిరాల కమల కోమలి అయింది. అసలు వాళ్ళ పెళ్ళి ఎలా జరిగిందో చెప్తే, ఆవిడ ఒకేసారి ఇన్ని సీరియల్స్ ఎలా చేస్తోందో మీకే తెలుస్తుంది' అంటూ కథ మొదలెట్టాడు సత్యం బాబాయి.

మా విశ్వనాథం 'చిత్రసీమ' పేపరులో సినిమాలకీ, టి.వి. ప్రోగ్రాంలకీ రివ్యూలు అవీ రాస్తూ ఉంటాడు. ఉద్యోగంలో చేరిన కొత్త గనక, మూడు నెలల పాటు వచ్చిన కొత్త సినిమానల్లా చూసేసి, టి.వి.లో వస్తున్న సీరియల్స్ అన్నీ శ్రద్ధగా చూడటంతో విశ్వం ఆరోగ్యం దెబ్బతింది. వాళ్ళ ఎడిటర్ కాస్త పెద్దవాడు, అర్థం చేసుకోగల వాడు కనుక విశ్వానికి ధైర్యం చెప్పాడు. అసలు ఆగకుండా నెల రోజులు పని చేసిన వాళ్ళు ఎవ్వరూ లేరు. నువ్వు చాలా నయం. ఒక్క వారం ఏదన్నా దూరప్రదేశానికి వెళ్ళి రెస్టు తీసుకొనిరా అని శలవిచ్చి పంపించాడు. దెబ్బతిన్న మనసుని కూడదీసుకునేందుకు ఊటీ వెళ్ళిన విశ్వానికి

అక్కడ కుక్క పిల్లతో ఆడుకుంటున్న కమలని చూడగానే హృదయం పరవశించింది. కోటి వీణలు ఒక్కసారే మోగినట్టు వినిపించాయి. బుట్టల కొద్దీ గులాబీలు రాఘవేంద్రరావు సినిమాలోలా మీద పడినట్టు అన్పించింది.

ఇద్దరూ కలిసి షికార్లకీ, పార్కులకీ వెళ్ళాక తనకీ అలానే అనిపించిందని కమల చెప్పింది.

పార్కులో తిరుగుతూ 'ఇచ్చేశా నా హృదయం తీసుకో' లాంటి ప్రేమ పాటల్ని డైలాగుల్లా చెప్పుకున్నారు. ఎన్నో మాటల్ని ప్రేమ పాటల్లా పాడుకున్నారు. చక్కటి ప్రేమ జంటలకి మాత్రమే అర్థమయ్యే ఎన్నో అందమైన గుసగుసలు చెప్పుకున్నారు.

అందమైన పూలతోటలో కూచుని కమల కళ్ళలోకి చూస్తూ చక్కటి కవిత్వం అల్లాడు. ఆ కవిత్వాన్ని కమలకే అంకితం చేస్తూ రాగయుక్తంగా పాడాడు కూడా. అలా విజృంభించి ఆరు రోజులు ప్రేమించుకున్నాక, ఏడో రోజు పడవ షికారులో కమల చేతినందుకుని, మళ్ళీ ప్రేమభాష వరదలై వెల్లువలా పొంగుతున్న తరుణంలో, కమల అతని వాక్ప్రవాహానికి ఆనకట్ట వేస్తూ ఓరగా విశ్వం వైపు చూసి ముసిముసిగా నవ్వింది.

"ఇంతకాలం నీ దగ్గర ఓ విషయం దాచాను విస్సు, ఆ విషయం చెప్తే నీ సంతోషానికి పట్ట పగ్గాలుండవు" అంది చీరకొంగు ముడిపెడుతూ.

సాధారణంగా సినిమాల్లోనూ, సీరియల్స్ లోనూ హీరోకి పెద్ద కష్టం రాబోయే ముందే మనందరికీ ఆ విషయం తెలిసి పోతూ ఉంటుంది. కానీ, అన్ని సినిమాలు, సీరియల్స్ ఏకధాటిగా చూసినా విశ్వానికి నిజ జీవితంలో రాబోయే కష్టం ముందుగా ఏమాత్రం తేలీలేదు.

రాబోయే భూకంపాన్ని ఏ మాత్రం ఊహించకుండా, చిరునవ్వుతో కమల ఏం చెప్తుందోనని ఎదురు చూస్తున్నాడు.

కమల సిగ్గుతో మొహం ఎర్రబడగా, 'నేను టి.వి. సీరియల్స్ కోసం కథ రాస్తున్నాను' అంది.

అంతవరకూ స్థిరంగా ఉన్న కొండలూ, చెట్టూచేమ, ఆ సరస్సూ అన్నీ గిరగిరా తిరగడం మొదలెట్టాయి. భూమి తనచుట్టూ తాను తిరుగుతుందని తెలుసు కానీ, ఇంత వేగంగా తిరుగుతుందని ఊహించని విశ్వం బిత్తర పోయాడు. మొత్తం మీద మళ్ళీ ప్రపంచం యథాస్థానంలోకి వచ్చి, అన్నీ మామూలుగా కన్పించేసరికి,

"నేనో వారం, పదిరోజుల తర్వాత వస్తాను. ఈ కథ పూర్తిచేసి" అంటోంది కమల సిగ్గుగా.

భారమైన హృదయంతో హైదరాబాదు బయల్దేరాడు విశ్వం. అసలు కమల రాస్తున్నది 'ప్రేమకథ' అని తెలిశాక, కొంత భారం తగ్గింది. అత్తా కోడళ్ళ దెబ్బలాటల్లో మునిగి తేలుతున్న టి.వి. లోకం కమల కథని ఒప్పుకున్నప్పుడు కదా అని తనకి తనే ధైర్యం చెప్పుకున్నాడు.

హైదరాబాదు వచ్చాక వాళ్ళ ఎడిటరు "ఇంకా నువ్వు పూర్తిగా తేరుకున్నట్టు లేదు, సినిమా రివ్యూలు మాత్రమే రాయి. సీరియల్స్ వేరే ఎవ్వరి చేతనైనా రాయిస్తాను. అన్నాడు ఉదారంగా. 'కుర్రాళ్ళు మీరే తట్టుకోలేకపోతే ఎలాగయ్యా? రేపీ ఉద్యోగంలో పైకెలా వస్తావు' అని మందలించాడు కూడాను.

అలా ఓ నెలరోజులు గడిచి, కాస్త విశ్వం మనుష్యుల్లో పడుతున్న రోజుల్లో ఓ రాత్రి ఎనిమిదింటికి కమల నుంచి ఫోన్ వచ్చింది. 'టీ.వి. పెట్టు 'మన' ఛానెల్ లో నా సీరియల్ ప్రారంభం ఇవాళే' అంది సంతోషంగా. ఆశ్చర్యంగా టి.వి.పెట్టాడు విశ్వం.

నిజంగానే టి.వి.లో కొత్త సీరియల్ ప్రారంభం 'వీడని బంధం' రచన- కమల కోమలి ప్రారంభం అయింది. పది నిమిషాలు ఆ సీరియల్ చూసేసరికి విశ్వం మొహం అంతా కందగడ్డలా ఎర్రగా అయిపోయింది. బోనులో పడ్డ సింహంలా, కాలు గాలిన పిల్లిలా గదంతా తిరుగుతూ మనిషి మెలికలు తిరిగిపోయాడు.

టి.వి.లో ప్రేమికులిద్దరూ విశ్వమోహన్, విమల పార్కులో కూచుని ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుంటూ ప్రేమించుకుంటున్నారు. ముందు ఆ డైలాగులు ఎక్కడో విన్నట్టు అన్పించాయి, కొంచెం సేపయ్యాక అవి తనే అన్నట్టు గుర్తు వచ్చింది.

రాను రాను తను ఊటీలో ప్రేమ మత్తులో కమలతో అన్న మాటేనని అర్థమౌతున్న కొద్దీ విశ్వం మెలికలు తిరిగిపోయాడు. రేపట్నుంచీ నలుగురికీ మొహం ఎలా చూపించడం? ఎంత ప్రేమైతే మాత్రం మరీ ఇలా మాట్లాడానా అనుకుంటూ భారంగా టి.వి.వైపు చూశాడు. అతని అదృష్టం బావుండి మిగతా భాగం రేపు అని స్లైడు వచ్చేసింది.

'అమ్మయ్య!' అనుకున్నాడు విశ్వం. మళ్ళీ ఇలాంటి ప్రేమకథలు జనాలేం చూస్తారులే అనికూడా అనుకున్నాడు. ఒక్క పది రోజుల్లో ఈ సీరియల్ని జనం చూడటం లేదని ఎత్తేస్తారు. దాంతో కమల సరదా కూడా తీరిపోయి ఇంక కథలు రాయడం మానేస్తుంది. ఒక్క రెండు వారాలు కాస్త కళ్ళు మూసుకుంటే, తర్వాత హాయిగా ఉండచ్చు అని తనకి తనే ధైర్యం చెప్పుకున్నాడు.

కానీ, జనం సంగతి పెద్ద పెద్ద వాళ్ళే చెప్పలేకపోయారు. వాళ్ళకి ఎప్పుడేం నచ్చుతుందో, ఎప్పుడేది నచ్చదో ఎంతటి వాళ్ళకీ అర్థం కాదు.

అటు అర్థం పర్థం లేని పంతాలు, ఇటు వెకిలి వేషాలూ, చెత్త చేష్టలతోనూ, అసహ్యమైన డైలాగులతోనూ విసిగిపోయిన జనం కమల కోమలి సీరియల్ 'వీడని బంధం'ని అమితంగా ఆదరించారు. అసలు టి.వి. చరిత్రలోనే ఇంతమంచి సీరియల్ రాలేదన్నారు.

యువతీ యువకుల మధ్య ఇంత సున్నితమైన ప్రేమ, ఇంత చక్కటి సంభాషణలు ఇంత వరకూ ఎవ్వరూ సృష్టించలేదన్నారు. భాష మీద కమాండు, అంతరంగాలు అర్థం చేసుకునే తెలివితేటలు ఉన్నవాళ్ళే ఇంత సున్నితమైన సంభాషణలు రాయగలరన్నారు.

మనసునర్థం చేసుకునే మంచి రచయిత్రిగా చక్కటి భాష వాడే ప్రవీణగా కమలని అందలం ఎక్కించేశారు. ఆ ఆనందంలో కమల కొట్టుకుపోతోంది. ఆ సంతోషం, ఆ పేరు ప్రతిష్ఠలు తనని ఉక్కిరిబిక్కిరి చేసేశాయి.

ఈ హడావిడిలో విశ్వనాథం పరిస్థితి మాత్రం రోజుకోజుకీ క్షీణించి పోతోంది. ఓ వైపు రోజూ టి.వి.లో ఆ డైలాగులు వింటున్న కొద్దీ, అవి-మాట్లాడినది తనేనని తలుచుకుని సిగ్గు పడిపోతున్నాడు. మరోవైపు రోజురోజుకీ కమల దర్శనం దొరకడమే గగనం అయిపోతోంది.

"కమలా నేను విశ్వాన్ని ఇవాళ డిన్నర్‌కి హోటల్‌కి వెళ్దామా"

"సారీ విశ్వం ఇవాళ నాకు 'నవ సాహితి సంఘంలో సన్మానం ఉంది'.



'పోనీ, రేపు మధ్యాహ్నం సినిమాకి వెళ్దామా?

'కుదరదు విశ్వం, రేపు మధ్యాహ్నం 'నేటి సీరియల్స్ - యువతపై వాటి ప్రభావం' గురించి 'నవ్యాంధ్ర సంఘం'లో మాట్లాడాలి'.

'సరేలే, రేపు రాత్రి?'

'సారీ, ప్రేమ-మానసిక విశ్లేషణ' మీద...

'సరే అర్థమయింది. ఉంటాను అయితే'

'అలాగే!'

'ఆహా!'

ఇలాంటి సంభాషణలు ఓ మూడునాలుగు సార్లు జరిగాయి.

ఓ రోజు గులాబీలు తీసుకుని కమల వాళ్ళ ఇంటికి వెళ్తే, అప్పటికే ఆమె జడలో పెద్ద మల్లెల మాల ఉంది.

'నీకు మల్లెలకన్నా గులాబీలే ఇష్టం కదా' అన్నాడు విశ్వం ఆశ్చర్యంగా.

'నేను మల్లెపూలే పెట్టుకోవాలి. నా లాంటి మనసు రచయిత్రులకి కుసుమ కోమలంగా గుబాళించే మల్లెలే అందాన్నిస్తాయని సురేష్ చెప్పాడు' అంది.

'ఈ సురేషెవడు? మొన్న నీతో 'రాగరంజని' సభలో కన్పించిన వాడేనా? అసలెవరతను' అంటూ దూకుడుగా అడిగాడు.

'అతను నా పి.ఆర్.ఓ' అంది కమల

'నీకు పి.ఆర్.ఓ. ఎందుకు?' ఆశ్చర్యపోయాడు విశ్వం.

'ఇప్పుడు నా సీరియల్స్, కథలు అన్నీ అతనే చూస్తున్నాడు. నేను ఏఏ సీరియల్స్‌కి కథలు, మాటలు రాయాలి, ఏ సభలకి వెళ్ళి ఏ విషయం మీద మాట్లాడాలి, ఆ వెళ్ళినప్పుడు ఎలాంటి చీరలు కట్టుకోవాలి ఇవన్నీ అతనే చెప్తాడు. చాలా తెలివైన వాడు తెలుసా.'

ఇంకా ఏదో చెప్పబోతుంటే విసుగ్గా కదిలాడు విశ్వం.

'అతను నాకు నచ్చలేదు. పి.ఆర్.ఓ. అంటే కాస్త పెద్దవాడు, మర్యాదగా కన్పించేవాడుగా ఉండాలి కానీ, ఆతనేమిటి తెల్లగా, పొడుగ్గా అంత అందంగా ఉన్నాడు. ఆ సురేష్ నాకస్సలు నచ్చలేదు. వెంటనే అతన్ని ఉద్యోగంలోంచి తీసేయి' కోపంగా చెప్పాడు విశ్వం.

'అతను నాకు చాలా నచ్చాడు. నేను పొరపాటునా కూడా అలాంటి పని చేయ్యను' ఇంకా విసురుగా చెప్పింది కమల.

'అయితే సరే నేను వెళ్ళొస్తాను' అంటూ కోపంగా బయటికి వచ్చేశాడు విశ్వం.

అదే కోపంతో దూకుడుగా ఆఫీసుకొచ్చిన విశ్వం చాలా శ్రద్ధగా పని చేసెయ్యడం మొదలెట్టాశాడు.

రోజుకి రెండేసి తెలుగు సినిమాలు చూడటం, ఒకోసారి సినిమా చూసి రాగానే టీ.వి. సీరియల్ చూడలేక అవస్థ పడుతున్న కొత్త కొలీగ్‌కి ఆ సీరియల్ కూడా చూసేసి, రివ్యూ కూడా రాసివ్వడం లాంటి ఫీట్లన్నీ చేసేస్తున్నాడు.

ఆ రోజుల్లోనే ఓసారి ఒకే రోజు రెండు తెలుగు సినిమాలు రిలీజ్ అయితే, అవి రెండూ చూసేసి, ఇంటికొచ్చి రెండు తెలుగు సీరియల్స్ కూడా చూసేసి, అన్నిటి మీదా రివ్యూ రాసేశాడు. ఇంత గొప్ప ప్రయోగం ఇంతవరకూ ఎవ్వరూ చెయ్యలేదని ఇప్పటికీ జర్నలిస్టులందరూ చెప్పుకుంటూ ఉంటారు.

అలా విశ్వం విజృంభిస్తుండగా ఒకనాడు వాళ్ళ ఎడిటరు అతన్ని పిలిచి 'వీర వనిత రుద్రమదేవి' గారి ఇంటర్వ్యూ, 'శోకదేవత సీతామహాలక్ష్మి' గారి ఇంటర్వ్యూ ఒకే రోజు తీసుకున్నావని తెలిసింది. అలాంటి రిస్కులు తీసుకోకయ్యా బాబూ. కావాలంటే నాలుగు రోజులు సెలవుపెట్టి ఏ ఊటినో వెళ్ళిరా. నీ ఆరోగ్యం పాడయితే ఏంగాను' అంటూ భోరుమన్నాడు.

'నాకేం ఫర్లేదు సార్ ఇంకా ఏవన్నా ఇంటర్వ్యూలుంటే చెప్పండి, ఏకంగా చేసుకొచ్చేస్తాన'న్నాడు విశ్వం కృతనిశ్చయంతో.

'ఇది నీకెంత కష్టమో నేనూహించగలను. నువ్వు చెయ్యలేక పోతే బలవంతం ఏమీ లేదు. ఆ భాస్కర్ నిన్ననే శెలవ నించీ వచ్చాడు. అతన్ని పంపుతాను. కానీ అర్భకుడని ఆలోచిస్తున్నాను.

'ఏం ఫర్లేదు సార్ నేను చేస్తానుగా, చెప్పండి ఎవర్ని ఇంటర్వ్యూ చెయ్యాలో' ధైర్యంగా అన్నాడు విశ్వం.

'రేపు మన దీపావళి స్పెషల్‌కి కమల 'కోమలి'తో 'పూలమనసులు, తేనె పలుకులు' అనే శీర్షికమీద ఇంటర్వ్యూ వెయ్యాలి'.

పాలిపోయిన విశ్వం మొహం చూస్తునే ఆ పెద్దాయన 'నాకు తెలుసు విశ్వం. ఇప్పటికైనా నీకు వీలుకాదంటే చెప్పు. నేనేమీ అనుకోను. ఎలాగోలా ఆ భాస్కర్‌ని పంపుతాను. ఇప్పుడున్న వాళ్ళందరిలో ఈ కమల కోమలే అందరికన్నా అధ్వాన్నం అని విన్నాను' అన్నాడు సానుభూతిగా.

ఈ లోపల తేరుకున్న విశ్వం 'కంగారు లేదులెండి. నేనే చేస్తాను' అన్నాడు ధీరోదాత్తంగా.

ఆ రోజు సాయంత్రం నాలుగన్నరకి చిరపరిచితమైన ఆ ఇంటి మెట్లు ఎక్కుతుంటే ఉద్వేగంతో అతని గొంతు తడారిపోయింది.

తలుపులు తీసిన కమల కళ్ళు ఒక్క క్షణం సంతోషంతో తళుక్కుమన్నాయి.

'మా పత్రిక దీపావళి సంచికకి మీరు ఇంటర్వ్యూ ఇస్తానన్నారు కదా' అన్నాడు విశ్వం.

'ఓ! ఔనౌను. మీరేనా? రండి, రండి ఇంతకీ మీ పేరేమిటి' అంటున్న కమల వైపు కోపంగా చూస్తునే 'విశ్వనాథ్' అన్నాడు పళ్ళ బిగువున.

'మనం ఇంటర్వ్యూ మొదలు పెడదామా' అన్నాడు.

'అలాగే! నా పేరు కమల కోమలి. నాకు చిన్నప్పట్నించీ రచనలు చెయ్యడం అంటే ఎంతో ఇష్టం. పూలన్నా, పూలలాంటి పిల్లలన్నా ఎంతో ప్రేమ'.

'మాడమ్ 'పూలతో నేను' కాప్షన్ కోసం మీరు పూలతోటలో విహరించే ఫోటో ఒకటి కావాలండీ.'

'అలాగే, పూలేకాదు, తేనె పలుకుల పసిపిల్లలన్నా నాకు చాలా ఇష్టం. పిల్లలతో ఆడుకుంటున్న ఫోటో కూడా ఇస్తాను.'

'మాడమ్! మీరు 'వీడని బంధం' తర్వాత ఇంకా ఏ సీరియల్స్ చేస్తున్నారు? ఎన్ని 'చిన్న సీరియల్స్' చేస్తున్నారో వివరాలు చెప్తారా దయచేసి, మా పాఠకులంతా ఎంతో ఆశగా ఎదురు చూస్తున్నారు.'

అంతవరకూ బిగపట్టుకున్న కమల ఒక్కసారి భోరుమంది. విశ్వం చేతిలో పుస్తకం విసిరేయడం, కమలని తన దృఢమైన చేతుల్లో బంధించడం, ఆమె తల అతని గుండెల మీద వాలిపోవడం అన్నీ క్షణాల్లో జరిగిపోయాయి.

ఇప్పుడు తను మాట్లాడే మాటలన్నీ రేపు ఏదో సీరియల్ రూపంలో టీ.వి.తెరమీద ఎవడో అప్పచెప్పేస్తాడని తెలుస్తూనే ఉన్నా, సున్నితంగా కమలని ఓదారుస్తూనే ఉన్నాడు విశ్వం.

ఓ పది నిమిషాల్లో ఆ ఉధృతం తగ్గింది. అప్పుడడిగాడు ఏం జరిగిందని.

సు...సు...సు... అంటూ మళ్ళీ వెక్కిళ్ళు



పెట్టసాగింది. ఎలాగో కష్టపడి 'సురేష్' అని మళ్ళీ ఏడుపు మొదలెట్టింది.

విశ్వానికి విషయం అర్థమైపోయింది. 'ఏం చేశాడు వాడు చెప్పు? నిన్నేమన్నా అన్నాడా? భుజం మీద చెయ్యి గానీ వేశాడా? ఏం చేశాడో చెప్పు. వాడి కాళ్ళు, చేతులు విరక్కొట్టేస్తాను? ఎముకలు పిండి చేసేస్తాను. ఎం.ఎ. చదివే రోజుల్లో ఉస్మానియా యూనివర్శిటీలో రౌడీని నేను. ఒక్క గుద్దు గుద్దానంటే భళ్ళున రక్తం కక్కాలి' ఆవేశంతో ఊగిపోయాడు.

'అవేం కాదు. ఆవేశ పడకు. అతను నన్నేం చెయ్యలేదు'.

'మరి ఏడుస్తున్నావెందుకు'?

'నాకు కాంట్రాక్టులు ఫిక్స్ చేసేస్తున్నాడు. అప్పుడే నాలుగు పెద్ద సీరియల్స్‌కీ, 15 చిన్న సీరియల్స్‌కి ఫిక్స్ చేసేశాడు. అందరూ చెక్కులు పంపించేస్తున్నారు. ఇప్పుడు నేనేం చెయ్యను' అని మళ్ళీ భోరుమన బోయింది.

'ఆగాగు! ఏడవకు. హాయిగా డబ్బొస్తుంటే ఖర్చు పెట్టుకోక ఏడుస్తున్నావెందుకు' అన్నాడు విశ్వం.

'నా తలకాయ ఎలా ఖర్చుపెట్టుకోను? ఇపుడు వీళ్ళందరికీ కథలు రాసి ఇవ్వద్దూ? నాకు ఒక్క కథ కూడా రాయడానికి రావడం లేదు. ఏం చెయ్యాలో తోచడం లేదు.

'మళ్ళీ భోరుమనకు ఏం చెయ్యాలో నేను చెప్తాను. మనం ఆ డబ్బు తీసేసుకుందాం. అడిగిన వాళ్ళందరికీ పెద్దవీ, చిన్నవీ కథలూ, సీరియల్స్ అన్నీ ఇచ్చేద్దాం. నీకెందుకు కంగారు పడకు' అన్నాడు విశ్వం కమల భుజాల చుట్టూ చెయ్యివేసి.

'ఎలా ఇస్తాం?' పెద్ద పెద్ద కళ్ళు పైకెత్తి ఆశ్చర్యంగా అడిగింది కమల.

'నీకు తెలీదు కానీ జర్నలిస్టుని కాకముందు నేనూ చాలా నవలలూ, కథలూ అవీ రాసేవాడిని. అవి పట్టుకొని పత్రికాఫీసుల చుట్టూ, టీ.వి. ఛానెల్స్ చుట్టూ తెగతిరిగాను. జ్ఞానోదయం అయ్యాక అవన్నీ కట్టకట్టి అటకమీద పారేశాను. రేపు అవన్నీ తీసి. దుమ్ము దులువుదాం. అవన్నీ నువ్వు హాయిగా వాడుకుందువుగాని. ఇంక నువ్వు బాధపడకు' అంటూ అభయమిచ్చాడు.

'వినవ్వా నువ్వు నన్ను బతికించావు. ఇంతకాలం నిన్ను దూరం చేసినందుకు నన్ను క్షమించవూ' అంటూ అతని కౌగిలిలో ఒదిగిపోయింది.

'వద్దయ్యా బాబూ, రేపు టీ.వి. మీద ఈ మాటలన్నీ వచ్చేస్తాయి మాట్లాడద్దు.' అని బుద్ధి మొత్తుకుంటున్నా,

ఇలాంటి సమయంలో బుద్ధి మాట వినడమా అంటూ అతని మనసు సంతోషంతో వసంతంలో కోయిలలా అద్భుత గీతాలాలపిస్తూ పరవశించింది. ఆమెని కౌగిలిలో పొదివి పట్టుకుని వరదలా, వెల్లువలా మాట్లాడసాగాడు విశ్వం.

కట్ చేస్తే, వాళ్ళ పెళ్ళి జరిగిపోయింది. వావిరాల కమల కోమలి గొప్ప రచయిత్రి అయిపోయింది. విశ్వనాథాన్ని పెళ్ళిచేసుకున్నాక తనకి ఇంత గొప్ప పేరు వచ్చినందుకు సెంటిమెంటల్‌గా తన సీరియల్స్ అన్నిటికీ 'వ' అక్షరంతో మొదలయ్యే పేర్లే పెడుతోంది.

ఆ రోజు కమల చెవిలో విశ్వం ఏం చెప్పాడో తెలుసుకోవాలంటే మాత్రం 'ఏ టీ.వి.'లో 'వలపు గెలుపు' సీరియల్ 345 వ ఎపిసోడ్ చూడాల్సిందే నంటూ కథ ముగించాడు సత్యంబాబాయి. ■

# ఘంటసాల క్విజ్

మొదటి బహుమతి : రూ. 250/-
రెండవ బహుమతి : రూ. 200/-
మూడవ బహుమతి : రూ. 150/-
} మరియు ఘంటసాల కలర్ ఫోటో



## క్విజ్‌నెం-1

1. ఘంటసాల సంగీత దర్శకత్వం వహించిన తొలి చిత్రం?
జ: .............................
2. ఘంటసాల తొలిసారిగా సంగీత దర్శకత్వం వహించిన విజయా వారి చిత్రం?
జ: .............................
3. ఘంటసాల పాడుతూ కనిపించిన చిత్రం?
జ: .............................
4. ఘంటసాల గీతాన్ని తొలిసారిగా హెచ్.ఎం.వి. సంస్థ తరపున రికార్డు చేయించిన వ్యక్తి?
జ: .............................
5. ఘంటసాల సతీమణి పేరు?
జ: .............................

### నిబంధనలు:

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ ట్రస్ట్-హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ ట్రస్ట్' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరుసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్,
హైదరాబాద్-500 018.

**కూపన్‌లు 15-5-2003 లోగా చేరాలి**

**క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ**

డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ ట్రస్ట్,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.

మే 9 న రవీంద్రనాథ్ టాగూర్ జయంతి సందర్భంగా....



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

# లలిత సంగీతం

## వని వికసించెవిరి

ప: వని వికసించెవిరి - పక్షి ఏలా రాదోయ్
ఏలా రాదోయ్ పక్షి - ఏ దూరాకాశము నుండి పిలుతు
పిలుతునిటకు పక్షి - పక్షి ఏలా రాదోయ్ ఏలా రాదోయ్ పక్షి ॥వని వికసించెవిరి॥

1చ: వాయు వీచికలు మత్తిలిరేగే
లేచివుళ్ళ నృత్యమ్ములు సాగేనోయ్
ఈ మధు గానాలాపన వేళా
ఆ మాధుర్యమదేదోయ్ - పక్షి ఏలా రాదోయ్
ఏలా రాదోయ్ పక్షి ॥వని వికసించెవిరి॥

2చ: విహ్వాలమై హృదయహరమై పిల్చునదేని స్వనమో
సాగరపార వనతీరాన విడిచి రెవ్వరోదాని
వృథాయెనా మధుమాస మిదే మరిమరి నాకై పిల్చునదేనోయ్
వృథావిలమ్మి రేయిని పక్షి ఏలా మోసము చేసే
పక్షి ఏలా రాదోయ్ ఏలా రాదోయ్ పక్షి ॥వని వికసించెవిరి



రచన, సంగీతం : విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్
తెలుగు అనువాదం : మల్లవరపు విశ్వేశ్వరరావు
గానం : శ్రీమతి వక్కలంక సరళ
రాగం : మిశ్ర శంకరాభరణం
-మిశ్ర బిలావల్ (హిందుస్తాని సం॥)
తాళం : చతురశ్ర ఏక (కర్ణాటక సం॥)
- కహరువా (హిందుస్తాని సం॥)
ఆరోహణ : స రి గ మ ప ద ని స
అవరోహణ : స ని ద ప మ గ రి స

-షడ్జము, చతుశ్శృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశ్శృతి దైవతం, కాకలి నిషాదం- యీ రాగంలోని స్వరాలు.

ఇవే కాకుండా శుద్ధ దైవతము, ప్రతిమధ్యమం కూడా చేర్చబడినాయి యీ రాగంలో. బెంగాలీ సంగీత పద్ధతికి కొంత ఆ ప్రాంతపు జానపద శైలిని కూడా చేర్చి రవీంద్రుడు కూర్చిన బాణీకి, శాంతినికేతన్‌లో రవీంద్రుని వద్ద శిష్యరికం చేసిన మల్లవరపు విశ్వేశ్వరరావు తెలుగు అనువాదం చేసి "వని వికసించెవిరి" అంటూ చక్కని విరహగీతాన్ని అందించారు. గీతరచన తెలుగు భాషలో ఉన్నా దాని బాణీని మాత్రం బెంగాలి సంగీత పద్ధతిలోనే గానం చేయాలి. శ్రీమతి వక్కలంక సరళ చక్కని భావ ప్రకటనతో సుమధురంగా యీ పాటను గానం చేసింది. బెంగాలీ గేయాలలో చాలా వాటిలో శుద్ధ దైవత ప్రయోగం ప్రముఖంగా కనిపిస్తూంటుంది. గేయం ఏ రాగంలో సాగినా మధ్యలో శుద్ధ దైవత ప్రయోగం చేయడం వలన ఒక నూతనత్వము, ఒక రిలీఫ్ మాత్రమే కాకుండా బెంగాలీ సంగీత శైలి ప్రస్ఫుటంగా కనిపిస్తూ, ఆ ప్రాంతీయ సంగీతానికి ప్రతీకగా నిలుస్తుంది. చలన చిత్రాలు, ఆకాశవాణి కేంద్రాలు 1930 వ దశకంలో ప్రారంభమైన తరువాత హిందీ, తెలుగు మొదలగు పలు భారతీయ భాషా చిత్రాల స్వరకర్తలు బెంగాలీ సంగీతం, ఆ ప్రాంతపు జానపద సంగీతరీతులచే స్ఫూర్తిని పొంది వారివారి భాషా గీతాలకు కొన్నిటికి వంగ సంగీతపు బాణీలను సమకూర్చారు.

తెలుగు నేల మీద భావ కవితాలత వేళ్ళూనుతున్న తరుణంలో భావకవులనేకుల మీద రవీంద్ర కవీంద్రుని ప్రభావం ప్రసరించింది. కొందరు శాంతినికేతన్‌లో శిక్షణ పొందారు కూడా.

రవీంద్రుడు తన మనోహర గీతాలకు మధుర సంగీతాన్ని సైతం కూర్చిన వాగ్గేయకారుడు. ఆయన రచించిన దాదాపు 3 వేల గీతాలకు బాణీలతో సహా "రవీంద్ర సంగీత్" అనే పేరుతో వంగీయులు నేటికీ పరిరక్షించుకుంటున్నారు. ఆ గీతాల్లో కొన్నింటిని శ్రీరంజనీకాంతరావు. శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు మున్నగు కవులు తెలుగున కనువదించారు. 1961లో రవీంద్రుని శత జయంతి ఉత్సవాలను పురస్కరించుకుని అన్ని ప్రాంతీయ భాషలలోను రవీంద్రుని గీతాల నువదించిఆకాశవాణి ప్రసారం చేసింది. ఆ సందర్భంగా దాదాపు 30,40 పాటలు తెలుగులోకి అనువదిం చడం జరిగింది. నేను, వక్కలంక సరళ, సీత, అనసూయ మొ॥ కళాకారులం గానం చేశాము. ఆ ఏడాది శత జయంతి సందర్భంగా జాతీయ కార్యక్రమాల కోసం శాంతినికేతన్ నుండి రవీంద్రసంగీత్‌లో నిష్ణాతుడు శ్రీశాంతిదేవ్ ఘోష్ మద్రాసు వచ్చారు. వివిధ భాషా గీతాలతో రూపొందించబడిన ఆ కార్యక్రమంలో ఆంధ్రప్రదేశ్ తరపున నేను తెలుగు అనువాద గీతాలను పాడాను.

మధుమాసవేళ పవన వీచికలను మత్తిల చేస్తూ వనిలో వికసించిన విరి నేపథ్యంగా గుండెను తట్టే తీయని విరహ వేదనను ప్రస్ఫుటం చేస్తుంది సరళ పాడిన "వనివికసించెవిరి" అనే గీతం. అవ్యక్తభావపరీమళాలను వెదజల్లే రవీంద్రుని కవితా మహత్తునకు మచ్చుతునక యీ గీతం అనడంలో అతిశయోక్తి ఏమాత్రమూ లేదు.

ప॥ పదనిస | నిస్సని | దపా ; | ; ; | పాదా | పాదప | మపదప | మగా, |
వనివిక | సించెవిర . . . | . . . | పక్షి | ఏలా . | రా . . . | దాయే. |
గమపద | నీ ; | నీస్సని | దనిస్సని నిదపా | ; ; | ; ; | పదదప | పా,ద |
ఏ . . . | లా . | రాదాయే | ప . . . క్షీ . . | . . . | . . . | ఏ. మూ. | రా . . |
మపపద | మపదప మగ | రిపమ గా | ; ; | మపపప | దపమాపద | నీ ; |
నా. శము | నుం . . . . ఓ | పిలు. చు | . . | పిలుచుని | ట. కుప. | క్షీ |

; ; ॥ పక్షి ఏలారాదాయే – ఏలా రాదాయే పక్షి "వనివికసించెవిర"

1.చ॥ నిస్సస్స | ,స్సస్సని | నిరిస్సా | స్సరిస్సని | నిస్సస్స , | స్సని | దసనీదప |
వా. యువి | . చికలు | మత్తి.వి | ర. గ. | వే. చివు | . ళ్ళు న్న. | వ్వ. మ్మెలు. |
పదనిస | దసని | ; , దపా ; | పదదద | పాదప | మపపద | మపదపమగ |
సా. గే. | నా. . | . . . యే. | ఈ. మధు | గానా. | లా. పన | వే . . . . . |
రిపమ గా | ; ; | మపపా | పాపమ | పదనీ | ; ; |
శ్రా . . . | . . | ఆ. మా | ధుర్యము | కే. దాయే | . . ॥ పక్షి ఏలారాదాయే "

2.చ॥ సాసస | రి,గ | మపపమే | పామెద పమ | మామమ | గరిరిప | మగగా | ; ; |
విహ్వల | మై. హ్వ | దయహార | మై . . . | పిల్చు న | దే. ని. | స్వన మో . . |
మపపప | పాదని | పదస్సని | దపపమ | మదదప | మమమగ | రిపమ గా | ; ; |
సా. గరి | పా. రి | వనలీ. | రా . . న | [illegible] | స్వరా. | దా. . . ని | . . |
నినిస్స | సాస్సని | నిస్సస్స | స్సరిస్సని | నిస్సస్స | సాస్సని | దసనిప |
వ్యథా. మొ | నామధు | మా. సమి | దే . . . | మరిమరి | నాకై . | పి. ల్చున |
పదనిస | దసనీ | ; , దపా ; |
దే . . . | నా. . | . . . యే. |

తరువాత మొదటి చరణంలాగ "ఈ మధుగానాలాపన…"
తరువాత మొదటి చరణంలాగా "వ్యథా విలమ్నోరేయి నీ పక్షి – ఏలా మోసుకువచ్చే" అనే పంక్తిని
పాడాలి. ఆ తరువాత "పక్షి ఏలారాదాయే…." పాడాలి.

దె = శుద్ధ దైవతం
మె = ప్రతి మధ్యమం



## శ్రీమతి వక్కలంక సరళ

కొమ్మూరి వేణుగోపాలరావు గారి కుమార్తె యైన సరళలో బాల్యం నుండి సంగీత ప్రతిభ వికసించింది. సంగీత విదుషియైన తల్లి బృహత్సుందర కుచాంబ సరళకు తొలిగురువు. తరువాత కీ.శే. కాలక్కాడ్ రామనారాయణయ్యర్, కీ.శే. పి. సుందరం, కీ.శే. వోలేటి వెంకటేశ్వర్లు, శ్రీమంగళంపల్లి బాలమురళి గార్లవద్ద సంగీతంలో మెళకువలు నేర్చుకున్నది. కళాశాలలో చదువుతున్న రోజుల్లోనే చలన చిత్ర రంగం ఆమెను గుర్తించింది. "కాదుసుమా కల కాదుసుమా", "తీయని వెన్నెలరేయి" వంటి పాటలు కీలుగుర్రం, బాలరాజు చిత్రాలలో పాడే అవకాశం లభించింది. అవి ఎంతో ప్రాచుర్యాన్ని పొందాయి.

వివాహం తరువాత ఆమె జెమినీ స్టూడియోలో చేరి అసోసియేట్ మ్యూజిక్ డైరెక్టర్ గా పనిచేసింది. హిందీ చిత్రాల స్వరకర్త సి. రామచంద్ర మొ॥వారితో కలిసి పనిచేసే అపూర్వ అవకాశం ఆమెకు లభించింది. భర్త డా॥ వక్కలంక కామేశ్వరరావు గారు ఆర్మీ డాక్టర్ కావటం వలన శ్రీమతి సరళ ఉత్తరాదిన పలు ప్రాంతాలు పర్యటించటం జరిగింది. ఈ ప్రయాణాలామె సంగీతానికి ఏ మాత్రం అడ్డుపడలేదు. పూనాలోను, ఢిల్లీలోను ఆమె హిందుస్తానీ సంగీతం అభ్యసించింది.

1957 ప్రాంతంలో సరళ హైదరాబాదు వచ్చి నాలుగైదు సంవత్సరాలు ఉండటం తటస్థించింది. ఆ సమయంలో ఆకాశవాణి హైదరాబాద్‌లో ఎన్నో లలిత సంగీత కార్యక్రమాలలోనూ, సంగీత రూపకాలలోనూ పాల్గొంటూండేది. నేను, సరళ కలసి ఎన్నో పాటలు పాడేవారం. శర్మిష్ఠ, ఏడాది పొడుగునా మొ॥ సంగీత రూపకాలలో పాలగుమ్మి విశ్వనాథం గారి సంగీత నిర్వహణలో అద్భుతమైన పాటలు పాడాం. నావలెనే మంచి స్వర జ్ఞానము కలిగి, సునిశిత మైన అవగాహనతో ప్రజ్ఞతో హిందీ, ఉర్దు, తెలుగు, తమిళం, బెంగాలీ మొ॥ భాషలలో పాటలను ఎంతో భావయుక్తంగా గానం చేసే నేర్పుకల



గాయని సరళ. మా యిద్దరి యుగళ గీతాలు, ఆమె సోలో గీతాలు యీనాటికీ ఆంధ్రదేశంలోని ఆకాశవాణి కేంద్రాల నుండి ప్రసారం అవుతూ ఉన్నాయి.

1968లో ఢిల్లీలోని సాంగ్ అండ్ డ్రామా డివిజన్‌లో స్వరకర్తగా చేరి ఎన్నో మధురమైన బాణీలను సమకూర్చింది. సరళ సమకూర్చిన బాణీలను జేసుదాసు, ఎస్.జానకి, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం మొ॥ ప్రముఖులు పాడారు. అవేకాక విద్యారంగానికి సంబంధించిన, నాట్య రంగానికి సంబంధించిన క్యాసెట్లకు సంగీతాన్ని అందించింది శ్రీమతి సరళ. భక్తి సంగీతం ముఖ్యంగా అన్నమాచార్య శృంగార కీర్తనలకు ఆమె సురుచిరమైన బాణీలు కూర్చగా డా॥ మురళీకృష్ణ, వాణీజయరాం మొ॥వారు గానం చేశారు. మీరా, సూరదాస్, తులసీదాస్ మొ॥వారి భజనలను తన సంగీత నిర్వహణలో క్యాసెట్లుగా వెలువరించింది. ఎన్నో దేశ, విదేశ పురస్కారాలు, అవార్డులు ఆమెను వరించాయి. ఎన్నో సత్కారాలను పొందింది.

ఆమె కుమార్తె శ్రీమతి స్వప్నసుందరి ప్రపంచ విఖ్యాతి గాంచిన నర్తకీమణి. స్వప్నసుందరిని యీ ఏడాది 'పద్మభూషణ్' బిరుదుతో కేంద్ర ప్రభుత్వం సత్కరించింది.

చాలా దశాబ్దాల తరువాత 1998లో శ్రీమతి సరళ హైదరాబాద్ వచ్చిన సందర్భంగా నేను ఆమెను కలవడం జరిగింది. నిరంతరం సంగీత సేవకే అంకితమైన ప్రముఖగాయని, స్వరకర్త శ్రీమతి సరళ 1999 లో దివంగతురాలైంది. ■

## బెంగాలీ సంగీతం, ఆ ప్రాంతపు జానపద శైలి ఆధారంగా కొన్ని చిత్ర గీతాలు

### తెలుగు

| | పాట | చిత్రం | గానం | స్వరకర్త |
|---|---|---|---|---|
| 1. | ఎవరికివారే యీలోకం | సాక్షి (1967) | కె.బి.కె.మోహన్‌రాజు | కె.వి.మహదేవన్ |
| 2. | నా హృదయంలో నిదురించే చెలి | ఆరాధన (1962) | ఘంటసాల | ఎస్.రాజేశ్వరరావు |
| 3. | వినవోయి కృష్ణ మురారి (కె.ఎల్.సైగల్ హిందీలో పాడిన 'సునో సునో హే కృష్ణ కాలా' పాటకు తెలుగు సేత) | ప్రైవేట్ గీతం | యం.ఎస్.రామారావు | ............ |

### హిందీ

| | పాట | చిత్రం | గానం | స్వరకర్త |
|---|---|---|---|---|
| 1. | మేరామన్ భోలాభోలా | బిరాజ్‌బహూ (1954) | ద్విజేన్‌ముఖర్జి | సలిల్‌చౌధురి |
| 2. | సఫల్‌హోగితేరీ ఆరాధనా | ఆరాధనా (1969) | ఎస్.డి.బర్మన్ | ఎస్.డి.బర్మన్ |
| 3. | బన్‌సీ క్యోం బజాయే | పరఖ్ (1960) | లత | సలిల్‌చౌధురి |
| 4. | ఒరే మాఝీ | బందినీ (1963) | ఎస్.డి.బర్మన్ | ఎస్.డి.బర్మన్ |
| 5. | గంగా ఆయే కహాఁసే | కాబూలీవాలా (1961) | హేమంత్‌కుమార్ | సలిల్‌చౌధురి |
| 6. | జానే క్యాతూనే కహీ | ప్యాసా (1957) | గీతాదత్ | ఎస్.డి.బర్మన్ |
| 7. | ఆజ్ సజన్ మోహే అంగ్‌లగాలో | ప్యాసా (1957) | గీతాదత్ | ఎస్.డి.బర్మన్ |
| 8. | ఆజారీ ఆ నిందియాతూ ఆ | దోబిఘా జమీన్ (1953) | లత | సలిల్‌చౌధురి |
| 9. | సున్ మేరే బంధురే | సుజాతా (1959) | ఎస్.డి.బర్మన్ | ఎస్.డి.బర్మన్ |
| 10. | చలీరాధేరానీ | పరిణీత (1953) | మన్నాడే | ఎస్.కె.పాల్ |
| 11. | ఝూమ్ ఝూమ్ మన్‌మోహన్‌రే | బిరాజ్‌బహూ (1954) | ద్విజేన్‌ముఖర్జి | సలిల్‌చౌధురి |
| 12. | బల్‌మా బడా నాదాన్‌హై | సాహెబ్ బీబీ ఔర్ గులాం (1962) | ఆశాభోంస్లే | హేమంత్‌కుమార్ |
| 13. | ఖాయి హైరే హమ్‌నే కసం | తలాష్ (1969) | లత | ఎస్.డి.బర్మన్ |
| 14. | సునో సునో హై కృష్ణ కాలా | ప్రైవేట్‌గీతం | కె.ఎల్.సైగల్ | - |

# ఎందరో మహానుభావులు - అందరూ 'హాసం' అభిమానులే!

హాసం' వచ్చిందంటే చివరిపేజీ చూసేదాకా కింద పెట్టను - బాపు

మాస పత్రికలకు బందీలై మూలుగుతున్న వారంతా హాయిగా నవ్వి, నవ్విస్తున్నారు. సంగీతపరంగా కూడా ఇంతవరకూ ఇంత చక్కగా కొత్తగా-అలాగా! అనిపించేలా ఎక్కడా రాలేదు - ముళ్లపూడి వెంకటరమణ

ఈనాటి పాఠకుల నాడి తెలిసిన పత్రిక - కాళీపట్నం రామారావు

సంస్కారులైన పాఠకులకు ఓ అపురూప వరం 'హాసం. చేతిలో ఉంటే గర్వకారణంగా ఉంటోంది. - ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ఈ 'హాసం' - ఆహ్వానించదగ్గ మధుమాసం! - సిరివెన్నెల సీతారామశాస్త్రి

ఒక సమగ్ర రసాత్మక కావ్యం చదువుతున్నామని అనిపించే తీరున, తీరుగా రూపుదిద్దుకుంటోంది - పి.బి.శ్రీనివాస్

కేవలం 'అట్ట'హాసం మాత్రమే కాకుండా ఆపాదమస్తకం 'ఆహా'సం!!! - బ్రహ్మానందం

'హాసం' హాస్య సంగీత ప్రియులందరినీ అందమైన లోకాలలో విహరింపచేస్తోంది. - యస్వీ కృష్ణారెడ్డి

శ్రమపడి, ప్రత్యేక లక్ష్యంతో నడుపుతున్న పత్రిక - చలసాని ప్రసాదరావు

'హాసం— is the first magazine which I want to be in my house - తేజ

హాసంను అందరూ మెచ్చుకుంటున్నారు. ఆనందంగా ఉంది - రావి కొండలరావు

టెన్షన్స్‌లోంచి కొంతసేపైనా బయటపడి హాయిగా రిలాక్సయేందుకు మనసుకు ఒక మంచి టానిక్ 'హాసం' - డా॥ ఇండ్ల రామసుబ్బారెడ్డి

ప్రతి శీర్షిక, ప్రతిపేజీ లక్షల విలువ - పూరి జగన్నాథ్

కాపీ దొరక్కపోతే దొంగిలించాలనేంత కోరిక పుట్టించిన పత్రిక 'హాసం' - త్రివిక్రమ్ శ్రీనివాస్

యువర్ 'హాసం' ఈజ్ రియల్లీ, ట్రూత్‌ఫుల్లీ గుడ్ - సత్యానంద్

మీ హాస సముద్రంలో నేనూ ఓ చిరుబిందువు నవ్వాలనే ఆకాంక్ష - భువనచంద్ర

## కొనడం మీ వంతు!

## ఆకట్టుకోనడం మా వంతు!

### SUBSCRIPTION/RENEWAL COUPON

Name :........................................................ Age: ......................Profession......................

Address:..........................................................................................................

.........................Ph. No. ............... (O) ...................... (R) email:..........................................

I am enclosing DD/Cheque/M.O. Receipt No......................... Dated ......................... for Rs. 200/- (225/- in case of outstation cheques)favouring HUMMUS INFOWAY (P) Ltd., **payable at HYDERABAD** for Subscription/Renewal (incl. Postal Charges) of 24 issues of 'HAASAM HAASYA SANGEETHA PATHRIKA' starting from Issue No......(............... month, 2003)

Date:

Signature

Mail to: HUMMUS INFOWAY (P) LTD., 502, SRI BALAJI NILAYAM, 13-1-212, BSP COLONY, MOTINAGAR, HYDERABAD - 500 018. Ph: 2383 1388 / 5557 0215, email: haasammag@hotmail.com

Note: If chq/DD is not drawn on Hyderabad Add Rs. 25/- towards collection charges

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

# నవ్వుటద్దాలు

క్లాసిక్స్ రీటోల్డ్

- ఆచార్య తిరుమల

## నెరజాణల సిగ్గులు




సర్వసాధారణంగా మగవాళ్లు ఆడవారి కంటె తెలివైన వాళ్లమని, బాగా నేర్పుగా మాట్లాడగలమని, తమ మాటే చివరికి పైమాటగా వుండి చెల్లితీరుతుందని అనుకుంటూ వుంటారు. కానీ, తమకంత మాటనేర్పరి తనం కలగటానికి ఆడవారితో మాట్లాడటమే ఒక కారణమని వారికి తెలియదు. ఈ శ్లోకం చూడండి:-

దేశాటనం పండిత మిత్ర తాచ
ప్రౌఢాంగనా రాజసభా ప్రవేశః
అనేక శాస్త్రాణి విలోకితాని
చాతుర్య మూలాని భవంతి పంచ!!

అంటే- దేశదేశాలు పర్య టించటం అంటే కొత్తకొత్త ప్రదేశాలకు తిరగటం. పండితులైన మిత్రుల్ని కలిగి వుండటం. సామర్థ్యం గల ఆడదానితో సంభాషించటం, సభల్లో మాట్లాడటం, చాలా శాస్త్రాలు చదవటం- అనే ఐదూ మగవాడి మాటకారితనానికి మూలకారణాలని భావం. వీటిలో ఏ ఒక్కటైనా లేకుండా మిడిసిపడే మగాళ్లని మించిన మూర్ఖులెక్కడా కనిపించరు.

ఆడవాళ్ల తెలివితేటల్ని గురించి, మాటకారితనాన్ని గురించి చాలా తెల్సుకోవలసివుంది. నిజానికి 'మతి'వుండేది వాళ్లకే. (శ్రీ'మతి', చంద్ర'మతి', భాను'మతి') ఇలా మగవాళ్లకి 'మతి' లేదు కదా! పూర్వ సాహిత్యంలో పుత్రవరంతో యముణ్ని బోల్తాకొట్టించిన సావిత్రి, "ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదొ భూసురేంద్ర! ఏ కాంతము నందునున్న జవరాండ్ర నెపంబిడి బల్కరించులాగింతయ గాక-" అని భాషాపరశేషభోగియైన ప్రవరుణ్ని నిరుత్తరుణ్ని చేసిన వరూధిని, ''తన్నోడి నన్నోడెనా? నన్నోడి తన్నోడెనా?'' అని సర్వకాల మహాపండితులందరికీ ఒక సవాలు విసిరిన ద్రౌపది, వంటి వారి మాటకారి తనాన్ని తక్కువ అంచనా వేయగలమా!? ఇటువంటివన్నీ ఆయా కవుల వాక్చాతుర్యమేనని గొణుక్కోవచ్చును. కానీ ఆ వాక్చాతుర్యం కూడ వాగ్దేవి అయిన సరస్వతీదేవి కరుణాకటాక్ష వీక్షణమే నని కవులంతా అంగీకరించిన విషయాన్ని మరిచిపోకూడదు.

ఒకసారి సర్వజ్ఞుడైన శివుడే పార్వతి దగ్గర ఓడిపోయిన సంఘటనని యీ క్రింది శ్లోకం గుర్తుచేస్తూవుంది: చూడండి:-

వస్తానన్న వేళకు శివుడు రాలేదు. పార్వతికి కోపం వచ్చి తలుపు వేసుకు కూర్చుంది. శివుడు వచ్చాడు, తలుపు కొట్టాడు. సంభాషణ మొదలయ్యింది:-

పార్వతి:- కస్త్వం? (ఎవరు నువ్వు?)
శివుడు:- శూలీ (శూలాన్ని ధరించిన వాణ్ని)
పార్వతి:- మృగయ భిషజం (వైద్యుణ్ని వెదుక్కో! 'శూలి' అంటే తలనొప్పి అని మరో అర్థం)
శివుడు:- నీలకంఠ ప్రియేఽహం (ప్రియా! నేను, నీలకంఠుణ్ని)
పార్వతి:- కేకా మేకాం కురు - (నెమలివా? అలా అరు! నీలకంఠ మంటే నెమలి అని మరో అర్థం)
శివుడు:- పశుపతిః- (కాదు, పశుపతిని)
పార్వతి:- నైవ దృశ్యే విషాణే - (పశువ్వా, కొమ్ములు కనిపించటం లేదేం?)
శివుడు:- స్థాణుర్ముగ్ధే - (ఓ ముగ్ధా! నేను స్థాణువుని)
పార్వతి:- నవదతి తరుః - (చెప్పకు- చెట్టేది? స్థాణువంటే చెట్టు మాను)
శివుడు:- జీవితేశ శ్శివాయాః - (నీ జీవితేశ్వరుడైన శివుణ్ని)
పార్వతీ:- గచ్ఛాటవ్యాం - (ఇక్కడకెందుకు వచ్చావు అడవుల్లో తిరుగు! ('శివా' అంటే నక్క అని మరో అర్థం)

ఇతి హతవచః పాతువశ్చంద్ర చూడః!!- ఇలా మాటల్లో ఓడిపోయిన శివుడు రక్షించుగాక! అని దీవెన. ఇప్పుడీ శ్లోకాన్ని ఏకం గా చూడండి:-

కస్త్వం శూలీ మృగయ భిషజం నీలకంఠ ప్రియేఽహం
కేకామేకాం కురు, పశుపతి ర్నైవ దృశ్యే విషాణే
స్థాణుర్ముగ్ధే నవదతి తరుః జీవితేశ శ్శివాయాః
గచ్ఛాటవ్యాం ఇతి హత వచః పాతువశ్చంద్రచూడః!!

శివుడంతటి వానికే యీ స్థితి వుంటే వేరే మగాళ్ళసంగతి చెప్పాలా? ఇలాగే, సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుడే ఒకసారి ఓ గోపిక చేతిలో కాదు మాటలో ఓడిపోయిన సంగతి లోగడ ఒక వ్యాసంలో ప్రస్తావించాను. "అంగుళ్యా కః కవాటం ప్రహరతి కుటిలే?" శ్లోకం చూడండి. దేవతలు తెలివిగా వుంటారనుకుంటే, చారిత్రకం గాను, సాంఘికం గానూ కూడా ఆడవాళ్లెంత నెరజాణలు గా వుంటారో కూడా చూడవచ్చు.

శ్రీకృష్ణదేవరాయల కాలంలో పుష్పలావికలు అంటే పువ్వులమ్ముకునే ఆడవాళ్లెంత జాణలుగా వుండేవారో- ఆముక్తమాల్యద కావ్యంలోని

"వెలది నీయీ దండ వెలయెంత?" అని ఓ రసికుడడిగితే-

"నా దండకును వెలబెట్ట నెవ్వని తరంబు?" అని ఆ పూలమ్మి ఝెల్లుమనిపించిన పద్యం చూస్తే తెలుస్తుంది. రసికుడి దృష్టిలో 'దండ' అంటే 'జబ్బ' అని అర్థం. అందుకే ఆమె రెండర్థాలు వచ్చేలా నా దండకి (పూలదండకి, నా జబ్బకి) వెల కట్టటమెవడి తరంరా? అంది. ఇంకేం మాట్లాడగలడు? మరి, గురజాడ కన్యాశుల్కంలో మధురవాణి గానీ, కాళ్లకూరి వారి చింతామణి గానీ ఎంతటి నెరజాణలో తెలుసుగా! ఆఖరుకి ఓ పల్లెటూరి పిల్ల తన బావమొగుణ్నెలా బురిడీ కొట్టించిందో ఈ గేయం చూస్తే తెలుస్తుంది.

"ఒకరికీ చేయినిచ్చి, ఒకరికీ కాలునిచ్చి
ఒకరికీ నడుమూనిచ్చి కూకున్నానోయి బావా!" అంది.

ఆ అమాయకుడికి గుండె గుభేలుమంది. "ఎవరికీ చేయినిచ్చి, ఎవరికీ కాలునిచ్చి, ఎవరికీ నడుమూనిచ్చి కూకున్నావే పిల్లా! చెప్పు!" అని గద్దించేసరికి ఆమె పకపకా నవ్వి

"గాజుల్కు చేయినిచ్చి, అందెలకు కాలునిచ్చి
వడ్డాణాన్కి నడుమూనిచ్చి- కూకున్నానోయిబావా!" అని ఆటలు పట్టించటంలోని నెరజాణతనానికి విలువకట్టలేం కదా!

బసవరాజు అప్పారావు గారి 'వెఱ్ఱిపిల్ల'-

గుత్తివంకాయ్ కూరోయ్ బావా!
కోరి వండినానోయ్ బావా
కూరలోపల నా వలపంతా
కూరి పెట్టినానోయ్ బావా!-

అంటూ కూరలో వలపంతా కూరటంలో ఎంత నెరజాణతనం వుందో గమనించండి. ఆ బావెవడో వాడు వెఱ్ఱాడు గానీ ఆమె వెఱ్రిపిల్లేమిటి?

'శాలివాహన గాథా సప్తశతి' కావ్యంలో చాలమంది నెరజాణలు కనిపిస్తారు. ఓ జాణ తన పక్కింటి పోరగాడితో ఏమని అడుగుతూ వుందో చూడండి:-

కనులు కానరానికటికి చీకటిరేయి,
వలసపోయె మగడు, వంటిదాన,
దొంగలెవ్వరైన దోతురేమో సుమ్ము
కంటగనుము ప్రక్క యింటివాడ!!

పద్యభావం తేలిగ్గానే అర్థమవుతుంది. ఇలాంటిది వుంటే పక్కింటి వాడి పంటపండిందే! ఇలాగే మరో నెరజాణని చూడండి:-

తనింటికి ఒకరాత్రి అతిథిగా వచ్చిన ఓ కుర్రాడితో ఆ నెరజాణ యిలా అంటూవుంది:-

ఇచటనే పరుండు, నిచ్చట అత్తగా
రిచట పరిజనంబు లెరిగి కొనుము
రాత్రి, నీకు కానరాను; నా శయ్యపై
తప్పి పడెదవేమొ దారికాడ!!

"నేనెక్కడ పడుకుంటానో గుర్తుపెట్టుకో! కనపడక, నామీద తప్ప అత్తగారి మీద గానీ, పనివాళ్లమీదగానీ పడతావేమో జాగ్రత్త" అని ఆమె హెచ్చరిక. ఇంక ఆ దారికాడికి నిద్రేం పడుతుంది చెప్పండి?

మరో పద్యం గుర్తొస్తూవుంది. తెలిసే, తన భర్తని ఒకామె పాపానికి, తప్పుకి తేడా ఏమిటో చెప్పమని అడిగింది. తెలివైన వాణ్ననుకున్న అతని జవాబు, ఆమె తీర్పు ఎంత గిలిగింతలు పెడుతున్నాయో చూడండి:-

"పాపమునకు తప్పునకును వాసి యేమి?"
అని అడిగింది
"ఇచట శిక్షార్హ మైనది యింతి! తప్పు,
పరమునందు శిక్షార్హ ము పాప మగును"
అన్నాడు వేత్తలా.
"మగడ! పాపాలు చేయుటే మంచిది గద!"
అని నవ్వింది.

ఆ మగడు నోరెల్లబెట్టాడు. ఇలాగే, పేద మొగుడితో విసిగిపోయిన ఓ గడుసు ఇల్లాలు ఆయనగారు గారెలు తినాలని వుంది, వండమంటే ఆమె చయ్యిమని "ఏం పెట్టి వండమంటావ్? పిండి మధ్యలో రంధ్రం చేయటానికి యీ వేలు తప్ప యింట్లో ఏముం"దని? చూపుడువేలు చూపిస్తూ, బుగ్గపోటు పొడిచిందట!

అపారమైన తెలివితేటలుండి, పైకి మాత్రం సిగ్గుపడుతూ నంగనాచిలా నటించే నెరజాణల మనస్తత్వాల్ని గుర్తించటం అంత తేలికైన పనికాదు. అలాంటి జాణల మాటల్ని, చేష్టల్ని, సిగ్గుల్లోని నిగ్గుల్ని, సవాళ్లని ప్రాచీన సాహిత్యం నుండి పరిచయం చేస్తాను.

ఒకామెను ఆమె భర్త పేరు అడిగితే పండితులకెంత సవాల్ విసిరిందో చూడండి:-

విపులాక్షి! 'నీ విభు పేరేమి?'యన్నను
చాతుర్య మెసగ నా నాతిబలికె
నక్రంబు హేమంబు నగధాము పుష్పాడి
యబ్బురం బేనుగు యాజి పడవ
అన్నిటి మూడేసి అక్షరంబులు గల
మారు నామంబుల తీరు జూచి
నాథు పేరునకును నడిమ వర్ణంబులు
సరియని జెపితి నెరిగి కొనుము
యనుచు నానాతి బల్కె, తా నతిశయముగ
ఇట్టి నామంబు గలవాడె యీతడనుచు
వంచనలులేక బుధులెరింగించిరేని
వారికే నాచరించెద వందనములు!!



నక్రం, హేమం, నగధాము పుప్పొడి, అబ్బురం, ఏనుగు, ఆజి, పడవ మాటలకు గల మూడేసి అక్షరాల వేరే మాటలేమిటో చూసి, వాటి మధ్య అక్షరాలు కలిపితే ఆమె భర్త పేరు ఏమిటో తెలుస్తుందట! ప్రయత్నించండి!

చాలా తెలివైన వాణ్ని అనుకునే ఓ కుర్ర రసికుడికి ఒకనాడు ఓ జాణ తారసపడింది. ఆమె సమాచారమేమిటో తెల్సుకోవాలని వీడు ప్రశ్నించటం మొదలుపెట్టాడు. వీడి ప్రశ్నలకి ఆమె మాటలతో కాకుండా అభినయం తో సమాధానాలిచ్చింది. ఆ కుర్రకుంక కేమీ అర్థం కాలేదు. మీకేమైనా ఆమెను గూర్చి తెలుస్తుందేమో చూడండి:-

రాజీవ నేత్ర! నీ రాజ్యమెక్కడిదన్న?
ఒకచేత కొప్పు వెంట్రుకలు చూపె
పద్మాయ తాక్షి! నీ పట్టణంబేదన్న?
నవ్వుచు ఒడ్డాణ నడము చూపె
బింబాధరోష్ఠి! నీ పేరేమి చెప్పుమన్న?
సొగసైన శుకవాణి మొగము చూపె
ఇందీవ రాక్షి! నీ కెవ్వడు విభుడన్న?
తన వ్రేలి ముద్దుటుంగరము చూపె
విడిది చెప్పుమన్న మును వ్రేళ్ల నడుము చూపె
కులము చెప్పుమన్న మరుకేళి గృహము చూపె
తరుణి రమ్మన్న బుగ్గలు కరిచి చూపె
భళిర! వినరయ్య నెరజాణ ప్రౌఢ తనము!!

ఆమె అభినయాలకి అర్థం ఏమిటో తెలిస్తే రాయండి.

ఇలాగే, మరో కొంటె కోణంగికి ఒక ప్రౌఢాంగన జాణతనంతో ఇచ్చిన అభినయ పూర్వక జవాబులు ఎలావుంటాయో యిదిగో యీ పద్యంలో చూడండి:-

ఎలనాగ! నీదేశ మేదేశ మన్నను?
చెలి వంగ మానొక్క చేతజూపె
భామరో! నీవున్న పట్టణంబేదన్న?
చంద్రుని గూడి పాషాణమనియె
ఇందీవరాక్షి! నీ యిల్లెక్కడన్నను?
తన నీరు మోసె నత్తరువు క్రింద
ఏ జాతి కోమలీ! ఎరగింపు మన్నను?
ఏటిలో రెణ్నెల్ల యిసుక వుచ్చె
ఇంతి! నీకు విలువ యెంతని అడిగిన
చుక్కజూపి సుదతి సున్న జుట్టె
సమ్మతిఁదెలుపంగ సరసజ్ఞవగుదువు
చెప్పుకున్న నగుదు చిన్ని నవ్వు!!

ఈ పద్యంలో ప్రశ్నలకి జవాబులిలా వుంటాయి. దేశమేమిటని అడిగితే 'వంగ'మాను చూపించిందంటే 'వంగ'దేశమని అర్థం.

పట్టణం- చంద్రుని కూడి పాషాణ మన్నదంటే 'చంద్రశిలా నగర'మని అర్థం. ఇల్లెక్కడంటే చెట్టుకింద తలపై నీళ్లు మోసిందంటే ఆ కొబ్బరి చెట్ల దగ్గరని అర్థం. ఏ జాతిదానివంటే ఏటిలో ఇసుక పట్టుకుందంటే బెస్త వారని అర్థం. విలువెంతని అడిగితే చుక్కలు చూపించి సున్నా చుట్టిందంటే రూ.270 అని అర్థం. నక్షత్రాలు 27 కదా! వాటిప్రక్కన సున్నా చేరిస్తే 270 అవుతుంది కదా!

ఇలాంటిదే మరో పద్యం చూడండి:- ఈ పద్యంలో ఓ పురాణ పురుషుని కథ యొక్క ప్రస్తావన వుండటాన్ని గమనించండి.

నారీలలామ! నీ పేరేమి చెప్పుమన్న
వామాక్షముం జూపి పలుకకుండె
మత్తేభయాన! నీ మగని పేరేమన్న
తన చేతి జీర్ణ వస్త్రంబుఁ జూపె
వెలది! నీకేమైన బిడ్డలా చెప్పుమన్న
కరమొప్ప మింటి చుక్కలను జూపె
కుటిలకుంతల! నీదు కుల నామమేదన్న
పంజరంబున నున్న పక్షిఁ జూపె
ప్రభువు మీకెవరన్న గోపకుని జూపె
ధవుని వ్యాపార మేమన్న దండ మిడియె
చతుర మతులార! ఆ ప్రౌఢ జాణతనము
తెలిసి కొనరయ్య బుద్ధి కౌశలము మెరయ!!

పేరుకి వామాక్షం చూపించిందంటే- పేరు'వామాక్షి' అన్నమాట. భర్త పేరుకి చిరిగిన వస్త్రం చూపించిందంటే - భర్తపేరు 'కుచేలు'డన్నమాట. (కు+చేలం = జీర్ణ వస్త్రం). బిడ్డలెందరంటే - చుక్కల్ని చూపించిందంటే 27 మంది అని అర్థం. కులం ఏమిటంటే - పంజరంలోని పక్షిని చూపించిందంటే 'ద్విజ'(బ్రాహ్మణ)కులమని అర్థం. ద్విజ అంటే పక్షి అనీ, బ్రాహ్మణుడనీ అర్థాలున్నాయి. ప్రభువు గోపకుడంటే శ్రీకృష్ణుడు అనీ, మగని వ్యాపారమేమిటంటే దండం పెట్టింది కాబట్టి తపస్సు చేసుకోవటమనీ అర్థం. కాబట్టి యీ పద్యభావం కుచేలోపాఖ్యానానికి సంబంధించిందని గ్రహించాలి.

నెరజాణల సిగ్గులు అబ్బురం గానే కాదు ఎంత ఇబ్బందికరంగా వుంటాయో యీ రెండు పద్యాల్లోనూ గమనించండి:-

సరసిజనేత్ర! నీ మగని చక్కనిపేరు వచింపుమన్న, అ
పురమ పతివ్రతా మణియు భావములో తలపోసి సిగ్గుతో
కరియును రక్కసుండు హరకార్ముకమున్ శరమద్దమున్ శుకం
బరుదుగ వీటిలో నడిమి యక్షరముల్ గణుతింపఁ పే రగున్!!

భర్త పేరడిగితే ఓ పతివ్రత సిగ్గుతో కరి (ఏనుగు), రాక్షసుడు, హరకార్ముకం (శివధనుస్సు), శరం (బాణం), అద్దం, శుకం (చిలుక)- మాటల మధ్య అక్షరాలు కలిపితే తన భర్తపేరొస్తుందని చెప్పింది. (కరి) ద్విరదం, (రాక్షసుడు) అఘుడు, (హరకార్ముకం) పినాకం,(శరం) సాయకం, (అద్దం) ముకురం, (శుకం) చిలుక- వీటి మధ్య అక్షరాలు కలిపితే "రఘునాయకులు" అని ఆమె భర్త పేరు తెలుస్తుంది.

ఇలాంటిదే యీ పద్యం చూడండి:-

మమతను తన్నునొక్క చెలి, మానిని! నీ విభు నామమేమనన్
కమలజ గంధి బల్కె- కరి, కంధి, ప్రజాపతి, చంద్రికా, తప
త్రమును త్రివర్ణయుక్తముగ వ్రాసియి నందలి మధ్య వర్ణముల్
క్రమముగ వ్రాసి చూడు! గజగామిని! నా విభునామ మేర్పడున్!!

కరి =ఏనుగు, కంధి = సముద్రం, ప్రజాపతి = బ్రహ్మ, చంద్రిక = వెన్నెల, ఆతపత్రం = గొడుగు. ఈ మాటలకి ముందుగా మూడేసి అక్షరాల సమానార్థక పదాలు వెదుక్కోవాలి. చూడండి: సారంగం - సాగరం-విధాత, కౌముది - గొడుగు అనేవి సమానార్థక పదాలు. ఇప్పుడు వీటి మధ్యనున్న అక్షరాలతో ఆవిడగారి భర్త పేరు "రంగధాముడు" అని అర్థమవుతుంది. అయ్యా! అదీ విషయం!

ఇదివరకు భర్తపేరు చెప్పాలంటే భార్యలంత సిగ్గు పడిపోయేవారు. ఇప్పటిలా కాదు. ఇప్పుడైతే మొగుళ్లని అరేయ్ ఒరేయ్ అని పేరు పెట్టి పిలిచే భార్యలు చాలామంది కనిపిస్తారు. అది వాళ్ళ వాళ్ళ చనువును బట్టి ఆధారపడి వున్నా పూర్వపు సిగ్గుల్లోనే ఆకర్షణ, తెలివితేటలూ దాగున్నాయని తెలుసుకోవటం ఉభయతారకం గానే వుంటుందని గ్రహించటం మంచిది. ఏది ఏమైనా, మాటకారి తనంలో ఆడవాళ్లకు మగవాళ్లు సాటిరారని పండితులు తేల్చిచెప్పిన విషయం. కాదనటానికి ఆవేశం మాత్రమే చాలదు, ఆలోచన కూడా కావాలి. మీరూ ఆలోచించండి! ●



# బాపు విశ్వరూపం 11

బాపు తెలుగమ్మాయిని 'చిత్రీ'కరించడం చూసి 'బాపు అంటే తెలుగుతనమే' అని ఛట్టున అనేస్తాం. మరి అరబ్బీ అమ్మాయిని కూడా అంత సొగసుగానూ గీస్తే..!? 'అరబ్బీతనం కూడాను...' అని చేర్చాలా?

అవధులు లేని చిత్రకారుడు బాపు ఆరుద్రగారి 'అరబ్బీమురబ్బాలు' కు గీసిన బొమ్మలు చూస్తే ఆ దేశవాసుల రూపురేఖలు, ముఖకవళికలు ప్రదర్శించేందుకు ఆయన ఎంత అధ్యయనం చేసి వుంటారా! అని అబ్బురపడతాం.



వెలది నయనాల వెలువడె
వేనవేల జాబిల్లి కూనలు
దరి చేరలేని నా దీన నేత్రాలు
కురియ సాగెను కన్నీటి వానలు



రాను రాను రానంటూ బిత్తరి
రాస్తున్నది ప్రేమలేఖ హత్తెరి!
అయిదు వేళ్ళతో పట్టుకొంటుంది కలం
అయిదు ప్రాణాలూ తీస్తుంది సత్వరం



నల్లని నిద్దుర నా మీద పడినప్పుడు
'నాకు నీవెవ్వరో తెలియద' న్నానా?
తెల్లని తొడల చెలి వాలినప్పుడు
'తెలుసులే తెలుసులే నీ సంగత'న్నాను.



నా మరణం జవాబు అయితే
నా మనుగడ సరాగమైతే
నీ కంటికి విందులు చేస్తా
నీ యింటికి అతిథిని అవుతా



హకీము చేతిలోని కత్తులు
ఆరోగ్యం ప్రసాదించవచ్చును
సఖీ! నీ కళ్ళలోని కత్తులు
సుఖమిచ్చినా తాపం హెచ్చును



ఇలలో నువ్వు గాలించేది
ఇంట్లోనే వుంటుంది
కలలో నువ్వు ఆశించేది
కష్టపడితే వస్తుంది



# అంతేరా బామ్మర్ది



ఆదివిష్ణు



## జరిగిన కథ

భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ. కొడుకు మురళి. ఉమ తండ్రి వద్దకు వెళ్ళి తన ఫ్రెండ్ పెళ్ళికి వెళ్ళడానికి పర్మిషన్ అడుగుతుంది. వద్దంటాడు బసవరాజు. తర్వాత టాస్ వేసి చూసుకుని మనసు మార్చుకుని పెళ్ళికి తీసుకెళ్ళమని కారుడ్రైవర్‌కి పురమాయిస్తాడు. ఉమ, వేణుని ప్రేమిస్తోంది. (ఇక చదవండి)



హైదరాబాద్ అశోకనగర్లో -

అదొక పాతకాలపు డాబా ఇల్లు!

కొత్త రోజుల్లో ఆ డాబా గొప్ప డాబు సరిగా వుండేదేమో! ఇప్పుడు అంత డాబుగా లేకపోయినా - దీనంగా మాత్రం లేదు!

ఆ ఇంటి ముందు ఒక ఆటో ఆగింది.

అందులోంచి వేణు దిగేడు!

డబ్బులిచ్చి ఆటోని పంపించి ఇంట్లో అడుగుపెట్టేడు 'అక్కా' అని పిలుచుకుంటో...

వేణుని చూడగానే అన్నపూర్ణ ఆత్రంగా అడిగింది -

"వెళ్లిన పని ఏమైందిరా? పండాకాయా?"

వేణు నీరసంగా సమాధానం చెప్పేడు -

"పండే! ఇంటర్వ్యూలో సెలెక్టయ్యేను!"

ఆ మాటకి అన్నపూర్ణ ఆనందపడిపోతూ అన్నది -

"అబ్బ! ఎంత మంచి వార్త చెప్పేవురా తమ్ముడూ! మీ బావగారి క్కూడా చెప్పు! సంతోషిస్తారు!"




వేణు మరింత నీరసంగా అన్నాడు -

"కానీ - ఆ ఉద్యోగం నాకిష్టం లేదు!"

ఆ మాటకి అన్నపూర్ణ ఎంతో షాకు తిని అన్నది-

"ఇష్టం లేదా? లక్షణమైన ఉద్యోగంరా! ఇష్టం లేదంటావేమిటి?"

"మీకు దూరంగా - ఎక్కడో నాగపూర్లో బతకాలంటే - దిగులుగా వుందే అక్కా!"

"ఇంకానయం! ఈ మాట నాతో అంటే అన్నావు గానీ - మీ బావగార్తో అనకు! తల బద్దలు కొట్టుకుంటారు!"

సరిగ్గా ఆ మాట మీదే రంగప్రవేశం చేసేడు బావగారు!

ఆ బావగారి పేరు రంగనాథం.

స్నానం పూర్తయిన కారణంగా మొలకి లుంగీ కట్టుకున్నాడు!

భుజమ్మీద టర్కీటవలు కప్పుకున్నాడు!

టవల్ తిప్పుకుంటూనే నిప్పులు కక్కుతున్నాడు!

"అంతేనే అంతే! నేను తిక్క సన్నాసిని! పరమ తిక్క వెధవని! అంచేత నా తల నేనే బద్దలు కొట్టుకుని - మీ యావన్మంది తలలు బద్దలవ్వకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకుంటాను! తిక్క వెధవని కదా - అది నా హాబీ అన్నమాట!"

వేణు సర్ది చెప్పే ప్రయత్నంలో అన్నాడు-

"అది కాదు బావా!"

"నువ్వు నోర్ముయ్! నీ సంగతి నాకు తెలీదా? అక్కకి తగ్గ తమ్ముడివి! అది ఆర్మనీ! నువ్వొక తబలా! మీకు ఆవేశం ఎక్కువ! శాంతంగా బతకడం తెలీదు! ప్రశాంతంగా ఆలోచించడం అస్సలు తెలీదు! మీ ఇద్దరికీ ఈ రెండు లక్షణాలూ లేవు! అది వాయిస్తుంది! నువ్వు వోగిస్తుంటావ్! నువ్వు చెప్పేదేదో శాంతంగా చెప్పివుంటే - మీ అక్క ప్రశాంతంగా ఆలోచించేది! ఇపుడు చెప్పు! చెప్పదలుచుకున్నదేదో శాంతంగా ప్రశాంతంగా చెప్పు! ఆవేశపడకుండా అర్థమయ్యేలాగా చెప్పు!" వేణు ఏదో చెప్పబోతుండగా - రంగనాథం అడ్డం పడి తానే చెబుతున్నాడు-

"ఆగు! నీకు తొందరెక్కువ! అంచేత నువ్వు చెప్పదలుచుకున్నది నేను ప్రశాంతంగా చెబుతా! నాగపూర్లో ఉద్యోగం చేయడం నీకిష్టం లేదు. అంతేగదా! అదట్లావుంచు! నువ్వు మమ్మల్ని విడిచిపెట్టి నాగపూర్ వెళ్లడం నాక్కూడా యిష్టం లేదు!"

బావగారి అభిప్రాయానికి వేణు ఎంతో ఆనందించేడు.

అందువల్ల ఆనందంగా అక్కతో అంటున్నాడు-

"విన్నావా? బావక్కూడా ఇష్టం లేదుట!"

అన్నపూర్ణకి తన భర్త మీదా, తమ్ముడి మీదా కోపం వచ్చింది.

అందువల్ల భర్తని విడిచిపెట్టి - తమ్ముడ్ని కోపంగానే ప్రశ్నించింది -

"అలాంటప్పుడు అసలు నువ్వు ఇంటర్వ్యూకి ఎందుకు వెళ్ళేవురా?"

రంగనాథం అరిచేడు -

"చంపుతా! ఏదైనా అడగాలనుకున్నప్పుడు శాంతంగా అడగాలి! వాడు ఇంటర్వ్యూ వంకమీద నాగపూర్ చూడటానికి వెళ్లేడు! తప్పా?"

బావగారు తనకిస్తున్న సపోర్టుకి కడు సంతోషిస్తూ - అక్కతో అన్నాడు-

"బావని చూసైనా నేర్చుకోవే! బాగుపడతావ్!"

ఇప్పుడు రంగనాథం బామ్మర్ది మీద మండిపడ్డాడు-

"నువ్వు నోర్ముయ్! ఆ పని మీ అక్కవల్ల కాదు. మాపెళ్లయిన దగ్గిర్నించీ గమనిస్తున్నాను! నాకున్న శాంత స్వభావం మీ అక్కకు లేదు!"

భార్యతో అన్నాడు -

"చూస్తూ నిలబడతావే! నాగపూర్నుంచి వచ్చేడు. బాగా అలసిపోయి వుంటాడు. ముందు వాడి స్నానానికి ఏర్పాట్లు చూడు! వెళ్లు-"

ఈ వరస ఆ యింట్లో ఎప్పుడూ ఇదే విధంగా సాగుతుంది.

సమస్య చిన్నదైనా పెద్దదైనా - బాణీ మాత్రం మారదు గాక మారదు!




* * *

బసవరాజు అండ్ కంపెనీ ఆఫీసు తాలూకు ప్రొప్రయిటరు గదిలో-

బసవరాజు పేపరు రీడింగ్తో బిజీగా వున్నాడు!

ఏ విషయంలో ఎంత అజాగ్రత్తగా వున్నా ఫర్లేదుగానీ - వార్తా పత్రిక చదివేటప్పుడు మాత్రం

వళ్లు దగ్గిరుంచుకుని చదవాలనేది అతని సిద్ధాంతం!

అప్పటికే చాలా పేపర్లు చదివేడు కాబోలు - ఇంగ్లీషు, తెలుగు దిన పత్రికలు అనేకం నేలమీద బోలెడు పడి వున్నాయి!

అతనికి నచ్చిన వార్త ఏ పేపర్లోనూ పడనందుకు చిరాకు పడిపోతూ 'చెత్తపేపర్లు' అని తిట్టుకున్నాడు!

బసవరాజుకి మంచి అలవాట్లు చాలా వున్నా -

దిక్కుమాలిన అలవాటు ఒకే ఒక్కటి తనని విడిచిపెట్టడం లేదు!

అది అతని వీక్నెస్సు!

ఆ బలహీనత నుండి బయటపడమని సాక్షాత్తు దేవుడే దిగివచ్చి చెప్పినా 'అయ్‌కాంట్' అని నిర్మొగమాటంగా చెప్పగల ధీమా అతని ప్రత్యేకత!

అతను దినపత్రికలను చదివేది కేవలం దిక్కుమాలిన వార్తల కోసమే!




"ఏమిటొద్దు?"

"పేపరు రీడింగు ఆఫీసరు, స్టోరీ టెల్లింగ్ సెక్రటరీ - ఇల్లాంటి పేర్లతో పదవులొద్దుసార్! సింపులుగా పి.ఆర్.ఒ. అనండి సార్! హోదాగా వుంటుంది!"

"పి.ఆర్.ఒ. - అనగా పేపరు రీడింగు ఆఫీసరు! ఇక్కడ నీ ఉద్యోగం అదేకదా! నాకు తెలీని భాషల తాలుకు పేపర్లు చదివి - అందులో నా అభిరుచికి తగిన వార్తల్ని నాకు తెలుగులో చెప్పడం నీ డ్యూటీ. అంతేగదా!"

"అఫ్‌కోర్స్ సర్! నా డ్యూటీ అదే అయినా - నన్ను మాత్రం పి.ఆర్.ఒ.గా మాత్రమే పిలవమని నా రిక్వెస్టు సార్!"

"ఒ.కె! అల్లాగే! వార్త చదువు!"

పాణి మళయాళం పేపరు విప్పేడు!

ఒక పేజీలో ఒక చోట దృష్టి నిలిపి - అక్కడున్న వార్తని గబగబా మళయాళంలోనే చదివేసేడు!

కిరసనాయిలు పోసుకుని తగలడ్డారు... లారీ తిరగబడి కూలీలు ప్రాణాలు పోగొట్టుకున్నారు... అప్పులెక్కువైన కారణంగా ఆత్మహత్య చేసుకున్నారు లాటి వార్తల మీద అతనికి అపారమైన యిష్టం!

ఆ వార్తల్నే చదివి - దేశం ఏ స్థాయిలో నడుస్తుందో అంచనా వేసి నిట్టూర్పుల్తో తానున్న గదిని వేడెక్కించడం అతని హాబీ!

దురదృష్టవశాత్తు - అతని అభిమతానికి వ్యతిరేకంగా - ఆ రోజు పేపర్లలో ఆ జాతి వార్తలు లేనందుకు - సమస్తమైన పేపర్లకీ చెత్త పేపర్లని బిరుదిచ్చి నిట్టూర్చేడు!

సరిగ్గా అప్పుడే... తన గదిలో

"గుడ్ మార్నింగ్ సర్!" అని వినిపించింది!

సవుండొచ్చిన వేపు తలతిప్పేడు.

అక్కడ పాణి - పూర్తి పేరు చక్రపాణి - కనిపించేడు!

పాణిని చూడగానే బసవరాజు మొహంలో వెల్తురు నిండిపోయింది!

ఆనందంగా అన్నాడు -

"వెరీగుడ్! నీ కోసమే చూస్తున్నా!"

నేల మీదున్న పేపర్లని పాణి చూసేడు. చూసి అడిగేడు-

"అన్ని పేపర్లూ చూసేసేరా సార్?"

"యస్! అంతా రొటీన్ న్యూసే! ఏ పేజీలో చూసినా - మంత్రివర్గం మట్టిపాలైందీ, ప్రభుత్వం పడిపోయిందీ, బడుగు వర్గాలకు చేయూత, సత్యాగ్రహాలు, వెన్నుపోట్లు.... ఇవేం వార్తలు? నాక్కావల్సిన వార్త ఒక్కటీ లేదు! మిస్టర్ పాణీ నీ చేతిలో వున్న పేపరేమిటి?"

'మళయాళం సర్! మళయాళం పేపరు!"

"అయ్‌సీ! కనీసం అందులోనైనా నాక్కావల్సిన వార్తలేమైనా.."

"ఒక అద్భుతమైన వార్త వుంది సార్!"

బసవరాజు ఆ మాటకి ఆనందించేడు -

"అల్లాంటి వార్తలు చదివేందుకే నిన్ను పేపర్ రీడింగు ఆఫీసరుగా పెట్టుకున్నా!"

"వద్దుసార్!"

ఆ తర్వాత అడిగేడు -

"అర్థమైందా సార్!"

"పేర్లు తప్ప మిగతా సౌండ్లు ఏవీ అర్థం కాలేదు! నువ్వు ఏ భాషలో వార్త చదివినా - అర్థ తాత్పర్యాలు తెలుగులో చెబుతావనే ఉద్దేశంతో నిన్ను పేపరు రీడింగ్ ఆఫీసరుగా - "

"పి.ఆర్.ఒ. సర్!"

"దట్ మీన్సదే! పిఆర్వోగా పెట్టుకున్నా! నువ్వు మళయాళంలో చదివిన వార్తకి తెలుగులో తాత్పర్యం చెప్పు! అచ్చెప్పునాకు!"

"ఇది కొచ్చిన్ - కొచ్చిన్లో జరిగిన సంఘటన సార్!"

"ఎక్కడ జరిగిందో అనవసరం! జరిగింది చెప్పు"

"పశుపతి నాయర్ అనే ఫిఫ్టీ ఇయర్స్ ఇండస్ట్రియలిస్టుని-"

"కరెక్టుగా నా వయస్సే! నా వృత్తే!"

"కుమారన్‌కుట్టి అనే నాయర్ ఫ్రెండు - నాయర్ ఆఫీసుకి వచ్చి నాయర్ పీక పిసికి చంపేడు!"

"ఘోరం! దారుణం! ఎందుకు చంపేడు! అచ్చెప్పునాకు!"

"కుట్టి తన బావమరిదికి నాయర్ ఇండస్ట్రీస్‌లో ఉద్యోగం యివ్వమని అడగడానికి వచ్చి అనవసరంగా ఉద్రేకం తెచ్చుకుని - నాయర్ని దారుణంగా హత్య చేసేడు!"

ఆ వార్త వినగానే బసవరాజు షాకు తిన్నాడు.



పాకు తిని దిగులుపడ్డాడు.

దిగులు పడి నీరసంగా అన్నాడు -

"మిస్టర్ పాణీ! నా మనసు చెడిపోయింది!"

"నేచురల్లీ సార్! బావమరిదికి ఉద్యోగం అడగడానికి వచ్చి - ఫ్రండు ప్రాణం తీస్తే - మీ మనసు బావుంటుందని ఎట్లా అనుకుంటాను సార్? డెఫినిట్‌గా చెడిపోయి వుంటుంది! అవున్సార్ - మీకెవరైనా ఫ్రండున్నారా సార్?"

"చాలామంది వున్నారు మిస్టర్ పాణీ!" దిగులుగా అన్నాడు బసవరాజు.

"నేనడుగుతున్నది మామూలు ఫ్రండ్సు గురించి సార్! ఉద్రేకం - ఉద్రేకం ఎక్కువగా వున్న ఫ్రండ్సు!"

బసవరాజు గట్టిగా నిట్టూర్చి అన్నాడు -

"హు! ఉన్నదంతా వాళ్లే! ఉద్రేకం బ్రాండు! అదేగా నా విచారం!"

"వాళ్లకి బావమరుదులు కూడా వున్నారా సార్?"

"వుండే వుంటారు!"

"అయితే సర్! తమరు జాగ్రత్తగా వుండాలి! ఈ రోజుల్లో ఫ్రండ్‌షిప్‌కి అర్థం లేకుండా పోయింది! వున్నదంతా ఉద్రేకమే! కొచ్చిన్లో నిన్న ఈ దారుణం జరిగితే - ఇవాళోరేపో ఇక్కడ జరగొచ్చు! మేటరాఫ్టైం తప్ప - అక్కడా ఇక్కడా మేటరంతా ఒకటే కావచ్చు!"

"మిస్టర్ పాణీ!"

"సర్!"

"నాకోసం నా ఫ్రండెవరొచ్చినా నా గదిలోకి పంపించకు!"

"పంపను సార్!"

"ఆ ఫ్రండుకి బావమరిది వున్నాడంటె అస్సలు పంపించకు!"

"ఎట్టి పరిస్థితుల్లోనూ పంపను సార్!"

"ఆ బావమరిదికి ఉద్యోగం కోసం వచ్చేడని తెలుస్తే-"

"చచ్చినా పంపించను సార్!"

"బసవరాజు అండ్ కంపెనీలో - బసవరాజు గారి ఫ్రండ్స్ తాలూకు బావమరుదులకు ఉద్యోగాలు లేవని చెప్పు!"

"ఆ విషయం నాకు వదిలేసి తమరు నిశ్చింతగా వుండండి సార్!"

* * *

బసవరాజు అండ్ కంపెనీలో -

బసవరాజు గారి ఫ్రండ్సు తాలుకు బామ్మర్దులకు ఉద్యోగాలివ్వకూడదని - స్వయంగా బసవరాజుగారే తీసుకున్న నిర్ణయం తెలీని రంగనాథం - తనింట్లో ముస్తాబవుతూ అంటున్నాడు -




"ఈ ఊళ్ళోనే - బసవరాజని నాకో మంచి ఫ్రండున్నాడు!"

తాను ఆశించే సందర్భం దగ్గిరపడుతుందనే ఆనందంతో వేణు చిన్న ముక్తాయింపు ప్రయోగించేడు -

"బసవరాజా! ఈ పేరెక్కడో విన్నట్టుంది బావా!"

ఎక్కడో విన్నట్టుందనే మాటకి రంగనాథం రుద్రుడయ్యేడు -

"అంతేరా అంతే! నా ఫ్రండ్సందరూ ఆఫ్టరాల్‌గాళ్ళే! మోస్ట్ కామన్ నేమ్స్ పెట్టుకుంటారు! అంచేత ఆ పేరు ఎక్కడో విని వుంటావ్! బసవరాజు టైర్స్. బసవరాజు ట్యూబ్స్, బసవరాజు టైర్సండ్ ట్యూబ్స్ - ఈ సమస్తమైన ఇండస్ట్రీస్ అన్నీ ఎవరివి అనుకుంటున్నావ్?"

"డెఫినిట్‌గా బసవరాజు గారివే!"

"అవునా? వాణ్ని నేను బసవడూ అంటాను. బసివీ అని పిలుస్తాను!"

"వారు నిన్నేమని పిలుస్తారు?"

ఆ మాటకి రంగనాధానికి మళ్ళా కోపమొచ్చింది.

అందుకే మంట మీద అన్నాడు - "అది నీకనవసరం! నీక్కావల్సింది వాడి ఇండస్ట్రీస్‌లో ఉద్యోగం! అంతేగాని - వాడు నన్ను ఏ పేరుతో పిలుస్తాడు, ఏ చేత్తో కొడతాడు, ఏ కాల్తో తంతాడు - ఈ వివరాలు నీకు అనవసరం! ఆ పనులేవో నేనూ వాడూ చూసుకుంటాం! నీక్కావల్సిందల్లా ఉద్యోగం!"

"ఈ ఊళ్ళో ఉద్యోగం!"

"వాడి ఇండస్ట్రీస్ వున్నవి సాక్షాత్తు ఈ ఊళ్లోనే! రంగూన్లోనో, రావల్పిండిలోనో కాదు! ఇక్కడే... ఈ హైదరాబాదులోనే!"

"థేంక్స్ బావా! మంచి ఫ్రండంటున్నావు గదా! తప్పకుండా యిస్తాడు మంచి ఉద్యోగం!"

"చచ్చినట్టు యిస్తాడు! అయినా - నీకు మాత్రం తక్కువేమిట్రా? ఈ రంగనాధానికి స్వయంగా బావమరిదివి! ఈ క్వాలిఫికేషను చాలు! పైగా ఎం.ఎ. చేసి, ఎం.బి.ఎ. కూడా చదివేవ్! నా కోసం నాగపూర్ ఉద్యోగాన్ని ఆఫ్టరాలని తీసిపారేసేవ్! ఇంత త్యాగం చేసిన వాడివి - ఇన్ని క్వాలిఫికేషన్లు వున్నవాడివి - నీకు తగిన ఉద్యోగం ఇవ్వలేడా ఆ బసివిగాడు?" ఇంత గట్టి హామీ యిస్తున్న బావగారి మీద ఆ బావమరిదికి శ్రద్ధ ఎక్కువగా పెరిగిపోయిన కారణంగా - బావగారి చొక్కాకి గుండీలు పెడుతూ అన్నాడు వేణు -




"ఇచ్చుకుంటాడు బావా! తప్పకుండా ఇస్తాడు! నీకెందుకు నువ్వెళ్లిరా!"

"వెళ్ళిరమ్మని దీవించి పంపితేగాని జరగదనుకుంటున్నావా? ఫోన్... ఫోన్ చాలురా! వాడి మొహం చూడకుండానే ఫోన్ కొట్టి ఉద్యోగం వేయించగలను! కాకపోతే - వాడిని చూచి వారం దాటింది గదాని - స్వయంగా వెడదామనుకుంటున్నాను!"

"థేంక్స్ బావా! వెళ్ళిరా"

అని వేణు తన బావగారికి చేతులు జోడించేడు!

(ఇంకావుంది)

మే 1 మన్నాదే పుట్టినరోజు సందర్భంగా...



# ప్రబోధ్ చంద్ర దే - ఎక్కడా విన్న పేరు కాదు
# మన్నాదే - ఎప్పుడూ వినాలనిపించే పేరు

మన దక్షిణాదిలో మన్నాదే గా సుపరిచితుడైన ఈ అపురూప గాయకుడు అతని మాతృభాష బెంగాలీ ప్రకారం మన్నాదే. ప్రబోధ్ చంద్ర దే అన్న అసలు పేరు బహుశా ఈ సరికి అతను కూడా మరిచి పోయివుంటాడు. అతని బాబాయి కె.సి.దే హిందీ గీతాల తొలితరం ప్రేమికులకు ఆరాధ్యుడు; మన్నాదే నిన్నటి తరానికీ, అభిరుచి వున్న నేటి తరానికీ అతి ప్రియతముడు.

మన్నాదే లాయరు కాబోయి సింగరు కావడం శ్రోతలు చేసుకున్న అదృష్టం. కె.సి.దే కుర్రవాడి సంగీతానురక్తినీ, గాన నైపుణ్యాన్ని గమనించి, 1940లో తనతో పాటు బొంబాయి తీసుకు వచ్చేశాడు. అక్కడ హెచ్.పి.దాస్ వద్ద మొదట మన్నాదే సహకార సంగీత దర్శకుడిగా పనిచేస్తూ, ఠుమ్రీ, భజన్, ఖవ్వాలీలను అభ్యసించాడు తన 22వ ఏట 'రామరాజ్య' సినిమాలో వాల్మీకీ పాత్రధారికి పాడిన పాటతో సినీరంగ ప్రవేశం చేశాడు. మన సినిమా వాళ్ళ అనేక దురలవాట్లలో ఒకటి, గాయకుల పైనా, నటుల పైనా ముద్ర వేసెయ్యడం. దీనికి మన్నాదే బలయిపోయి, వరసగా పౌరాణిక సినిమాలకు, ముసలి పాత్రలకు మాత్రమే పాడాల్సి వచ్చింది. దీనితో విసిగిపోయిన మన్నాదే, హిందీ చిత్రసీమకు వీడ్కోలు చెప్పి, కలకత్తా వెళ్ళిపోదామనుకుంటున్న తరుణంలో, 'మశాల్' సినిమాకోసం పాడిన మార్చ్ సాంగ్ 'ఊపర్ గగన్ విశాల్' సూపర్ హిట్టయి కూర్చుంది. మన్నాదే దశ తిరిగింది. అతి త్వరలోనే ఒక గొప్ప గాయకుడిగా స్థిరపడ్డాడు.

మన్నాదే హిందీ చిత్రసీమలో చేరే నాటికి, అప్పటికే కొందరు హేమాహేమీ లున్నారు. మరికొందరు త్వరలోనే చేరారు. రఫీ అడుగు పెట్టినప్పుడు తలత్ ఒక్కడే - అతనికి ప్రధాన పోటీదారు. కానీ మన్నాదేకి రఫీ, తలత్, ముఖేశ్, హేమంత్, క్రమేపీ కిశోర్... ఇలా చాలా మంది పోటీదార్లు తయారయ్యారు. వీళ్ళందరికీ కూడా, వాళ్ళను అభిమానించే, ప్రమోట్ చేసే సంగీత దర్శకులున్నారు. రఫీకి నౌషాద్, ముఖేశ్ కి శంకర్ జైకిషన్, కిశోర్‌కు బర్మన్, హేమంత్ కుమార్



కు బర్మన్ తో పాటు స్వీయ సంగీత దర్శకత్వం, తలత్ కు అనిల్ బిశ్వాస్.... ఇలా. తమాషా ఏమిటంటే, ఈ సంగీత దర్శకులందరికీ మన్నాదే మీద గొప్ప గౌరవం. కానీ ఆ గౌరవం హీరోకి ప్లేబ్యాక్ పాడే పాటలు ఇచ్చేందుకు పనికి వచ్చిందా అన్నది సందేహమే. (బర్మన్, శంకర్ జైకిషన్ లు మాత్రం దీనికి మినహాయింపు). మరో సమస్య, కథానాయకుల అభీష్టం, స్వరౌచిత్యం! తలత్, అప్పటి హీరోల్లో దిలీప్‌కూ, రఫీ సర్వజనులకూ, కిశోర్ దేవానంద్ కూ, ముఖేశ్ రాజ్‌కపూర్‌కు, హేమంత్ దేవానంద్‌కు, ఆ తర్వాత బిశ్వజిత్‌కు బాగా నప్పిన కంఠస్వరాలు. మన్నాదేకి అలాంటి ప్రత్యేకమైన హీరోలు ఎవ్వరు లేరు. ఆయని గొంతు ఏ హీరోకు ఎక్కువ నప్పుతుందో తేల్చుకోలేని స్థితి; కానీ అందరు నాయకుల పైనా శ్రావ్యంగా వినిపించే పరిస్థితి. అది ఒక విధంగా లాభం. మరో విధంగా నష్టం. అతనికి ముద్రల్లేక పోవడం మంచిదే. కానీ నాయకులకు పాడే అవకాశాలు కూడా తగ్గాయి. ఒక్క శంకర్ జైకిషన్ మాత్రం ముఖేశ్‌తో పాటు మన్నాదేని కూడా రాజ్‌కపూర్‌కు తరచుగా పాడించారు. నిజానికి అందరు హీరోలకీ మన్నాదే కంఠస్వరం ఇంపుగా అమిరేది. దానికి ముఖ్య కారణం, అతని గొంతులో సమయానుకూలంగా పలికే భావం. పాటను దృశ్యమానం చేసే హావభావ ప్రకటన. ఏ వెన్నూ, దన్నూ లేకపోయినా, గాయకుడిగా తన ప్రత్యేకతను, అస్తిత్వాన్ని నిలబెట్టుకుని, పాడిన ప్రతి పాటా మరపురానిదిగా మన మనసుల్లో నిలిచిపోయేలా చేయగలగడానికి కారణం, మన్నాదే లోని అసాధారణ ప్రతిభే.

'ఆజా సనమ్ మధుర్ చాంద్‌నీ మే హమ్ తుమ్' (చోరీచోరీ -1956) అని తన్మయంగా పాడుతున్న రాజ్ కపూర్,

'బాబూ సంఝొ ఇశారే' (చల్తీకా నామ్ గాడీ-1958) అని కంగారు పడుతున్న అశోక్‌కుమార్

'హస్నె కే చాహనే ఇతనా ముఝే రులాయా హై-' (అవిష్కార్ - 1973) అని రోదిస్తున్న రాజేశ్ ఖన్నా

'అప్ నే లియే జియేతో క్యాజియే' (బాదల్ -1966) అని ఉద్బోధించే సంజీవ్‌కుమార్

'ఝునక్ ఝునక్ బాజే పాయలియా' (మేరే హుజూర్ - 1968) అని ఉద్వేగ పడుతున్న



మన్నాదే, రఫీ, తలత్

రాజ్‌కుమార్

'ఐ మేరీ జొహర్ జబీ తుఝె మాలూమ్ నహీ' (వక్త్ - 1965) అని బులిపిస్తున్న బల్ రాజ్ సహానీ

'యారీ హై ఈమాన్ మేరా యార్ మేరి జిందగీ' (జంజీర్ - 1973) అని ఢంకా బజాయిస్తున్న ప్రాణ్...

ఇలా అందరి నటుల అభినయాన్ని తన గొంతులో పలికించగల దిట్ట మన్నాదే. 'దర్శన్ దో ఘన్ శ్యామ్' వంటి భక్తి ప్రపూర్ణమైన గీతం విని, వెంటనే 'జోడీ హమారీ, జమేగా కైసే' ఔలాద్ (1968) అని చిందులు వేసే హాస్య గీతం వింటే, మన్నాదే గానంలోని వైవిధ్యం అర్థమవుతుంది.

దాదాపు 50 ఏళ్ళ సినీ జీవితంలో మన్నాదే తోటి వారితో పోలిస్తే, తక్కువ పాటలే పాడాడు. కాని ఏ సంగీత దర్శకుడి కైనా శాస్త్రీయ సంగీతం ఆధారంగా పాట పాడించాల్సి వస్తే, చప్పున స్ఫురించే గాయకుడు మన్నాదే యే. అందుకే రఫీని ఎంతో ప్రేమించిన మదన్‌మోహన్ కూడా 'కౌన్ ఆయా మేరే మన్‌కే ద్వారే' (దేఖ్ కభీరారోయా) మన్నాకు ఇచ్చాడు. భరత్ భూషణ్ స్వరం గా 'బైజూ బావరా' తో స్థిరపడిపోయిన రఫీని కాదని 'బసంత్ బహార్' చిత్రంలో శంకర్ జైకిషన్ మన్నాదేకే ఎక్కువ పాటలు ఇచ్చారు. ఈ సినిమాలోని 'సుర్ న సజే క్యా గావూ మై' మన్నాదే పాటల్లోనే గొప్పది మాత్రమే కాదు. శంకర్ జైకిషన్ ల యుగళానికి థీమ్ సంగీతం వంటిది. జైకిషన్ చనిపోయాక శంకర్ అన్ని ఇంటర్వ్యూలలోను గుర్తు తెచ్చుకున్న, పాడిన పాట ఇదే. ఏ పాటకు ఏ గాయకుడు న్యాయం చేయగలడో నిర్ణయించడంలో దిట్ట అయిన ఎస్.డి. బర్మన్ ఎక్కువ రఫీని, కిశోర్‌ని నమ్ముకున్నా, 'మేరీ సూరత్ తేరీ ఆంఖే' లో శాస్త్రీయ సంగీత ఆధారితమైన 'పూఛోనకైసె మైనే రైన్ బితాయే' మన్నాదే కి ఇచ్చాడు. ఆ పాట హిందీ గీతాల్లోనే తొలి వరసలో నిలుస్తుంది.

గాంభీర్యం, మార్దవం, విషాదాలలో రఫీతో పోటీ పడే మన్నాదే స్వరం. అల్లరి, హాస్యాలలో కిశోర్ కు జోడీగా నిలుస్తుంది. అందుకే మన్నాదే సోలోలు ఎంత ప్రసిద్ధమో, అతను ఇతర మగ గాయకులతో పాడిన యుగళాలు కూడా అంతే ప్రసిద్ధం. రఫీతో మన్నాదే పాడిన 'ఫిర్ తుమ్హారి యాద్ ఆయి ఐ సనమ్' (షిరీన్ ఫీదీ, ఫర్హాద్) భావుకత్వానికి పరాకాష్ట అయితే, 'న తో కారవాకీ తలాశ్ హై' (బర్సాత్‌కి రాత్ 1960), ఖవాలీ లలోనే నభూతో నభవిష్యతి అని చెప్పగలిగిన గొప్ప పాట. అలాగే కిశోర్‌తో పాడిన 'ఎక్ చతురనార్ కర్ కే సింగార్' (పడోసన్ 1968) మన్నాదే స్వరంలోని నాటకీయతను ప్రస్ఫుటం చేస్తే, 'యే దోస్తీ, హమ్ నహీ ఛోడెంగె' (షోలే 1975) స్నేహ గీతాల్లో రికార్డు సృష్టించింది. మహేంద్ర కపూర్‌తో పాడిన 'ఐ మా తెరీ సూరత్ సె అలగ్ భగవాన్ కి సూరత్ క్యాహోగీ' (దాదీమా 1966) మన్నాదే ఏ స్వరంతో నైనా ఎంత అలవోకగా కలిసిపోగలడో చెప్తుంది. ముఖ్యంగా రఫీ, కిశోర్ లతో పాడిన పాటలు వింటే, రెండు తరాలకు మకుటం లేని మహారాజు లైన రఫీ, కిశోర్ లకు మన్నాదే ఎందులోనూ తీసిపోడని నిరూపిస్తాయి.

అలాగే, లత, ఆశా, గీతా, సుమన్ లతో యుగళ గీతాలు పాడేటప్పుడు, ఆయా



'మానస మైన వరు' అంటూ మన్నాదే ప్లేబాక్ పాడిన ప్రఖ్యాత మలయాళ చిత్రం 'చెమ్మీన్'లో ఓ దృశ్యం

గాయకుల శైలికి దీటుగా తన శైలిని అనువర్తింప చేసుకున్న గాయక మేధావి మన్నాదే.

లతా మాధుర్యంతో జత చేసి 'దిల్ కీ గిరహ్ ఖోల్ దో చుప్ న బైఠో',(రాత్ ఔర్ దిన్ 1967) 'యే రాత్ భీగీ భీగీ',(చోరీ చోరీ 1956) గీతాదత్ చిలిపి తనంతో చేరిపోయి, 'మై తేరే ప్యార్ మే క్యా క్యా న బనా దిల్‌బర్' (జిద్దీ 1964), ఆశా నాటకీయ ఫక్కీని అనుకరిస్తూ 'జుల్ఫోంకి ఘటా లేకర్ సావన్ కి పరీ ఆయీ'.. (రేష్మి రుమాల్ 1961) ఇలా అందరి ఆవాజ్ లను తనలో పలికించగల సృజనాత్మక గాయకుడు మన్నాదే.

మన్నాదే పాటలు అనేకం విన్నాక, తాత్వికతకు అతని స్వరం బాగా నప్పుతుందని అనిపిస్తుంది.

'చలే జారహే హై, మొహబ్బత్ కే మారే, కినారే కినారే' (కినారే కినారే 1963).

'నదియా చలే చలే రే ధారా.... తుఝ్ కో చల్ నా హోగా' (సఫర్ 1946)

'కస్మే వాదే ప్యార్ వఫా సబ్ బాతే హై బాతోంకా క్యా'... (ఉప్‌కార్ 1967) ఇలా చెప్పుకుంటు పోతే ఎన్నో. కాకపోతే, సినిమాల పాటల్లో తాత్విక గీతాలు తక్కువుంటాయి. మన్నాదేవి చిరస్మరణీయ మైన గీతాలు ఎన్నో ఉన్నాయి. అందులో మచ్చుకు ఒక్కటి. లతా తన 'ఐ మేరే వతన్ కీ లోగో' తో కంట తడి పెట్టిస్తే, మన్నాదే, తన 'ఐ మేరే వతన్, ఐ మేరే బిఛ్‌డే చమన్, తుఝ్ పే దిల్ కుర్బాన్' (కాబూలీవాలా 1961) తో గుండెల్ని పిండేస్తాడు.

గాయకుడిగానే కాదు. వ్యక్తిగా కూడా, చాలా గౌరవపాత్రుడు మన్నాదే. బెంగాలీలో హేమంత్, హిందీలో రఫీ, మన్నాదే కు రావలసినన్ని అవకాశాలు రాకుండా చేసినవారు. కానీ వారిద్దరి పైన అమితమైన అభిమానం, గౌరవం అతని మాటల్లో ధ్వనిస్తాయి. ముఖ్యంగా రఫీకి తను వీరాభిమానినని మన్నాదే నే స్వయంగా ఎన్నో ఇంటర్వ్యూలలో చెప్పుకున్నాడు. 'నిజమే. నేను రఫీ కంటే ఎక్కువ సంగీత శిక్షణ పొందాను. కాని రఫీలోని మాధుర్యమేదీ నాలో!? ఉచ్ఛ స్వరంలో పాడాల్సి వచ్చినపుడు, నా గొంతులో ఒకింత వణుకు వస్తుంది. కానీ రఫీలో అలాకాదు. ఏ స్థాయిలో పాడినా ఆ స్వర మాధుర్యం చెక్కు చెదరదు. అందుకే అతను నాకంటె గొప్ప గాయకుడని ఒప్పుకోడానికి నాకేం బాధలేదు' అని వివిధ్ భారతిలో ఇచ్చిన ఇంటర్వ్యూలో కొన్నేళ్ళ క్రితం మన్నాదే అన్నాడు. ఈనాటి కళాకారులు మన్నాదే నుంచి నేర్చుకోవలసింది కేవలం ఆ తపన, అభ్యాసం, సంగీతం పట్ల నిబద్ధత మాత్రమే కాదు. అతని ఔదార్యం, మంచితనం కూడా. ఈనాటి 'లొల్లి' సంగీతంలో మన్నాదే ఇమడడు. అతనికి తగిన పాటలు స్వరపరిచే శక్తి చాలా తక్కువ మందికి ఉంది. అయినా అతని అభిమానులకు ఏం కొదవలేదు. అతన్ని అపుడపుడు టి.వి.లో చూస్తూ (జీటివి అవార్డు ఇచ్చిన సందర్భంలోలా) అతని పాటలు పదే పదే వింటూ, ఆనందాన్ని పొందవచ్చు.

**-మృణాళిని**




మాష్టారు: మై డియర్ స్టూడెంట్స్....! ఈ రోజురాత్రి 8 గం॥లకు చంద్రగ్రహణం ఉంది. మిస్సవకండి తప్పకచూడండి!
ఒక స్టూడెంటు: అలాగే సార్ ఏ ఛానల్లో వస్తుంది సర్!





"నాన్నా! రేపట్నుంచి నేను స్కూలుకు పోను. మా మాష్టారు వట్టి పిచ్చి మనిషి మా తెలివి తేటల్ని కూడా నాశనం చేస్తున్నాడు"
"అదెలా?"
"నిన్నేమో ఎనిమిది, రెండు కలిపితే పది అన్నారు. మరి ఇవాళ ఏడు, మూడు కలిపితే పదట".

"ఇదేం గదయ్యా ఇందులో మంచం లేదు, పరుపు లేదు, ఫ్రిజ్జు లేదు. పొరుగూరినుండి వచ్చానని చవట కింద జమకట్టి ఉంటావు! నేనీరూమ్‌లో ఉండనంటే ఉండను. నేనిచ్చిన అడ్వాన్స్ నాకిచ్చేయ్..."
"తొందరపడకండిసార్ ఇది గది కాదు లిఫ్టు!"





బస్సులో ఓ ప్రయాణికుడు తోటి ప్రయాణికునితో "ఏంటయ్యా ఈ సారా వాసన..!? నీకసలు తెలుస్తోందా నీవు నరకానికి పోతున్నావని?"
"అలాగా.... డ్రైవర్ బస్సు ఆపు. నేను పొరపాటున వేరే బస్సు ఎక్కేసా"



రాగిణి తన భర్త పనిచేసే ఆఫీసుకు ఫోనుచేసి కనక్షనిమ్మంది
రిసెప్షనిస్ట్: నంబరు చెప్పండి.
ఆమె: ఏమయ్యా నాకు ఎంతమంది భర్తలనుకున్నావ్.... నంబరు చెప్పడానికి!? ఉన్నది ఒకే ఒక భర్త... త్వరగా కనక్షనివ్వు.



"అమ్మా! మనం ఇతరులకు సాయపడడం కోసమే పుట్టామని మా టీచరు చెప్పింది!"
"నిజమే బాబూ!"
"అయితే ఇతరులు దేని కోసం పుట్టారమ్మా!?"



"ఆ మధ్య ఓ రూపాయి పెట్టి కొన్న లాటరీ టిక్కట్టుకి లక్షరూపాయలు వచ్చాయటే..... పేపర్లో వేశారు."
"అసలు నాతో చెప్పకుండా.... ఆ ఒక్క రూపాయి కూడా ఎందుకు ఖర్చు చేసారు... అది చెప్పండి ముందు."

**ఈ జోక్‌లను పంపినవారు : జి.బి.లక్ష్మి, హైదరాబాద్**




ఏమయ్యోయ్ మన మనవడు మా అమ్మను చూడటానికి పట్నం వెడుతున్నాడు. వాడిని అక్కడనుండి ఏమైనా తెమ్మంటారా?
అలాగే! మన పెళ్ళి బాపతు కట్నం మీ అమ్మనడిగి తీసుకురమ్మని చెప్పు!



**ఈ జోక్‌ను పంపినవారు : బచ్చు వీర్రాజు, రాజమండ్రి.**



ఆయన చిత్తుగా త్రాగి షాపింగ్ వెళ్ళాడు. ఎదురుగా సేల్స్ గరల్ ముందు మసగ్గాను ఆ తరువాత స్పష్టంగానూ కనపడింది.
"క్షమించండి నేనేమైనా నిర్మొహమాటంగా చెప్పేస్తాను. ఇంతవరకూ మీ అంత వికారంగా ఉన్న స్త్రీని నేను చూడలేదు"
ఆవిడకు కోపం వచ్చింది. "నేను కూడా మీ అంత త్రాగుబోతును చూడలేదు"
"కావచ్చు కాని నేను పొద్దుటికల్లా మామూలు మనిషినయిపోతాను"

**ఈ జోక్‌ను పంపినవారు : బద్ది పాండు రంగారెడ్డి, కరీంనగర్.**



హార్ట్ స్పెషలిస్ట్: భగవంతుడు పంటి డాక్టర్ల పక్షపాతి అనుకుంటాను.
పేషెంటు: ఎందుకలా చెబుతున్నారు?
హార్ట్‌స్పెషలిస్ట్: మనిషికి ఒక గుండెనే పెట్టి 32 పళ్ళు మాత్రం పెట్టాడుగా?



అతడు: ఆ డైరెక్టర్ ఎందుకలా కారుక్రింద పడుకొని ఆలోచిస్తున్నాడు?
ఇంకొకతను: పూర్వం అతను కారు మెకానిక్‌గా ఉండేవాడట- కారుక్రింద పడుకుంటేనే కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయట

**ఈ జోక్‌లను పంపినవారు: ఎం.శిరీష, చిత్తూరు.**

కొత్తగా ఓ ఆఫీసులో చేరిన ఓ గుమస్తా ఆఫీసర్‌తో అన్నాడు.
"సార్! నాకు నా ఉద్యోగంతో పాటుగా ఆఫీసు నైట్ వాచ్‌మెన్ ఉద్యోగం కూడా ఇప్పించగలరా!?"
"అదేంటయ్యా... గుమస్తాగా నీకొచ్చే జీతం బాగానే వుందిగా... మళ్ళీ పార్టుటైమ్ జాబెందుకు..."
"నాకు ఇంటి దగ్గర నిద్ర, మనశ్శాంతి రెండు కరువయ్యాయి సార్..."





ఓ నిర్మాత సాటి నిర్మాతతో అన్నాడు "మా నూతన చిత్రం ఇపుడు వస్తున్న చిత్రాలకు చాలా భిన్నంగా ఉంటుంది"
"అంటే... ఎలా..?"
"ఏముంది మా చిత్రంలో అన్ని పాత్రలకు కాన్సర్ ఉంటుంది" చెప్పాడు నవ్వుతూ ఆ నిర్మాత.



ఓ డాక్టరు ఓ ఆరేళ్ళ పిల్లవాడిని పరీక్ష చేస్తూ అన్నాడు. "బాబూ! ఏది ఓమారు నీ నాలుక బయటకు చాపు..."
"ఊహు! నేను చాపను"
"ఏం?"
"మీరు కూడా మా డాడీలా తడి చేసుకుని డబ్బు లెఖ్ఖపెట్టుకుంటారు. నాకు తెలుసుగా..." చెప్పాడు ఆ పిల్లవాడు.

ఏమోయ్! నువురోజులానే ఈరోజు కూడా ఆఫీసుకు ఆలస్యంగా వచ్చినా ఆఫీసరు ఏమీ అనలేదు. కారణం ఏమై ఉంటుందంటావు!" ఉత్సుకతతో అడిగాడు ఉదయ్.
"సింపిల్. మేమిద్దరం కలిసే వచ్చాంలే..." అసలు విషయం చెప్పాడు విజయ్.



**ఈ జోకులను పంపినవారు: బి.వి.ఎస్.బాబు**

**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడు, విజయ్ అనే పేదవాడు ఒక ఏడాదిపాటు తమ తమ స్థానాలను మార్చుకోవాలని నిశ్చయించుకుంటారు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజర్ భానోజి మోసం చేస్తున్నాడని గమనించి అతని కూతురు సరళతో ప్రేమ నటిస్తాడు. కానీ ఆమె తనంటే నిజంగా ఇష్టపడుతోందని అనిపిస్తుంది అతనికి. భానోజీ అనుచరులను ఉద్యోగంలోంచి తీసేసి, దుబారా తగ్గిస్తూ, భానోజికి ముకుతాడు వేస్తుంటాడు. విజయ్ స్థానంలో వచ్చిన అజయ్ చెల్లెలు మీనా కాపురం సరిదిద్దే ప్రయత్నంలో బావ బుజ్జిని బెదిరిస్తాడు. బుజ్జి భార్యను కలవడానికి చాటుగా వస్తుంటాడు. మోటారు మెకానిక్‌గా పని చేస్తున్న అజయ్‌కు తన కొలీగ్ ప్రకాష్ చెల్లెలు పద్మతో ప్రేమలో పడతాడు. అజయ్ మీనా మామగారితో మాట్లాడితే నగలు యివ్వకపోతే కోడలిని స్వీకరించనని తేల్చి చెపుతాడాయన.

(ఇక చదవండి)

# అన్నపూర్ణా వారి ఇద్దరు మిత్రులు



## సీరియల్ - నెం 16

**రచన : ముళ్ళపూడి వెంకటరమణ**

పరంధామయ్య అంటే డబ్బు అనుకున్న అజయ్, "చెల్లెలు" మీనా కాపురం నిలబెట్టడానికి నిశ్చయించుకున్నందువల్ల ప్రతీకారం ఆలోచించ లేదు-పౌరుషం అటులాగినా, డబ్బు పుట్టించడమే పరిష్కారమార్గం. అందుకు మార్గం తోచలేదు. అయిదా పదా, వేలు గుమ్మరించాలి. పూర్వం-తన పూర్వాశ్రమంలో ఇది సమస్యగా కనబడేది కాదు. అడగడం ఆలస్యంగా కురిసేది. తమ పెత్తనం ఆరంభించాక కూడా, డబ్బుకి ఇబ్బందివస్తే భానోజీగారు టెలిఫోన్‌చేసి నిముషంలో తెప్పించేవాడు. ఇప్పుడు నోరుతెరిచి అడిగినా ఇచ్చే నాధుడు- ఇవ్వగలవాడు లేడు. ఇంట్లో తన స్థానంలో కూర్చున్న విజయ్ తప్ప. కాని, విజయ్ సమస్యలు తాను పరిష్కరిస్తానని పంతంపట్టివచ్చి, చివరికిలా యాచిస్తే,-ఆ డబ్బు తనదే అయినా, తను ఓడినట్లే అవుతుంది....కాని తన గెలుపు ఓటమి ఇప్పుడు ముఖ్యంకాదు మీనా జీవితం.



....కావాలంటే, తను విజయ్ దగ్గర అప్పుగా తీసుకొని, గడువుతీరేలోగా గడించి తీర్చి మరీ వెళ్ళవచ్చు. విజయ్ ఏమంటాడో అన్న అనుమానం కూడా ఉంది. ఒప్పించవచ్చునన్న ధీమాతో, తప్పనిసరి అన్న అభిప్రాయంతో, ఇంటికి టెలిఫోన్ చేశాడు అజయ్.

"హల్లో హెడ్‌క్లర్క్ స్పీకింగ్ ప్లీజ్"



"అజయ్ బాబుగారున్నారా?" అన్నాడు అజయ్‌బాబు వినయంగా.

"లేరండి. పిక్నిక్ వెళ్ళారు"

అజయ్ గుండె దిగజారిపోయింది.

"ఎప్పుడు వస్తారో తెలుసా?" అన్నాడు ఒక్క క్షణం ఆగి.

"ఏమో ఎప్పుడు వస్తారో" అన్నాడు శేషావతారం.

అజయ్ ఆలోచనలో మునిగిపోయాడు.



అజయ్ పాత్రధారి విజయ్, భానోజీగారి భవంతిలో ఆనందంలో మునిగి తేలుతున్నాడు. తేలినప్పుడల్లా, నగలరహస్యం తెలియబోతూందన్న ఆశతో, అది ఏమై వుంటుందన్న ఉత్కంఠంతో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు.

సరళ ముస్తాబవుతోంది. అతను ఇవతలి గదిలో ఆల్బమ్ తిరగవేస్తూ, అద్దం తలుపుమీద పడుతున్న ఆమె నీడ ఒంపుసొంపులు ఓరకంట చూస్తూ కూర్చున్నాడు.



"సారీ! ఆలస్యమైంది" అంటూ వచ్చింది సరళ.

"ఫరవాలేదు. నీకోసం నిరీక్షించడంలో కూడా ఆనందం వుంది." అన్నాడు విజయ్ ఆమె ప్రత్యంగ సౌందర్యాన్ని తనివితీరా నేత్రాలతో ఆస్వాదిస్తూ.

"ఏమిటలా చూస్తున్నారు, నమిలి మింగేస్తారేమిటి కొంపతీసి" అంది సరళ మనోహరంగా నవ్వి.

"అంత పనీ చేసివుందును నీ అందానికి ఆభరణాలు కూడా మాచ్ అయితే-" అన్నాడు విజయ్- అంతకుముందే ఆలోచించుకున్న ప్రకారం సంభాషణ ఆరంభిస్తూ.

"ఆడవాళ్ళకి అందమిచ్చేది ఒకే ఒక ఆభరణం. అది బంగారమే కానక్కరలేదు. పచ్చని తాడైనా చాలు" అంది సరళ సిగ్గుపడుతూ.

"ఓహో అదా... అదీ వేసుకుందువుగాని సమయం వచ్చినపుడు.



అందాకా ఈ నగలతోనే ఉంటావా జానపద చిత్రంలో కథానాయిక లాగా?" అన్నాడు విజయ్ నవ్వుతూ.

"అవునవును అమెరికానుంచి దిగొచ్చారు కదూ. ఆ హాలీవుడ్ నాజూకులన్నీ మీకే తెలియాలి."

"ఆ లోలాకులేమిటి ఆ నెక్లెసేమిటి మైసూరుపాకు తింటూ మిరపకాయ నంజుకున్నట్టు బాడ్ టేస్ట్. నేను సెలక్ట్‌చేసి ఒక సెట్ కొనిస్తాను. అప్పుడు చూడూ-"

"మహాశయా, కొత్తగా మీరేమీ కొనక్కరలేదు. నాకున్న నగలన్నీ తీసుకొస్తాను మీ కిష్టమైనది సెలక్ట్ చేయండి" అంది సరళ.



తన అంచనా ప్రకారం, అనుకున్న దారికి వచ్చింది చర్చ.

"నీ కెందుకాశ్రమ, నేనేవస్తాను పద..." అన్నాడు విజయ్.

ఆభరణ ప్రదర్శన చూడగానే కళ్లు తిరిగిపోయాయి విజయ్‌కి. అనుకున్నంతా అయింది... ఒక బీరువా అరలనిండా ఉన్నాయి నగలు. అంతా అజయ్‌బాబు తల్లిగారి జవహారీయే అయుండాలి.

"నీకు చాలా నగలున్నాయే? నాకంటే నువ్వే ధనవంతురాలివిలా వున్నావ్" అన్నాడు విజయ్- సరళను పరీక్షగా చూస్తూ.

సరళ కళ్ళు వాల్చింది. "అలా అనకండి అజయ్. వీటిమీద నాకేమాత్రం వ్యామోహంలేదు. ఇదికాదు, నా ఆస్తి..." అంది నెమ్మదిగా మృదువుగా.



"మరేది?" అన్నాడు విజయ్. అతని గుండె కట్టుతప్పి, అమిత వేగంగా కొట్టుకుంది.

"మీరు!...మీరే నా సర్వస్వం" అంది సరళ. ఆమె మాటలో, ఆ కంఠంలో చిత్తశుద్ధిని శంకించడం విజయ్‌వల్ల కాలేదు. అయినా పరీక్ష కొనసాగించాడు.

"సరళా! ఒక వేళ నేను హఠాత్తుగా బీదవాడిని అయిపోతాననుకో, అప్పుడూ అలాగే అనుకుంటావా?"

సరళ అతని కళ్ళలోకి సూటిగా చూసింది. "అజయ్‌బాబూ, మీ సిరిసంపదలను నేనెప్పుడూ ప్రేమించలేదు" అని తల వంచుకుంది. ఆమె నొచ్చుకుందని విజయ్‌కి తెలుసు. ఆ ప్రశ్న వేసినందుకు- విజయ్‌గా- తనూ నొచ్చుకున్నాడు.



"తమాషాకన్నాను సరళా. నీ మనసు నాకు తెలియదూ?" అన్నాడు సరదాగా నవ్వి.

ఆక్షణంలో విజయ్‌కి ఆమె మనసూ తెలిసింది. అంతకన్నా బాగా తన మనసూ తెలిసింది...

* * *

అజయ్‌బాబూ చాలా ఆలోచించి, సాహసించ నిశ్చయించాడు. విజయ్ పిక్నిక్ నుంచి ఎప్పుడు వస్తాడో తెలియదు. వచ్చేదాకా ఆగడం సాధ్యంకాదు. తను మీనా దుఃఖం చూడలేడు. నిందలను సహిస్తూ ఉండలేడు...తన వేషం తను వేస్తే, బ్యాంకులోంచి తన డబ్బు తను తెస్తే తప్పేముంది గనక? విజయ్‌కి చెప్పకుండా తీసుకోడం బేసబబు కావచ్చు విజయ్ తనకు చెప్పకుండా పిక్నిక్‌లకు పోవడం మటుకేం బాగుంది?

...ఆ క్షణాన తొలిసారిగా అజయ్‌కి విజయ్‌మీద కోపం వచ్చింది. ఆలోచించింది చాలని తీర్మానించుకుని, తన గొప్పింటి దుస్తులు తీసి, "అజయ్‌బాబు"గా ముస్తాబు అయ్యాడు. తాను ఏనాడో ఇన్‌కంటాక్సు ఆఫీసుకు వెళ్ళడం కోసమని విజయ్ తెచ్చియిచ్చిన జత ఇది. ఈనాడిలా ఉపయోగపడుతోంది.



తన బట్టలు తను వేసుకుని తానుగానే మారువేషం వేసుకుని, తన సంతకం తను ఫోర్జరీ చేసి, తన డబ్బును తాను అక్రమంగా తీసుకోబోతున్నాడు...అజయ్‌కి నవ్వొచ్చింది, తనలోంచి తానులకొద్ది వస్తున్న తానుల పరంపర చూసి...



"ఎక్కడికన్నయ్యా వెళ్తున్నావ్?" అంది మీనా.

"ఒక స్నేహితుడి దగ్గరికి" అన్నాడు అజయ్ ముఖం అటు తిప్పుకొని. "అజయ్‌బాబుగారని, ఓ పెద్ద జమీందారుగారు, మన కష్టాలను విని మనకి సాయం చేస్తానన్నారు. ఈరోజుతో నీ కష్టాలన్నీ తీరుతాయమ్మా. వస్తాను" అంటూ చరచర వెళ్ళిపోయాడు అజయ్.

అంతా ఫెయిరీటేల్ బాపతు కథ చెప్పినట్టుంది.

అజయ్‌బాబుగారనే పెద్ద జమీందారుగారు ఒక పేదవాడి చెల్లెలు కష్టాలను విని సాయంచేస్తానన్నారట. గాడ్! తను జమీందారుగా వున్నప్పుడు ఎవరైనా కష్టాలు వినిపిస్తే సాయంచేసేవాడా?...అసలు వినేవాడా?..



బంగళా వచ్చేసింది. ఆఫీసుహాలు హాలీడేమూడ్‌లో వుంది. పద్మ మాత్రం తలవంచుకు టైపుచేస్తోంది.

"శేషావతారం!" అన్నాడు అజయ్ వేషధారి అజయ్.

"అయ్యా!" అన్నాడు సేవకుడు వినయం దారుణంగా అభినయించి.

"భానోజీ ఎక్కడ?"

"భానోజీగారండీ? ఇవాళ రాలేదండి మరి."

"కాష్ బాలెన్సు ఎంతుంది మీ దగ్గిర?"

"చిత్తం చిత్తం! క్యాష్‌బ్యాలెన్సండీ... ఆరు...ఆరు...నాలుగు వందల నలభై..సరిగ్గా చూసి చెప్తాను మరి."



"అక్కర్లేదు. మిస్ పద్మా! నా చెక్ బుక్ ఇలా ఇవ్వండి" అన్నాడు అజయ్.

పద్మ కంగారుతో లేచి పుస్తకం తీసి ఇచ్చింది... "గుర్తుపట్టదుకదా" అనుకుంటూ, చకచకా పుస్తకం తీసి ఒక చెక్ లీఫ్ చింపుకొని, పుస్తకం తిరిగి ఇచ్చేశాడు.

"మళ్ళీ జాగ్రత్తగా లాక్ చెయ్యండి" అంటూ వెళ్ళిపోయాడు.

సరాసరి బ్యాంకుకువెళ్ళి పదివేల రూపాయలకి చెక్కు రాసి ఏజంటుకు ఇచ్చాడు.

"అవతల నాకర్జంటు పనుంది. క్యాష్ త్వరగా తెప్పించండి" అన్నాడు

"ష్యూర్. మీరు స్వయంగా రావడం ఆలస్యం చేయడమూనా. క్షణంలో



"తెప్పిస్తాను..." అంటూ నౌకరును పిలి "ఈ చెక్కుకి వెంటనే కాష్ తీసుకురా. అర్జంట్. ఆఎంట్రీలన్నీ తరువాత రాసుకోమను" అన్నాడు ఏజంటుగారు ఖంగారుగా.

"కాఫీగాని, కూల్‌డ్రింక్‌గాని ఏదైనా తీసుకుంటారా?"

"నో థాంక్స్"

"ఈ మధ్యలో బిజినెస్ బాగా ఇంప్రూవు చేశారే. అకౌంటు చూస్తే తెలుస్తోంది" అన్నాడాయన నవ్వి.

"అవునవును" అన్నాడు అజయ్- విజయ్‌ని అభినందించాలని అనుకుంటూ.



"మంచి అభివృద్ధికి వస్తోంది" అన్నాడు ఏజంటు. "చెయ్యాలి లెండి" అనికూడా అన్నాడు.

"ఇంకానయం, మీరు చెప్పారు, లేకపోతే మానేద్దామనుకుంటున్నాను" అనబోయి తమాయించుకున్నాడు అజయ్.

"ఇంకా ఇంప్రూవ్ చెయ్యాలి" అన్నాడు ఏజంటు, చర్చని ఇంప్రూవ్ చెయ్యడానికి కృషిచేస్తూ. అంతలో జవాను నోట్లకట్టలు తెచ్చి, బల్లమీద పెట్టాడు. అవి తీసుకుని, "థాంక్స్, వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు అజయ్.



దొంగపని ఇంత బాధాకరమని ఆక్షణందాకా అతనికి తెలియదు. భానోజీగారు ఎలా చేస్తున్నాడో దగాలు మరి... మొత్తానికి ఏపని అయినా, ఒక యిల్లు నిలబెడుతున్నానన్న తృప్తితో దాదాపు గర్వంతో అజయ్ ఇల్లు చేరుకున్నాడు. డబ్బు రాగానే ఇంటికి కళ వచ్చింది; సందడి వచ్చింది; జనం వచ్చారు; సరంజామా వచ్చింది; నిమిషాలమీద అన్నీ సమకూరాయి. ఆపూటే ముహూర్తం పెట్టించాడు.

మీనా కళ్ళలో కృతజ్ఞత. ఆ ఆనందం చూసి జన్మ ధన్యమైందనుకొన్నాడు అజయ్. మరోజీవికి సంతోషం సమకూర్చడంలో ఉన్న ఆనందం, దాని మాధుర్యం తొలిసారిగా అతనికి అనుభూతికి అందాయి. "తండ్రి" రామదాసుగారి ఆనందానికి అవధులు లేవు. ఆ శ్రీరామచంద్రుడికి ఆయన ఎన్ని వందనాలర్పించాడో, ఎంత గాఢంగా కృతజ్ఞత తెలిపాడో ఊహకి అందవు.



"అమ్మాయ్ ఆలస్యం అయితే, మళ్ళీ వర్జ్యం వచ్చేస్తుంది. ఒరేయ్ మేనా పిలూ..."

"పద్మా త్వరగా రావాలి" అని పురమాయించాడు అజయ్.

శోభాయమానంగా, కన్నుల పండువుగా అలంకరించబడిన మీనా- ఆనందంతో ఉద్దీప్తమై వెలిగిపోతున్న మీనా- పద్మవెంట ఇవతలికి వచ్చింది.



"వెళ్లొస్తానన్నాయ్" అని 'అన్నగారికి' పాదాభి వందనం చేసింది.

"క్షేమంగా వెళ్ళిరామ్మా" అంటూ అజయ్ ఆమె చేతిలో కొంత పైకం-కానుకగా ఉంచాడు.

మీనా మేనాలో కూర్చుంది.

తన స్వంత చెల్లెలును పంపుతున్నట్లే అనిపించి, కళ్ళు చెమ్మగిల్లాయి అజయ్‌కి.



రామదాసుగారు ఉత్తర్వు ఇవ్వడంతో మేనా లేచింది. సారె సంభారవాహులు ముందడుగు వేశారు.

"ఒరేయ్, ఒరేయ్, పంచదార చిలకలు జాగ్రత్త. కాకులెత్తుకుపోయేను. ఒరేయ్ అబ్బాయ్! ఇల్లు జాగ్రత్త, ఊరు బాగాలేదు" అంటూ ముందుకు నడిచారు రామదాసుగారు. ఎదురుగా ఇంటి అరుగుమీద కూర్చున్న మహాలక్ష్మమ్మను చూసి, పనిమల్లే దగ్గరకు వెళ్ళి సగర్వంగా రొమ్మువిరుచుకు నిలబడి, "రామలక్ష్మమ్మా అమ్మాయిని అత్తవారింటికి పంపుతున్నాను" అన్నాడాయన.

"ఆ పంపావులే" అని ఆవిడ మూతి విరుచుకోడం గమనించలేదు. రామదాసుగారి ధ్యాస అంతా పరంధామయ్యగారి మీద వుంది. మాటకి మాట ఒప్పగించే మహదవకాశం ఇన్నాళ్ళకి లభించినందు కాయన పొంగిపోయాడు.



అరుగుమీద పులిలా కూర్చున్న బావగారి దర్శనంకాగానే పుంజుకున్నాడు.

"ఆహా! ఆహా! భావగారు! ఎన్నాళ్ళకి మళ్ళీ మీ బుగ్గమీసాలు చూసే భాగ్యం కలిగింది! ధన్యోస్మి! ధన్యోస్మి..." అంటూ వందనంచేసి వెనక్కి తిరిగి, "అలా చూస్తారేమిటయ్యా! అవన్నీ లోపల పెట్టండి. ఆఁ !" అని పురమాయించాడు తన వెంట వచ్చిన మందిని.

"ఆగండి, మీ ప్లీడరు గుమాస్తా పేచీ నా దగ్గిరా. అసలు సంగతి...రొఖం తెచ్చారా?" అన్నాడు పరంధామయ్యగారు ఖచ్చితంగా.



దాసుగారు ఇన్నాళ్ళకి ధైర్యంగా నవ్వారు "హయ్యో!...సామెతచెప్పినట్టు ఆ కోదండ రాముడైనా కొబ్బరికాయ కొట్టకపోతే ఊరుకుంటాడుగాని, ఈ పరంధామయ్య బావగారు కనికరిస్తారా" అని అంటూ ఇక్ష్వాకుల నాటి కోటు జేబులోంచి నోట్లకట్టల మూట తీసి అందిస్తూ, "ఇదిగో ముడుపు లెక్క చూసుకోండి" అన్నారు.

బావగారి ముఖ కవళికలు - నోట్లు చేతపడగానే మారిపోయాయి.



"లెక్కకేవుందండీ వెధవలెక్క" అన్నారు ప్రసన్న వదనంతో. లేచారు, అరుగు దిగారు. "ఏమే ఇంటి ఇల్లాలా. త్వరగా రా. కోడలెంత సేపని కూర్చుంటుంది మేనాలో..." అంటూ లోపలికో గావుకేక ప్రసారం చేశారు. "అలా నిలబడి పోయారేం బావగారూ. రండి రండి. అంతా క్షేమమేనా" అనికూడా అన్నారు.

"ఆ అయోధ్య రాముడి దయవల్ల అంతా క్షేమమే బావగారూ. డబ్బుపాపిష్ఠిది ఇవాళ వస్తుంది రేపు పోతుంది. దానికోసం దంపతుల్ని ఇన్నాళ్ళు ఎడబాటు చేస్తారా" అంటూ రామదాసుగారు వియ్యంకుడికి పెట్టదలచుకున్న 'సారె' పెట్టారు.

(ఇంకావుంది)

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 403 | అన్నా దేముడు లేడన్నా | దాన వీర శూర కర్ణ | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 404 | చిత్రం భళారే విచిత్రం | దాన వీర శూర కర్ణ | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 405 | జాబిల్లి కంటె చల్లనిది | దాన వీర శూర కర్ణ | 1977 | పెండ్యాల | దాశరథి | సుశీల, ఎస్.జానకి |
| 406 | కలగంటినో సామి | దాన వీర శూర కర్ణ | 1977 | పెండ్యాల | దాశరథి | సుశీల, రమేష్ |
| 407 | రారా ఇటు రారా | దాన వీర శూర కర్ణ | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 408 | తెలిసెనులే ప్రియ రసిక | దాన వీర శూర కర్ణ | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | సుశీల, ఎస్.జానకి |
| 409 | జయీభవ విజయీభవ | దాన వీర శూర కర్ణ | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, జి.ఆనంద్ |
| 410 | ఏ తల్లి నిన్ను కన్నదో | దాన వీర శూర కర్ణ | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 411 | ఏల సంతాపమ్ము మరి | దాన వీర శూర కర్ణ | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | రామకృష్ణ |
| 412 | ఇదిరా దొర మదిరా | దాన వీర శూర కర్ణ | 1977 | పెండ్యాల | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి, బృందం |
| 413 | ఘట యోగుల మరిపించె | దశావతారాలు | 1962 | పామర్తి | సీనియర్ సముద్రాల | ఘంటసాల |
| 414 | గోదావరిదేవి మౌనమేలనో తల్లి | దశావతారాలు | 1962 | పామర్తి | సీనియర్ సముద్రాల | కె.అప్పారావు (చక్రవర్తి) |
| 415 | జయహే మాధవా సాధు లోక | దశావతారాలు | 1962 | పామర్తి | సీనియర్ సముద్రాల | ఘంటసాల |
| 416 | జీవకోటి బాధ మాపి | దశావతారాలు | 1962 | పామర్తి | సీనియర్ సముద్రాల | ఘంటసాల, కోరస్ |
| 417 | కన్నీరు మున్నీరుగా | దశావతారాలు | 1962 | పామర్తి | సీనియర్ సముద్రాల | ఘంటసాల |
| 418 | ఒకటే పాత్రను పూలు | దశావతారాలు | 1962 | పామర్తి | సీనియర్ సముద్రాల | ఎస్.జానకి, పి.లీల |
| 419 | రఘుపతి రాఘవ రాజారాం | దశావతారాలు | 1962 | పామర్తి | సీనియర్ సముద్రాల | ఎస్.జానకి |
| 420 | రావే రాధిక కోపాలేలనే | దశావతారాలు | 1962 | పామర్తి | సీనియర్ సముద్రాల | ఎస్.జానకి, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 421 | శృంగార మోహిని తెచ్చినది | దశావతారాలు | 1962 | పామర్తి | సీనియర్ సముద్రాల | పి.లీల |
| 422 | అందానికి అందానివై | దత్తపుత్రుడు | 1972 | టి.చలపతిరావు | దాశరథి | ఎస్.పి.బాలు, సుశీల |
| 423 | చక్కాని చిన్నవాడే | దత్తపుత్రుడు | 1972 | టి.చలపతిరావు | సి.నారాయణరెడ్డి | సుశీల, బృందం |
| 424 | చూడని బాగా చూడని | దత్తపుత్రుడు | 1972 | టి.చలపతిరావు | కొసరాజు | మాధవపెద్ది, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 425 | గంపా నెత్తిన పెట్టి గట్టుమీద | దత్తపుత్రుడు | 1972 | టి.చలపతిరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 426 | గౌరమ్మ తల్లికి బోనాలు | దత్తపుత్రుడు | 1972 | టి.చలపతిరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 427 | మా చేను బంగారం పండిందిలే | దత్తపుత్రుడు | 1972 | టి.చలపతిరావు | కొసరాజు | ఘంటసాల , కోరస్ |
| 428 | మనసైన ఓ చినదాన | దత్తపుత్రుడు | 1972 | టి.చలపతిరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, రమోలా |
| 429 | పిల్లోయ్ జాగ్రత్త వొళ్ళు కాస్త జాగ్రత్త | దత్తపుత్రుడు | 1972 | టి.చలపతిరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 430 | రావమ్మా రతనాల బొమ్మ | దత్తపుత్రుడు | 1972 | టి.చలపతిరావు | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 431 | అమ్మమ్మ చెప్పిన కథ కాదు | దేవి లలితాంబ | 1973 | జి.కె.వెంకటేష్ | కె.జి.ఆర్. శర్మ | ఎస్.జానకి, సరోజిని |
| 432 | అనగనగా ఒక లేడి | దేవి లలితాంబ | 1973 | జి.కె.వెంకటేష్ | సముద్రాల జూనియర్ | సుశీల |
| 433 | చిరునవ్వు విరిసింది చిలిపి | దేవి లలితాంబ | 1973 | జి.కె.వెంకటేష్ | సముద్రాల జూనియర్ | ఎస్.పి.బాలు, సుశీల |
| 434 | నిరుపించుమా భద్రకాళి | దేవి లలితాంబ | 1973 | జి.కె.వెంకటేష్ | ఆరుద్ర | సుశీల |
| 435 | సర్వేశ్వరుడున్నాడురా | దేవి లలితాంబ | 1973 | జి.కె.వెంకటేష్ | సముద్రాల జూనియర్ | సుశీల |
| 436 | శ్రీ నాగరాజా నమో | దేవి లలితాంబ | 1973 | జి.కె.వెంకటేష్ | దాశరథి | ఎస్.జానకి |
| 437 | శ్రీ విద్యం శివం | దేవి లలితాంబ | 1973 | జి.కె.వెంకటేష్ | ఆరుద్ర | సుశీల |
| 438 | వరుణ కరుణ మాయా వరుణ | దేవి లలితాంబ | 1973 | జి.కె.వెంకటేష్ | సముద్రాల జూనియర్ | సుశీల |
| 439 | చిన్నారి బుల్లెమ్మా | ధర్మదాత | 1970 | టి. చలపతిరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల |
| 440 | హల్లో ఇంజనీర్ | ధర్మదాత | 1970 | టి. చలపతిరావు | సి.నారాయణరెడ్డి | సుశీల, తదితరులు |
| 441 | జో లాలి | ధర్మదాత | 1970 | టి. చలపతిరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల |
| 442 | చిన్నారి బుల్లెమ్మా సిగ్గెందుకు లేవమ్మా | ధర్మదాత | 1970 | టి. చలపతిరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల |
| 443 | ఓ ధర్మ దాత | ధర్మదాత | 1970 | టి. చలపతిరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల |
| 444 | ఓ నాన్న నీ మనసే వెన్నా | ధర్మదాత | 1970 | టి. చలపతిరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, జయదేవ్, సుశీల |
| 445 | పరమేశ్వరి జగదీశ్వరి | ధర్మదాత | 1970 | టి. చలపతిరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 446 | ఎవరివో నీవెవరివో | ధర్మదాత | 1970 | టి. చలపతిరావు | కొసరాజు | జయదేవ్, సుశీల |
| 447 | ఎవ్వడి కోసం ఎవడున్నాడు | ధర్మదాత | 1970 | టి. చలపతిరావు | కొసరాజు | ఘంటసాల |
| 448 | కాకమ్మ చిలకమ్మ కథలే మాకొద్దు | ధర్మపత్ని | 1969 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | జయదేవ్, సుశీల, బృందం |
| 449 | నాడు నిన్ను చూసాను | ధర్మపత్ని | 1969 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఎస్.పి.బాలు, సుశీల |
| 450 | సిపాను చీరకటి | ధర్మపత్ని | 1969 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | పిఠాపురం, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 451 | తల్లివి నీవేనమ్మా | ధర్మపత్ని | 1969 | ఎస్.రాజేశ్వరరావు | దాశరథి | సుశీల |
| 452 | ఈ లోకం శాంతిలేని లోకం | ధర్మపత్ని | 1969 | ఎస్.రాజేశ్వరరావు | దాశరథి | ఘంటసాల |
| 453 | తోటలో నారాజు | ఏకవీర | 1969 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 454 | కలువపూల చెంత చేరి | ఏకవీర | 1969 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు |




| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 455 | కనిపెట్టగలవా మగువా | ఏకవీర | 1969 | కె.వి.మహదేవన్ | దేవులపల్లి | సుశీల, తదితరులు |
| 456 | నీ పేరు తలచిన చాలు | ఏకవీర | 1969 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 457 | ఒక దీపం వెలిగింది | ఏకవీర | 1969 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 458 | ప్రతి రాత్రి వసంత రాత్రి | ఏకవీర | 1969 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, ఎస్.పి.బాలు |
| 459 | శ్రీరాజ గోపబాలా | ఏకవీర | 1969 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | మాధవపెద్ది, సుశీల |
| 460 | అనకు ఆ మాట అనకు | గడుసు పిల్లోడు | 1977 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | సుశీల |
| 461 | చీకటి పడుతుంది | గడుసు పిల్లోడు | 1977 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల |
| 462 | ఫూల్ ఎప్రిల్ ఫూల్ చకుముకి | గడుసు పిల్లోడు | 1977 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల, |
| 463 | తదితరులు | | | | | |
| 464 | ముమ్మూర్తులలో ఎవరు ప్రేమను | గడుసు పిల్లోడు | 1977 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల |
| 465 | గాంధీ పుట్టిన దేశం | గాంధీ పుట్టిన దేశం | 1973 | ఎస్.పి.కోదండపాణి | గోపి | సుశీల, కోరస్ |
| 466 | ఓరోరి గుంట నక్క | గాంధీ పుట్టిన దేశం | 1973 | ఎస్.పి.కోదండపాణి | శ్రీశ్రీ | ఎస్.పి.బాలు, కోరస్ |
| 467 | వలపే వెన్నెలగా | గాంధీ పుట్టిన దేశం | 1973 | ఎస్.పి.కోదండపాణి | దాశరథి | ఎస్.పి.బాలు, సుశీల, |
| 468 | ఎవరిని అడగాలి బాపూ | గాంధీ పుట్టిన దేశం | 1973 | ఎస్.పి.కోదండపాణి | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 469 | ఆనాడు అలిగింది సత్యభామా | గంగా యమునా సరస్వతి | 1977 | చక్రవర్తి | వేటూరి | ఎస్.పి.బాలు, సుశీల |
| 470 | చిత్రమౌ (పద్యం) | గంగా యమునా సరస్వతి | 1977 | చక్రవర్తి | దత్తలూరి రామారావు | పట్టాభి, రమణ |
| 471 | కుల మత భేదములు | గంగా యమునా సరస్వతి | 1977 | చక్రవర్తి | దత్తలూరి రామారావు | పట్టాభి, రమణ |
| 472 | నిదురపో నీవైనా | గంగా యమునా సరస్వతి | 1977 | చక్రవర్తి | గోపి | రామకృష్ణ |
| 473 | నిన్న మొన్నలు | గంగా యమునా సరస్వతి | 1977 | చక్రవర్తి | వి.ఎస్.ఆర్.స్వామి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 474 | తరలి వచ్చెను చూడరే | గంగా యమునా సరస్వతి | 1977 | చక్రవర్తి | వేటూరి | రాజా. బి.వసంత, సావిత్రి, |
| 475 | వంగతోట కాడ | గంగా యమునా సరస్వతి | 1977 | చక్రవర్తి | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 476 | అరెరే తెచ్చితిని ప్రేమ కానుక మారదులే ఎన్నటికి మారదు | జల్సారాయుడు | 1960 | మాష్టర్ వేణు | ఆరుద్ర | పిఠాపురం, జిక్కి |
| 477 | ఈ లోకము | జల్సారాయుడు | 1960 | మాష్టర్ వేణు | ఆరుద్ర | జిక్కి |
| 478 | నకిలీ సరుకును మెచ్చే లోకం | జల్సారాయుడు | 1960 | మాష్టర్ వేణు | ఆరుద్ర | స్వర్ణలత |
| 479 | రాకు రాకు నా దగ్గరకి | జల్సారాయుడు | 1960 | మాష్టర్ వేణు | ఆరుద్ర | పిఠాపురం, స్వర్ణలత |
| 480 | వంకర టింకర నడక నడిస్తే | జల్సారాయుడు | 1960 | మాష్టర్ వేణు | ఆరుద్ర | పిఠాపురం |
| 481 | అందాలా సీమలో | జల్సారాయుడు | 1960 | మాష్టర్ వేణు | ఆరుద్ర | పి.బి.శ్రీనివాస్, జిక్కి |
| 482 | మా బావ వచ్చేడు | జల్సారాయుడు | 1960 | మాష్టర్ వేణు | ఆరుద్ర | జిక్కి |
| 483 | అయ్యయ్యో తాళలేని బాధరా | జాతకరత్న మిడతం బొట్లు | 1971 | ఎస్.పి.కోదండపాణి | అప్పలాచార్య | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 484 | బంగారుతల్లి నా చెల్లెలు | జాతకరత్న మిడతం బొట్లు | 1971 | ఎస్.పి.కోదండపాణి | అప్పలాచార్య | ఎస్.పి.బాలు |
| 485 | చెలియా సఖియా ఏమే | జాతకరత్న మిడతం బొట్లు | 1971 | ఎస్.పి.కోదండపాణి | అప్పలాచార్య | సుశీల, బృందం |
| 486 | చిలకా ఓ పంచరంగుల చిలకా | జాతకరత్న మిడతం బొట్లు | 1971 | ఎస్.పి.కోదండపాణి | అప్పలాచార్య | మాధవపెద్ది, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 487 | దయ చూడవే గాడిద | జాతకరత్న మిడతం బొట్లు | 1971 | ఎస్.పి.కోదండపాణి | అప్పలాచార్య | ఎస్.పి.బాలు |
| 488 | నీ చేయి నా చేయి పెనవేసి | జాతకరత్న మిడతం బొట్లు | 1971 | ఎస్.పి.కోదండపాణి | గోపి | ఎస్.పి.బాలు, సుశీల |
| 489 | వీరన్న సంపద విషయమ్ము | జాతకరత్న మిడతం బొట్లు | 1971 | ఎస్.పి.కోదండపాణి | గోపి | ఎస్.పి.బాలు |
| 490 | విరిగిపోయిన నా జీవన మురళి | జాతకరత్న మిడతం బొట్లు | 1971 | ఎస్.పి.కోదండపాణి | అప్పలాచార్య | ఎస్.పి.బాలు, కోరస్ |
| 491 | చిన్నారి రాణి | జాతకరత్న మిడతం బొట్లు | 1971 | ఎస్.పి.కోదండపాణి | గోపి | ఎస్.పి.బాలు |
| 492 | జయ జయ శ్రీరామ | జయసింహ | 1955 | టి.వి.రాజు | సముద్రాల జూనియర్ | ఘంటసాల |
| 493 | జీవితమింతేలే | జయసింహ | 1955 | టి.వి.రాజు | సముద్రాల జూనియర్ | ఎం.ఎస్.రామారావు |
| 494 | మదిలోని మధుర భావం | జయసింహ | 1955 | టి.వి.రాజు | సముద్రాల జూనియర్ | ఘంటసాల, రావుబాల సరస్వతి |
| 495 | మనసైన చెలిపిలుపు | జయసింహ | 1955 | టి.వి.రాజు | సముద్రాల జూనియర్ | ఎ.పి.కోమల, రావుబాలసరస్వతి |
| 496 | మింటిపైన వెలుగారిపోయే | జయసింహ | 1955 | టి.వి.రాజు | సముద్రాల జూనియర్ | ఘంటసాల |
| 497 | మురిపెము మీర | జయసింహ | 1955 | టి.వి.రాజు | సముద్రాల జూనియర్ | ఎ.పి.కోమల |
| 598 | నడిరేయి గడిచెనే | జయసింహ | 1955 | టి.వి.రాజు | సముద్రాల జూనియర్ | సుశీల |
| 599 | నెల నడిమి వెన్నెల హాయి | జయసింహ | 1955 | టి.వి.రాజు | సముద్రాల జూనియర్ | జిక్కి |
| 500 | వీరులగన్న తల్లి | జయసింహ | 1955 | టి.వి.రాజు | సముద్రాల జూనియర్ | ఘంటసాల. ఎ.పి.కోమల |
| 501 | వినండి బాబూ ఇదేనండి | జయసింహ | 1955 | టి.వి.రాజు | సముద్రాల జూనియర్ | పిఠాపురం |
| 502 | ఈనాటి ఈ హాయి కల కాదోయి | జయసింహ | 1955 | టి.వి.రాజు | సముద్రాల జూనియర్ | ఘంటసాల, లీల |

సేకరణ: పున్నమరాజు శేషగిరిరావు, విశాఖపట్నం.

వచ్చే సంచికలో మరికొన్ని



## మే 10న చంద్రబోస్ పుట్టినరోజు సందర్భంగా సంగీత దర్శకుడు కీరవాణి 'హాసం' తరపున చేసిన సరదా ఇంటర్వ్యూ యిది....

చంద్రబోస్‌గారూ,

**కౌన్ బనేగా స్టైల్లో అడుగుతున్నా- రాత్రంతా నిద్దరమాని కష్టపడి రాసిన అవార్డు మీరు వస్తుందనుకొని ఆశించిన పాట- క్యాసెట్‌లో రిలీజ్ అయ్యాక రణగొణ ధ్వనుల్లో అర్థంకాకుండా మునిగిపోతే మీరేం చేస్తారు?**
**ఎ) ఆ మ్యూజిక్ డైరెక్టర్‌కి ఇక ఎప్పుడూ వ్రాయరు.**
**బి) ఆ పాట రికార్డు చేసిన ఇంజనీరు కూతురుపెళ్లికి పిలిచినా వెళ్లరు.**
**సి) క్యాసెట్ కంపెనీ ఓనర్‌ని చంపి జైలుకెళ్తారు**
**డి) ఇదే గతి మీకు మీకు పోటీగా పాటలు రాసే రైటరుకీ పట్టాలని పెద్దమ్మ గుడిలో మొక్కుకుంటారు.**

పైవేవీ కావండి. అన్నిటిని మిక్స్‌చేస్తా. ఎలాగైంటే ఆ మ్యూజిక్ డైరెక్టరిని, ఆ సౌండ్ ఇంజనీర్‌ని, ఆ క్యాసెట్ కంపెనీ ఓనర్‌ని అందరిని తీసుకెళ్లి అలాంటి పొరపాటు మళ్లీ ఎప్పుడూ చేయ్యం అని పెద్దమ్మ గుడిలో ప్రమాణం చేయిస్తాను.

**మీ సెల్ నంబరు ఎంత?**

నేనెప్పుడూ జైల్‌కెళ్లలేదు.

**వేటూరి గారు సృష్టించిన చమత్కారాల్లో మీకు బాగా నచ్చిన ప్రయోగం?**

"మారేడు నీవని ఏరేరితేనా
మారేడు దళములు నీ పూజకు"
శబ్దంలో - ప్రయోగం
అర్థంలో - రాజయోగం వుంది ఇందులో.

**"హిందీ లిరిసిస్టులకి గాలిపోగేసి పాటలు రాయడం అలవాటు. భావ సంపద లేదు వాళ్ల వద్ద" అని సీతారామశాస్త్రిగారు అంటూవుంటారు కోపంగా. మీరు ఆయనతో ఏకీభవిస్తారా?**

ఆ గాలి కూడా అప్పుడప్పుడూ పూల పరిమళాన్ని మోసుకొస్తూం టుందంటాను.

**"కాదేదీ కవితకనర్హం" అని సెలవిచ్చిన శ్రీ.శ్రీ గార్ని గాయకుల్ని గురించి చెప్పమని అడిగితే ఏంచెప్పివుండేవారో మీరు ఆయన్ని పూనించుకుని చెప్పండి.**

"కారెవ్వరూ కూతకనర్హం"

**తెలుగు సినిమాలో ఆఖరు టైటిల్సు నాలుగైదు ఇంగ్లీషులో కూడా వస్తాయి ఎందుకు?**

ముఝే నహీ మాలూమ్

**కొత్తగా హైదరాబాద్‌లో 'కలం' మోపిన రచయిత ముందుగా ఎవర్ని ఎప్రోచ్ అవ్వాలి?**

స్రవంతిని. అదేనండి ఆలోచనా స్రవంతిని అప్రోచ్ అవ్వాలి.

**ఎంతోమంది మీడియోకర్ మ్యూజిక్ డైరెక్టర్లకన్నా చక్కగా పల్లవి, చరణం ట్యూన్ అనగలిగిన మీరు సంగీతం తెలిసీ సంగీత దర్శకత్వం చెయ్యకపోతే మీ తల వెయ్యి చెక్కలు కాదా? మీకా భయంలేదా?**

కొత్తగా సంగీత దర్శకత్వం మొదలెడితే, ప్రస్తుతం నేను పాటలు రాయాల్సిన ఎస్.వి.కృష్ణారెడ్డి గారు, వై.వి.ఎస్.చౌదరి గారు, వి.వి.వినాయక్ గారు, ఎస్.జె.సూర్య గారు, సముద్ర గారు, యం.యస్.నారాయణ గారు నా తల వెయ్యిన్నొక్క ముక్కలు చేస్తారు.(జోక్)
సంగీతం పట్ల అవగాహనవున్నా
సంగీతం దర్శకత్వం చేసే ఆ శక్తి ఆసక్తి లేదు (సీరియస్)

**హిందీవాళ్లతో తెలుగు పాటలు పాడించడం బాగోలేదు. అని వాపోయేవారిని National integrity కి వ్యతిరేకులు అనుకోవచ్చునా?**

Regional integrity కి అనుకూలురు అనుకోవచ్చు.

**అసలు సినీ పండితులంటే ఎవరు? ఎక్కడవుంటారు?**

తక్కువ సినిమాలు చూస్తు వాటి గురించే తీవ్రంగా(ఎక్కువగా) ఆలోచిస్తూ తల పండించుకునే వాళ్లని సినీ పండితులంటారు. వీళ్లు సినిమా అవకాశాల కోసం అక్కడక్కడా తిరుగుతుంటారు.

**51% ఓట్లతో నెగ్గి అధికారంలోనికి వచ్చిన నాయకులు మిగిలిన 49% ప్రజలు తమకు అనుకూలురు కారని ఎంతమాత్రం భయపడకుండా ధీమాగా వుండగలిగినప్పుడు- సినిమాహాల్లో ఒక మెలోడీసాంగ్‌ని 98% మంది హాయిగా ఎంజాయ్ చేస్తుండగా 2% జనం టాయిలెట్స్ కోసం లేస్తారేమోనని ప్రొడ్యూసర్స్‌కి అంత భయం ఎందుకు?**

98% మందిని ఉచ్ఛస్థితికి
2% మందిని 'ఉచ్చ'స్థితికి కాకుండా
100% మందికి ఉత్సాహాన్ని కలిగించాలనే కోరికతో కూడిన భయం అది.

**ఒక ఛానల్లో వరల్డ్‌కప్పు, ఇంకో ఛానల్లో వరల్డ్‌వార్ (III) వస్తుంటే మీరేది చూస్తారు?**

కప్పును చూడను. వార్‌ను చూడను.
'వార్'నాయనో అంటూ ఇంటి 'కప్పు'కేసి చూస్తుంటా.

**ఒక పల్లవి, ఒక చరణం రాసి అలసిపోయిన తరువాత రెండో చరణం సుచిత్ర గార్ని రాసెయ్యమని మీరు హాయిగా ముసుగుతన్నిన సందర్భమేదైనా వుందా?**

తను రాస్తుందేమోనని ముసుగుతన్నితే- రాయకపోయినా, రాయలేకపోయినా బకెట్‌తన్నాల్సి వస్తుందేమోనని ఆ సందర్భం కల్పించుకోలేదు.

**ఔత్సాహిక గేయరచయితలకి వుండాల్సినది, వుండకూడాల్సినది ఏమిటో సెలవిస్తారా?**

వుండాల్సింది- భావావేశం
వుండకూడాల్సింది- అహం భావావేశం



## టామ్‌సాయర్‌ను మనవాడే ననిపించిన

# నండూరి

**నండూరి రామమోహనరావు గారి సంపాదకత్వం, సైన్సురచనలు, వేదాంతరచనలు ఇవన్నీ ప్రఖ్యాతి చెందినవే. వీటితోబాటు అనువాదకుడిగా కూడా ఆయనకు చాలా పేరుంది. అందునా ఆయన అనువాదానికి ఎంచుకున్నది - వంద సంవత్సరాల క్రితం వెలువడి ప్రపంచ బాషలన్నింటిలోనూ అనువదింపబడి అనేక ముద్రణలు పొందిన టామ్‌సాయర్, హకల్‌బెరీఫిన్, ప్రిన్స్ అండ్ పాపర్ వంటి విశ్వవిఖ్యాత నవలలు. అర్ధశతాబ్ది క్రితం వెలుగుచూసిన ఈ అనువాదాలు పునర్ముద్రణల ద్వారా ఇప్పటికీ పుస్తకరూపంలో లభ్యమయ్యి ఈ తరం పాఠకులను కూడా అలరిస్తున్నాయి. ("టామ్‌సాయర్ ప్రపంచయాత్ర" ఒక్కటే లభ్యం కావటం లేదు). నండూరి వారి అనువాద ప్రజ్ఞపై ఒక సోదాహరణ పరిశీలన-**

**మ**నకు సాధారణంగా చదివే పుస్తకాలలో ఎన్ని పుస్తకాలు మన మనస్సుల్లో ముద్రవేసుకుంటాయి? ఎన్ని జ్ఞాపకం వచ్చినప్పుడల్లా మన పెదవుల మీదకు చిరునవ్వును తెస్తాయి? చాలా తక్కువ! కారణం - వాటిల్లో చాలాభాగం పెద్దవాళ్ళ రాగద్వేషాలకు సంబంధించిన కథావస్తువులే కావడం! బాల్యపు ముచ్చటలతో మనకు హాయిని చేకూర్చే నవలలు రాసిన మార్క్‌ట్వేన్‌ను స్మరించిన వెంటనే వాటిని మనకు అందించిన నండూరి వారి గురించి ప్రస్తావించడం న్యాయం.

మార్క్‌ట్వేన్ (1835-1910) ఏ పాఠశాలలోనూ చదువుకోలేదు. రకరకాల వృత్తులను చేపట్టి జీవితసారాన్ని వడగట్టాడు. మనుషుల్లోని మంచితనాన్ని ప్రేమించి, చిన్నపిల్లల సహజలక్షణాలైన అమాయకత్వం, దుడుకుతనాల ద్వారా పాఠకులలో మానవీయతను పెంపొందించిన మహనీయుడాయన. బానిసతనం నిర్మూలనకు ప్రజలు వత్తాసు పలకడానికి ఆయన "హకల్‌బెరీఫిన్" నవల ఎంతో ఉపయోగపడింది. అయితే ఈ మహత్కార్యానికి మార్క్‌ట్వేన్ ఉపయోగించిన ఆయుధం హాస్యం, వ్యంగ్యం.

మనుష్యులు తమ బాల్యస్మృతులను ప్రేమిస్తున్నంతకాలం ఆయన సృష్టించిన టామ్‌సాయర్, హకల్‌బెరీఫిన్‌లు చిరంజీవులే! సాహసం కోసమే సాహసాలు చేస్తూ చిక్కుల్లో పడే టామ్‌సాయర్, సంఘం చేత చిన్నచూపు చూడబడే హకల్ బెరీఫిన్ - ఆ ఇంగ్లీషు పేర్లు లేకపోతే తెలుగువాళ్లే అనిపించేవిధంగా అనువదించారు నండూరి.

మార్క్‌ట్వేన్ ఆవేదనలను, ఆలోచనలను సరైన రీతిలో అర్థం చేసుకుని మూలానికి న్యాయం చేస్తూ నండూరి చేసిన అనువాదాలు - అనుసృజనలు అనాలేమో - 1950 -53ల మధ్య ఆంధ్రవారపత్రికలో వెలువడిన రోజుల్లో పిన్నలను, పెద్దలను విశేషంగా ఆకర్షించాయి. అవి చదువుతున్నంతసేపు మిసిసిపీ గలగలలలో గోదావరి గలగలలు వినిపిస్తాయి. టామ్‌సాయర్ కథ 'నా కథే' అనిపిస్తుంది ప్రతీ పాఠకుడికీ..

తెలుగు, ఇంగ్లీషు రెండు భాషల్లో చదివిన వారికి కూడా,తెలుగు అనువాదాలు మళ్లీ, మళ్లీ చదువుతూనే ఉండాలనిపిస్తుంది. చదివిన ప్రతీసారీ అదే ఆనందం. అందులోని సన్నివేశాలు పక్కవాళ్లకి చదివి వినిపించి, వాళ్ల పెదవులపై మెరిసే చిరునవ్వు చూడాలనే తహతహ. ఆ రచనల ద్వారా బాల్యాన్ని నెమరు వేసుకోడానికి అభ్యంతరం ఉండేవాళ్లు ఉండరేమో! చదవని వాళ్లుంటే వాళ్లకోసం కాస్త వివరణ:

'టామ్‌సాయర్' నవల ఓ పదేళ్ల అల్లరి కుర్రాడి గాథ. తల్లీ తండ్రీ లేరు. పెద్దమ్మ (ఆవిడ పేరు పోలీ పెద్దమ్మ) దగ్గర పెరుగుతూంటాడు. సిడ్ అనే కజిన్ కూడా ఆ ఇంట్లోనే ఉంటాడు. వాడు పెద్దవాళ్ల దృష్టిలో బుద్ధిమంతుడు కానీ కుళ్లుబుద్ధి. మనకు టామ్ హీరో కాబట్టి వాడు విలన్‌లా అనిపిస్తాడు. హకల్ బెరీఫిన్ అనే దేశద్రిమ్మరి కుర్రాడితో మాట్లాకూడదని ఇంట్లో వాళ్ల ఆంక్షలు. ఎందుకంటే వాడికి చదువూ, సంధ్యా లేదు, తండ్రి తాగుబోతు.ఇంట్లోవాళ్ళు వద్దన్నారు కాబట్టి వాడితో మాట్లాడాలనే ఆరాటం టామ్‌కి. అప్పుడే ఎదుగుతున్న వయసు, ఇంకా సరిగా ఎదగని బుద్ధి, ఏదో చెయ్యాలనే తపన.

పదేళ్లకుర్రాడు కాబట్టి ఓ గర్ల్‌ఫ్రెండు. ఆమె దృష్టిని ఆకర్షించడానికి వెర్రివేషాలు వేస్తాడు. ఇంట్లోంచి పారిపోయి సముద్రపు దొంగ అయిపోవడం జీవిత లక్ష్యం కాబట్టి ఓ సారి పారిపోతాడు కానీ రెండురోజులకే స్వేచ్ఛ బోరుకొట్టి, ఇంటిమీద బెంగపుట్టేస్తుంది. టామ్ అల్లరిలో దుష్టత్వం లేదు. సరదాకి ఏదో చేసి పెద్దవాళ్ల చేత తిట్లూ, చివాట్లు తినడం, బుద్ధిగా ఉండాలని అనుకోవడం, మళ్లీ బుద్ధి వక్రించడం, మధ్యమధ్యలో గడుసుతనం.

సన్నివేశాలను పూర్తిగా చెప్పడానికి స్థలం చాలదు కాబట్టి సందర్భం చెప్పి నండూరి వారి వర్ణనను బోల్డ్‌లో ఇవ్వడం జరుగుతోంది. దాన్ని బట్టి ఆయన కథనాన్ని ఎంత తెలుగైజ్ చేశారో తెలుస్తుంది.

'సోమవారం వచ్చింది. సోమవారం వచ్చిందంటేనే టామ్‌కి బాధ. బడికి వెళ్లాలి. **ఆలోచిస్తూ పడుక్కున్నాడు. ఈ పళ్లాన్ని తనకి ఏదో జబ్బు రాకూడదూ?'** అని. అనుకున్నాక ఒళ్లంతా పరీక్షించి చూసుకున్నాడు. ఎక్కడా ఏ కాస్త నొప్పిలేదని తేలింది. ఇంతో పై పళ్లలో ఏదో ఒకటి కొంచెం కదుల్తోందని మూలగబోయి, పెద్దమ్మ వచ్చి పీకుతానంటుందేమోనని భయంవేసి ఆగాడు.

**ఇంతలో ఎప్పుడో ఒక డాక్టరు చెప్పిన విషయం జ్ఞాపకం వచ్చింది. అదొస్తే రెండు మూడువారాలు మంచమెక్కుతారట. మరైతే దీని లక్షణాలేమిటో టామ్ తెలియదు. అయితే అయింది. ప్రయత్నం చేయాలనుకున్నాడు.** అక్కడనుంచి గట్టిగా మూలగడం మొదలెట్టాడు. పక్కనే పడుక్కున్న కజిన్ సిడ్ లేవలేదు. గట్టిగా మూలిగాడు. సిడ్‌కి మెలకువ రాలేదు. గుర్రు పెడుతున్నాడు కూడా. **ఇంక లాభం లేదని టామ్ నోరెత్తి అబ్బో అమ్మో అని గట్టిగా అరిచి చూశాడు. ఉహుఁ సిడ్ కదల్లేదు. టామ్‌కి ఒళ్లు మండుకొచ్చింది. సిడ్‌ని ఒక్కగుంజు గుంజాడు. వాడు లేచాడు.** కళ్లు నులుముకుని చూసేటంతలో గట్టిగా మూలగడం, గట్టిగా రొప్పడం మొదలుపెట్టాడు టామ్.

"అరె ఏమిట్రా, ఏమయింది?"

**టామ్ జవాబివ్వలేదు. మరీ గట్టిగా మూలిగి చేతులు కాళ్లూ గిజగిజ కొట్టుకుంటున్నాడు. సిడ్‌కి భయం వేసింది. "అరె టామ్, ఇదిగో చూడు, ఏమయింది, నాకు చెప్పు"**

"ఉండరా బాబూ. నన్ను ముట్టుకోకు. చచ్చిపోతున్నాను". **"ఛ, అదేమిటి, అసలు బాధేమిటో చెప్పరా.... కాస్సేపు మూలగడం ఆపేయ్. ఏమిటో నాకు చెప్పు."**

"వొద్దులేరా వుండు. అదే తగ్గిపోతుంది. ఎవర్నీ పిలువకు." "అదేమిటి, అనలెంతసేపట్నుంచి?", **"అబ్బో చాలా సేపట్నుంచి", "మరి నన్నెందుకు లేపలేదు?"**

**"పోనీ లేరా. ఇంతవరకూ నువ్వు చేసిన వాటినన్నిటికీ నిన్ను క్షమించాను సిడ్. నేను పోయినప్పుడు... ఏం వద్దురా సిడ్. అందర్నీ క్షమించాను. అలాగని అందరితోను చెప్పు... నా ఒంటి కన్ను పిల్లిని ఆ కొత్త అమ్మాయి కిచ్చెయ్యి. ఆ అమ్మాయితో చెప్పు.."**

ఇది చదివితే మనకు ఎవరో గుర్తుకురారూ? అదే... మనమే, మనం స్కూలు ఎగ్గొట్టడానికి ఇలాటి వేషాలేగా వేశాం? ఇలా టామ్ అప్పగింతలు పెట్టేశాక పెద్దమ్మ వస్తుంది. ఏమిటని అడిగితే చితికిన కాలి బొటనవేలు చూపిస్తాడు. ఓసి ఇంతేనా అంటే నోరుజారి "ఈ నొప్పితో పన్ను నొప్పి కూడా మర్చిపోయాను" అంటాడు టామ్. దెబ్బకి పెద్దమ్మ పట్టుతాడుతో పన్ను మంచంకోడుకు బిగించి, కొరకంచు పట్టుకొచ్చి టామ్ ముక్కుమీద పెట్టబోతుంది. వాడు గుంజుకోవడంలో పన్ను ఊడివస్తుంది. అంటే అన్ని దేశాలలో పెద్దవాళ్లూ ఇంతేనన్నమాట అనిపిస్తుంది.

ముక్తాయింపు ఏమిటంటే పన్ను పోయినందుకు టామ్ పెద్ద బాధ పడలేదట. టామ్‌కి ఇదీ ఒక మంచికే వచ్చింది. **నోటినిండా నీళ్లు పోసుకుని తొస్సిలోనుంచి జంయ్‌మని ధార వదలచ్చు. దర్జాగా ఆమడ దూరానికి కూడా గురిచూసి ఉమ్మి వేయవచ్చు. స్కూల్లో ఈ గొప్ప చూపించదలచుకున్నాడు.** టామ్‌లో తెలుగు కుర్రాడు లేడంటే ఎలా నమ్మగలం?

అసలు టామ్ పెయింటింగ్ ప్రహసనం ప్రపంచబాలసాహిత్యంలోనే ఒక ప్రకరణం అయిపోయింది. - ఓ శనివారం నాడు ఇంటి బయట చెక్కగోడకు పెయింట్ వేసేపని వాళ్ల పెద్దమ్మ అప్పచెప్పింది. 30 గజాల పొడుగూ, **తొమ్మిది అడుగుల ఎత్తూ గల ఆ గోడ చూడగానే టామ్ గుండె జారిపోయింది. జీవితం నిరర్థక**మనిపించింది. కాస్త పనిచేసి రంగు పూసిన మేర **చూస్తే సముద్రంలో కాకిరెట్టలాగ వుంది.**

ఈలోగా వాడి ఫ్రెండు వస్తాడు. టామ్‌ని చూసి **"హి, హీ, అణిగిందీ అబ్బాయిగారి తిక్కా" అంటాడు.** కానీ టామ్ గొప్ప ఎత్తు ఎత్తుతాడు. రంగువేయడం పని కాదని, ఆ అవకాశం రమ్మన్నప్పుడల్లా రాదనీ పోజు కొడతాడు. దాంతో ఆ ఫ్రెండుకి నోరూరుతుంది. తనను పెయింట్ చేయనిమ్మనిమని బతిమాలుతాడు. టామ్ గునున్నూనే, లంచం పుచ్చుకుని మరీ చేయిస్తాడు. వాడిని చూసి ఇంకో ఫ్రెండు, ఆ తరువాత మరోడు - ఇలా పనిని పనిగా చూపకుండా ఒక అవకాశంగా చూపించి ఊరిస్తే మోజు పెరుగుతుందన్న మేనేజిమెంట్ టెక్నిక్ ఉపయోగించి టామ్ బోల్డంత పనిచేయించుకోవడమే కాక పెద్దమ్మ దగ్గర ఇంప్రెషన్ కొట్టేస్తాడు. ఇక్కడ నండూరి వారు రాసినది-

**'వాడుచేసిన పనికి ఆవిడ, పాపం ఎంతో సంతోషించి వాడికి మంచి ఆపిల్‌పండు ఏరి ఇస్తూ, బుద్ధిమంతులుగా వుండి చెప్పినమాట వినే పిల్లలు ఎట్లా బాగుపడతారో చిన్న ఉపన్యాసం ఇచ్చింది. ఈ నందడిలో టామ్ ఆవిడకు తెలియకుండా ఒక అప్పచ్చి చేతివాటు వేశాడు.'**

టామ్‌కు ఇంత అల్లరిబుద్ధి ఉన్నా ఊళ్లో కొత్తగా పెట్టిన 'బుద్ధిమంతుల సంఘం'లో చేరతాడు. చుట్టలు తాగనని, బూతులు మాట్లాడనని ప్రమాణం చేస్తాడు. చేసిన దగ్గర్నుంచీ వాటిమీదే ధ్యాస. అయినా ఒక ఆకర్షణ అతన్ని ఆపి వుంచింది. ఎవరైనా పెద్దవాళ్లు పోయినప్పుడు ఆ సంఘం వాళ్లు మంచి యూనిఫాం వేసుకుని ఊరేగవచ్చు. చావుబతుకుల్లో ఉన్న జడ్జిగారి మీద టామ్ ఆశపెట్టుకున్నాడు. రోజుకి నాలుగు సార్లయినా అడిగిచూసేవాడు. పోతున్నాడని అనిపించగానే ఆ యూనిఫాం వేసుకుని అద్దంలో చూసుకుని మురిసేవాడు. తగ్గిందనగానే నిరాశపడేవాడు. ఇలా చాలాసార్లు జరిగాక ఆయనకు బాగా నెమ్మళించిందని రూఢి అయ్యాక సంఘానికి టామ్ రాజీనామా ఇచ్చేశాడు. ఆ రాత్రే జడ్జి చచ్చిపోయాడు. **టామ్‌కు వెర్రికోపం వచ్చింది ఆయనమీద. ఇంకెప్పుడూ జడ్జీలను నమ్మగూడదనుకున్నాడు.**

టామ్ జీవితలక్ష్యం రాబిన్‌హుడ్‌లా బతకాలని. స్నేహితుల నూరించి గుప్తధనం కోసం తెగ వెతుకుతూంటాడు. నాయకత్వ లక్షణాలున్నాయి కాబట్టి ఇతరులను సులభంగా డబాయించగలడు. చచ్చిపోయిన చెట్ల కింద డబ్బు జాగ్రత్త పెడతారనీ, కాలవపక్కన చచ్చిపోయిన చెట్లు చచ్చేన్ని ఉన్నాయని **అంటాడు. ఎవర్నయినా అడుగు కావలిస్తే. రాజుల దగ్గిర తట్టలు తట్టలుంటాయి రత్నాలు. అని టామ్ అంటే హక్ నేనెప్పుడూ రాజుల్ని చూడలేదు. అంటాడు. 'యూరప్ వెళ్లి చూడు. ఈగల్లా ముసురుతారు' అని టామ్ అంటే హక్‌కి అనుమానం - 'రాజులు ఈగల్లా వుంటారా?'**

ఈ పిల్లలిద్దరికీ అందరు పిల్లలలాగానే ఎన్నో మూఢ నమ్మకాలు. హక్ కొచ్చిన వులిపిరి కాయలు పోవ డానికి చచ్చిన పిల్లిని చంకన శ్మశానానికి వెళతారు. (దుర్మార్గుడైన వాడు చచ్చిపోయిన రాత్రి దెయ్యాలు వాడిని తీసుకెళు తూంటే 'శవం వెంట పిల్లి, పిల్లి వెంట వులిపిరి కాయలు పోవాలి, పోవాలి' అనాలట) ఈ గందరగోళంలో ఓ హత్య చూసి, కోర్టులో సాక్ష్యం చెప్పి ఆవదలు కొని తెచ్చుకుంటారు. తర్వాత టామ్, అతని గర్ల్ ఫ్రెండ్ కలిసి ఒక గుహలో ఇరుక్కుపోతారు. అతి కష్టం మీద బయట పడతారు. ఆ సందట్లో ఓ దొంగల ముఠా దాచిన నిధి టామ్ కంట బడుతుంది. టామ్, హక్ కలిసి తర్వాత ఆ నిధి బయటకు తెచ్చి చూపుతారు. వాళ్లే హక్కుదారులవుతారు.



డగ్లస్ అమ్మగారు అనే ఆవిడ హక్ తనకు చేసిన ఉపకారానికి ప్రతిఫలంగా వాడిని దత్తుకు తీసుకుని 'సంస్కరించ'బూనుతుంది. ఇన్నాళ్లూ స్వేచ్ఛగా తిరిగిన హక్‌కు అది మింగుడుపడదు. అక్కణ్నుంచే హకల్‌బెరీఫిన్ నవల ప్రారంభమవుతుంది. దీంట్లో హక్, అతని సహచరుడు జిమ్ ప్రధాన పాత్రధారులు. చివరిలో టామ్ వచ్చి కాస్త సాహసం ప్రదర్శిస్తాడు. టామ్, హక్‌ల కుటుంబనేపథ్యంలో, స్వభావాలలో తేడా వుంటుంది. టామ్ మధ్యతరగతివాడయితే హక్ అధోవర్గాలవాడనాలి. మానవత్వం ఉన్నవాడు కాబట్టి ఒక నీగ్రో పారిపోవడానికి సహాయపడతాడు. కథనం 'టామ్‌సాయర్' లోకంటె చమత్కారంగా ఉంటుంది.

హక్, జిమ్ పారిపోతున్నప్పుడు వాళ్ల పడవ మీదకు ఇంకో ఇద్దరు వచ్చి చేరతారు. ఇద్దరూ మోసగాళ్లే. ఒకడు మద్యం మానమని ఉపదేశాలు, ఉపన్యాసాలు ఇచ్చి డబ్బు గడించగలడు (కానీ సంపాదించింది తాగుడుకే సరిపోదు). ఇంకోడు వైద్యం చేయగలడు, ఎవరన్నా రహస్యంగా వివరాలన్నీ చెబితే **జ్యోతిష్యం కూడా చెప్పగలడు.** కొన్ని రోజులు గడిచాక ఒకడు తను జమీందారీ బిడ్డనని కోస్తాడు. హక్. జిమ్ వాడికి గౌరవం ఇవ్వడం చూసి ఇంకోడు కుళ్లుకుని తను ఏకంగా తప్పించుకుని పారిపోయిన ఫ్రెంచి చక్రవర్తినని చెప్పుకుంటాడు. వాళ్లిద్దరూ చేసే అడావుడి చదివితే పొట్టచెక్కలవుతుంది.

టామ్, హక్, జిమ్ పాత్రలతో మార్క్‌ట్వేన్ వ్రాసిన మరో నవల - టామ్‌సాయర్ ప్రపంచయాత్ర.' దీనిలో మనహీరోలు బెలూన్‌లో ప్రపంచాన్ని చుడతారు. చమత్కారం కంటె సాహసం పాలు ఎక్కువగా ఉండి ఈనాటి బాలలను కూడా ఉత్తేజపరుస్తుంది. నండూరి వారు దీనిని కూడా అనువదించారు. ఆంధ్ర ప్రచురణలు వారు పుస్తకరూపంలో వెలువరించారు కూడా. కానీ అది ఇప్పుడు ఎక్కడా దొరకటం లేదు. టామ్‌సాయర్, హకల్‌బెరీఫిన్ పుస్తకాలను ఎన్నోసార్లు పునర్ముద్రించిన నవోదయా వారి వద్దకూడా ఆ పుస్తకం ఉన్నట్టు లేదు. నండూరి వారి వద్ద కూడా ఆ ప్రతి లేదని వినికిడి. వారి రచనలన్నీ అయిదేళ్ల క్రితం పుస్తకరూపంలో మళ్లీ వెలువడినప్పుడు కూడా 'టామ్‌సాయర్ ప్రపంచ యాత్ర' ప్రచురించబడలేదు. ఆ మేరకు తెలుగుపాఠకులు దురదృష్టవంతులే!

**- స్వాతీ ప్రసాద్**

మే 10 కైఫీ అజ్మీ వర్ధంతి సందర్భంగా...

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



## తుమ్ ఇత్‌నా జో ముస్కురా రహే హో

తుమ్ ఇత్‌నా జో ముస్కురా రహే హో
క్యా గమ్ హై జిస్‌కో ఛుపా రహే హో ॥తుమ్ ఇత్‌నా॥
ఆంఖోం మేం నమీ, హంసీ లబోం పర్ (2)
క్యా హాల్ హై క్యా దిఖా రహే హో ॥క్యా గమ్ హై॥
బన్ జాయేంగే జహర్ పీతే పీతే (2)
యే అష్క్ జో పీతే జా రహే హో (2)
జిన్ జఖ్మోం కో వక్త్ భర్ చలాహై (2)
తుమ్ క్యోం ఉన్హే ఛేడే జారహే హో (2) ॥క్యా గమ్ హై॥
రేఖావోంకా ఖేల్ హై ముకద్దర్ (2)
రేఖావోంసే మాత్ ఖారహే హో (2) ॥క్యా గమ్ హై॥



చిత్రం : అర్థ్ (1982)
రచన : కైఫీ ఆజ్మీ
సంగీతం : చిత్రాసింగ్, జగజీత్‌సింగ్
గానం : జగజీత్‌సింగ్
అభినయం : రాజ్‌కిరణ్, షబానా ఆజ్మీ

కొందరు కళాకారుల గురించి ఎంత చెప్పినా ఏదో మిగిలిపోయిందని పిస్తుంది. అలాంటప్పుడు వారి కళను ఒకసారి పరికిస్తే వారి గొప్పతనం అర్థమవుతుంది. కైఫీ ఆజ్మీ గురించి మాటల్లో చెప్పటం కన్నా ఆయన వ్రాసిన పాటలు ఒకసారి పరిశీలిస్తే ఆయన కవిత్వం ఆయా చిత్రాలను ఎంత సుసంపన్నం చేసిందో తెలుస్తుంది. 'కాగజ్ కే ఫూల్' లో పెండ్లాడే అవకాశంలేని నాయికానాయకులు కలిసినపుడు వచ్చే 'వక్త్ నే కియా క్యా హసీం సితమ్, తుమ్ రహే న తుమ్, హమ్ రహే న హమ్' (కాలమెంత అందమైన దగా చేసింది, నీవు నీవుగా మిగల్లేదు, నేను నేనుగా మిగల్లేదు) పాటలో వారి సందిగ్ధానికి అక్షరరూపం ఇచ్చారు. 'షమా' చిత్రంలో 'ధడక్‌తే దిల్ కీ తమన్నా' పాటలో 'వోగమ్ హసీన్ హై జిస్ గమ్‌కే జిమేదార్ హో తుమ్' (నీవు కలిగించే బాధ కూడా సుఖమే) అని అవ్యాజ ప్రేమకు అర్థం చెప్పారు. 'హకీకత్'లో అమర సైనికుల దేశభక్తిని 'కర్ చలే హమ్ ఫిదా జానోతన్ సాథియోం, అబ్ తుమ్హారే హవాలే వతన్ సాథియోం' (మా తనువూ ప్రాణాలూ అర్పిస్తాం, సోదరులారా, ఇక దేశం బాధ్యత మీదే) పాటలో చాటారు. హేమంత్ కుమార్ సంగీతం అందించిన 'కొహరా', 'అనుపమా' ఎంత విభిన్న చిత్రాలో ఆ చిత్రాలలో కైఫీ ఆజ్మీ వ్రాసిన 'యే నయన్ డరే డరే' (కొహరా), 'యా దిల్ కీ సునో దునియావాలోం' (అనుపమా) పాటలు అంత విభిన్నంగా ఉంటాయి. 'హీర్ రాంఝా' లో 'మిలోన తుమ్ తో హమ్ ఘబరాయే, మిలోతో ఆంఖ్ చురాయే' (నీవు లేకుంటే భయం, నీవు ఎదురుపడితే బిడియం) అని ఒక అమ్మాయి తొలిప్రేమను కళ్ళకు కట్టినట్టే ఓ భగ్న ప్రేమికుడి బాధను 'యే దునియా, యే మెహఫిల్ మేరే కామ్ కే నహీం' (ఈ లోకం, ఈ కోలాహలం నాకు అనవసరం) పాటలో చెప్పారు. ఇక 'పాకీజా' లోని 'చల్‌తే చల్‌తే' పాటలో ప్రేమకోసం పరితపించే నాయిక భావాలను 'యే చిరాగ్ బుఝ్ రహే హైం మేరే సాథ్ జల్‌తే జల్‌తే' (ఈ దీపాలు మలుగుతున్నాయి నాతోపాటు రగలలేక) అంటూ గుండెను హత్తుకునేలా చెప్పారు. ఈ పాటను హాసం 17వ సంచికలో ప్రస్తావించటం జరిగింది. 'అర్థ్' చిత్రంలో అభిమానవతి అయిన హీరోయన్ తన స్నేహితుడి వద్ద కూడా తన బాధను దాచటంతో అతను సున్నితంగా మందలిస్తూ ఆమెను సముదాయించే పాట 'తుమ్ ఇత్‌నా జో ముస్కురా రహే హో'.

'అర్థ్', 'సారాంశ్', 'నామ్', 'జనమ్', 'జఖ్మ్' వంటి చిత్రాలతో చక్కని దర్శకుడుగా పేరు సంపాదించారు మహేశ్‌భట్. ముఖ్యంగా 'అర్థ్' చిత్రంతో ఒక కొత్త కథాంశాన్ని సరికొత్త రీతిలో తెరకెక్కించి కొత్త ఒరవడిని సృష్టించారు. ఈ చిత్రంలో ఇందర్ మల్హోత్రా ఒక ఫిలిమ్ డైరెక్టర్. అతని భార్య పూజా. ఇందర్ కవితా అనే నటి కోసం పూజాను వదిలి వెళ్ళిపోతాడు. నా అన్నవారెవరూ లేని పూజా మొదట కృంగిపోతుంది. తనను వదిలి వెళ్ళవద్దని భర్తని, తన భర్తను తనకు దూరం చేయవద్దని కవితాను ప్రాధేయ పడుతుంది. తరువాత స్నేహితుల సహాయంతో ఉద్యోగం సంపాదించుకుని స్వతంత్రంగా జీవనం సాగిస్తుంది. కవితా పెళ్ళికై పట్టుబట్టడంతో ఇందర్ పూజాను విడాకుల పత్రంపై సంతకం చేయమని అడుగుతాడు. అడిగిన వెంటనే సంతకం చేస్తుంది పూజా. కానీ అప్పటి వరకు అతను తన వద్దకు ఎప్పటికైనా తిరిగి వస్తాడనే ఆశతోనే ఉంటుంది. కవితా అపరాధ భావంతో మానసిక రుగ్మతకు గురై ఇందర్ ఇంకా పూజాను కలుస్తూనే ఉన్నాడని అనుమానిస్తుంది. చివరికి పూజాను వదిలేసిన ఇందర్ తనను వదిలేయడని నమ్మకం ఏమిటని కవితా ఇందర్‌ను వదిలేస్తుంది. ఇందర్ పూజా వద్దకు వెళ్ళి తనను క్షమించమని, మళ్ళీ కలిసి ఉందామని అడుగుతాడు. పూజా నిరాకరించి ఒంటరిగానే తన జీవితం సాగిస్తుంది. మహిళ జీవితానికి అర్థం కేవలం మగవాడి ఇష్టానుసారం నడుచుకోవటం కాదని, అన్యాయం జరిగినపుడు ధైర్యంగా నిలిచి తన ఉనికి కాపాడుకోవాలని చక్కని సందేశం ఇచ్చారు, పూజా పాత్ర ధరించిన షబానా ఆజ్మీక

ఉత్తమ నటిగా జాతీయ అవార్డు లభించింది. మహేశ్ భట్‌కు ఉత్తమ దర్శకుడిగా ఫిలింఫేర్ అవార్డు లభించింది.

'అర్థ్'కు సంగీతం భార్యభర్తలైన చిత్రాసింగ్, జగ్‌జీత్ సింగ్ అందించారు. భారతీయ శాస్త్రీయ సంగీత ప్రక్రియలైన ఖయాల్, ఠుమ్రీ, ధ్రుపద్‌లలో చిన్నప్పటి నుంచి శిక్షణ పొందిన జగ్‌జీత్ సింగ్ ఉపాధికోసం 1965 లో ముంబాయి చేరుకున్నారు. ఒడిదుడుకులు ఎదుర్కొంటూ యాడ్ జింగిల్స్ రూపొందించారు. అదే సమయంలో చిత్రాతో పరిచయం ఏర్పడింది. వారిద్దరి వివాహం 1969లో జరిగింది. 1976లో వారిద్దరూ కలిసి 'అన్‌ఫర్గెటబుల్స్' అనే గజల్ ఆల్బమ్ వెలువరించారు. ఈ ఆల్బమ్‌తో గజల్ స్వరూపాన్నే మార్చేశారు. గజల్స్‌లోని మెలోడీని కోల్పోకుండా జనాదరణ పొందేలా వారు గజల్ ప్రక్రియకు కొత్త రూపు ఇచ్చారు. 'అర్థ్'తో పాటు , 'సాథ్ సాథ్', 'ప్రేమ్‌గీత్' చిత్రాలకు కూడా జగ్‌జీత్ సింగ్ సంగీతం అందించారు. 'తుమ్ కో దేఖా తో యే ఖయాల్ ఆయా', 'హోఠోం సే ఛూలో తుమ్' పాటలు ఎంతో ప్రజాదరణ పొందాయి. జగ్‌జీత్, చిత్రా కలిసి 'హోప్', 'ఇన్ సెర్చ్', 'ఇన్‌సైట్' , 'మిరాజ్' వంటి చక్కని గజల్ ఆల్బమ్స్ రూపొందించారు. వారి ఏకైక కుమారుడు మరణించటంతో చిత్రా సంగీత ప్రపంచానికి దూరంగా ఉంటున్నారు. జగ్‌జీత్ ఒంటరిగా సంగీత ప్రయాణం సాగిస్తూ 'మరాసిమ్', 'ఫేస్ టు ఫేస్', 'క్రై ఫర్ క్రై' వంటి ఆల్బమ్స్ రూపొందించారు. ఇటీవలి కాలంలో 'సర్ఫరోష్', 'తర్కీబ్' చిత్రాలలో గజల్స్ పాడారు. భారత ప్రభుత్వం ఇటీవల జగ్‌జీత్ సింగ్‌కు పద్మ విభూషణ్ అవార్డు ప్రకటించింది.









'అర్థ్' లో పూజ విడాకుల పత్రంపై సంతకం చేసి తన స్నేహితుడైన ఓ గాయకుడి ఇంటికి వెళ్తుంది. ఆరోజు ఆమె పుట్టిన రోజు కావటంతో అతను ఆమెకు శుభాకాంక్షలు తెలపాలని ఎదురు చూస్తుంటాడు. ఆమె బాధను దిగమింగుతూ చిరునవ్వుతో అతన్ని పలకరిస్తుంది. అతను ఆమె బాధ గ్రహించి సముదాయిస్తాడు. ఈ సన్నివేశానికి, సందర్భానికి సరిపోయేలా సూటిగా గుండెను తాకి కదిలించేలా వ్రాసిన పాట 'తుమ్ ఇత్‌నా జో ముస్కురా రహే హో'.

'ముస్కురానా'అంటే చిరునవ్వు నవ్వటం. గమ్ అంటే బాధ. ఛుపానా అంటే దాచటం.

**'ఇంతగా చిరునవ్వు నవ్వుతున్నావే నీవు**
**ఏదో బాధను దాస్తున్నావు'**

బాధను దాచుకోవటానికే ఆమె అంతగా చిరునవ్వు నవ్వుతోందని అతనికి అర్థమైంది. సూటిగా ఆమెను అదే అడుగుతున్నాడు.

'నమీ' అంటే తడి. 'లబ్' అంటే పెదవి. 'హఁసీ' అంటే నవ్వు. 'హాల్' అంటే పరిస్థితి.

**'కన్నుల్లో తడి, పెదవిపై నవ్వు**
**ఉన్నది దాచి భ్రమపెడుతున్నావు'**

ఆమె కన్నుల్లో తడి ఉంది. పెదవిపై చిరునవ్వు ఉంది. ఆమె పరిస్థితి ఒకలా ఉంటే పైకి మాత్రం అంతా బావున్నట్టు నటిస్తోంది. 'స్నేహితుడి వద్ద కూడా దాచాలా' అనే మందలింపు ధ్వనిస్తుంది ఇక్కడ.

జహర్ అంటే విషం. అష్క్ అంటే కన్నీళ్ళు. పీనా అంటే తాగటం.

**'విషమైపోతాయి ఈ కన్నీళ్ళు**
**వీటిని తాగుతూ పోతున్నావు'**

కుమిలిపోతూ జీవితం గడిపితే చివరికి ఈ దుఃఖమే విషమై జీవితాన్ని హరిస్తుంది. తన దుఃఖమే తనకు నరకమని చెబుతున్నాడు. ఇలా కన్నీళ్ళు కారుస్తూ ఉండవద్దని హితవు చెబుతున్నాడు.

ఆమె వెళ్ళిపోవటానికి సిద్ధపడుతూ తన బ్యాగ్‌లోని విడాకుల కాయితాల కాపీని సర్దుకుంటుండగా అతని వాటిని తీసుకుని చూస్తాడు. అతనికి విషయం అర్థమవుతుంది. మరిచిపోతున్న గతాన్ని మళ్ళీ గుర్తు చేసుకుంటోందని గ్రహించాడు.

జఖ్మ్ అంటే గాయాలు. వక్త్ అంటే కాలం. ఛేడ్‌నా అంటే రేపటం.

**'కాలం మాన్పుతున్న గాయాలను**
**నీవెందుకు మళ్లీ రేపుతున్నావు'**

కొత్త జీవితానికి అలవాటు పడి పాత గాయాలను మరచిపోతున్న తరుణంలో మళ్ళీ గతాన్ని తిరగదోడి బాధపడటం వివేకం కాదని నచ్చచెపుతున్నాడు.

'రేఖాయేఁ' అంటే గీతలు. ముకద్దర్ అంటే విధి. ఖేల్ అంటే ఆట.

'మాత్ ఖానా' అంటే ఓడిపోవటం, భంగపడటం, ఖంగు తినటం.

**'చేతిగీతల ఆటే విధి అంటే**
**ఆ గీతల చేత భంగపడుతున్నావు'**

చేతి గీతల్లోనే జాతకం ఉంటుంది. కేవలం ఆ గీతల వల్ల ఓటమి అంగీకరించకూడదని అంటున్నాడు. ఇక్కడ 'మన జీవితం మన చేతుల్లోనే ఉంది. నిరాశపడకుండా ముందడుగు వేయాల'నే ధైర్యం చెబుతున్నాడు.

ఈ చిత్రంలో 'ఝుకీ ఝుకీ సీ నజర్' అనే పాట కూడా హిట్టే.

**-పి.వి. సత్యనారాయణ రాజు**

# రాజా ఆడియో రివ్యూ




**విడుదల : ఆదిత్య**
**వెల : రూ.30/-**

గజాలా, రాజా జంటగా సింగీతం శ్రీనివాస రావు దర్శకత్వంలో సురేష్ ప్రొడక్షన్ పతాకంపై డి. రామానాయుడు నిర్మించిన 'విజయం' ఆడియో క్యాసెట్ విడుదలయింది. కోటి ఈ చిత్రానికి సంగీతదర్శకుడు.

సీతారామశాస్త్రి రాయగా కార్తిక్, శ్రియా గోషాల్ పాడిన 'నిజమేనా నిజమేనా నే విన్నది నిజమేనా' పాట చెవికి, మనసుకి ఏ ఇబ్బందీ కలిగించకుండా హాయిగా సాగిపోతుంది. కాకపోతే బుద్ధికి మాత్రం కొంతపని కల్పిస్తుంది. ఈ పాట ట్యూన్‌ని మనసుకి పట్టించుకుని, అలా ఆలపించుకుంటూపోతే- 'ఆనందం' సినిమాలో 'కనులు తెరిచిన కనులు మూసిన కలలు ఆగవేలా' పాటలో 'పెదవుల్లో ఈ దరహాసం నీకోసం పూసింది' అనే లైను, 'మనసంతా నువ్వే' లో 'నీ స్నేహం ఇకరాదుఅని కరిగే కలగానైనా' అనే పాట పల్లవి నుంచి 'మనసంతా నువ్వే' అని వచ్చేవరకూ ఉన్న ట్యూన్ ఇవన్నీ అంతర్లీనంగా స్ఫురిస్తూ వుంటాయి. ఇక మొదటి చరణం పూర్తయిన తరువాత - పాట చివర్లోనూ వున్న ఇంటర్లూడ్‌ని వింటుంటే 'చిరునవ్వుతో' సినిమాలోని 'కనులు కలిశాయి' అనే పాటలోకి వెళ్ళిపోగలం అని అనిపిస్తుంది. ఈ ఉదాహరణలన్నీ ఈ పాట- ఇప్పటి ఇతర గీతాల ట్రెండ్‌ని దృష్టిలో పెట్టుకొని స్వరపరచబడిందేమోనని ఓ క్షణం ఆలోచించడానికే!

నాగూర్‌బాబు పాడిన 'ఏజీ ఓజీ సునోజీ' పాట చాలాకాలం తర్వాత భువనచంద్ర విజృంభించి రాసిన పాట. బయాలజీ, సైకాలజీ, ఆస్ట్రాలజీ, న్యూరాలజీ, పేథాలజీ అంటూ రకరకాల సైంటిఫిక్ టెర్మ్‌లతో ప్రేమ గీతాన్ని రాయటం వంటి తమాషా ప్రయోగాలు, స్కీమింగ్ ఎక్కువగా చంద్రబోస్ పాటల్లో కనబడతాయి. ఆ రకంగా ఆలోచిస్తే భువనచంద్ర పోటీపడి రాయటంలో తన స్పెషలిటీని మరోసారి నిరూపించుకున్నారనిపిస్తుంది. శ్రోత చెవికి పాట ఆడియో ద్వారా చేరే సాధనాలలో ఎక్కడో ఉన్న కొద్దిపాటి అవరోధాన్ని అధిగమిస్తే ఈ పాట సాహిత్యం మరింత స్పష్టంగా వినిపించడానికి అవకాశం వుంది.

రాజేష్ పాడిన 'హంపిలో శిల్పాలు ఆర్టీసి బస్సెక్కి ఆంధ్రాకే వచ్చేసే నేడే' పాటలో ట్యూను, లిరిక్కు పోటాపోటీగా ఒకదానికొకటి జతవడ్డాయి. అందుకు పల్లవి, రెండవ చరణంలో ఆఖరుమూడు లైన్లని ఉదహరించి తీరాలి. తేనె సీసా, వన్నె వీసా, సందేల జడ్జి, నరసాల బ్రిడ్జి, వంటి పదాల్ని మంచి ఎక్స్‌ప్రెషన్‌లతో చక్కగా కాయిన్‌చేసి పాట ఆకర్షణీయంగా రావటానికి అటు చంద్రబోస్ అటువంటి పదాలకు తగ్గ ప్రేరణను అందివ్వగల ట్యూన్‌తో ఇటు కోటి ఇద్దరూ పాటకు న్యాయం చేశారు.

రాజేష్, చిత్ర పాడిన 'కుశలమా ఓ ప్రియా కుశలమా/ మనసులోని మాటనీ తెలుపుమా' పాట ఓ చక్కటి మెలొడీ.... రెండు మూడు సార్లు వింటే స్వరకల్పనలోని చిక్కదనం, చక్కదనం మనసుకి పట్టుబడి అందులోని అందాలను ఆస్వాదించగలం. పదిమందిలో పాడుకోడానికి ఫరవాలేదనిపించే మంచి మాటలనే ప్రయోగిస్తూ పాటని రాసిన భువనచంద్రకి తన రెగ్యులర్ మార్కులోని ఘాటుని వీలయినంత వరకు తగ్గించినందుకు ధన్యవాదాలు. కాకపోతే ఒకటి.... 'మగసిరితో హారతులివ్వాలే ప్రతిపతికి ఓలలనా' అనే వాక్యాన్ని ఏం ఊహించి ఆయన రాశారో, అసలు అదెలా సాధ్యమో భువనచంద్ర గారే వివరిస్తే బావుంటుంది.

టిప్పు, శ్రియాగోషాల్ పాడిన 'నీతో నిండు నూరేళ్ళు తోడై ఉండనీ చాలు' కూడా లైట్ మెలొడీ సాంగ్. పల్లవి వింటుంటే పాతిక సంవత్సరాల క్రితం కీ॥శే॥ చక్రవర్తి 'జేబుదొంగ' సినిమా కోసం చేసిన 'నీలాల నింగిలో మేఘాల తేరులో ఆ పాలపుంతలో నీ కౌగిలింతలో నిలువెల్ల కరిగిపోనా' అనే పాట గుర్తొస్తూవుంటుంది. ప్రేమ అనే అనుభూతిని రకరకాల ఎక్స్‌ప్రెషన్స్‌తో వెలిబుచ్చడంలో ఇప్పటి వరకూ సీతారామశాస్త్రి ఇచ్చినన్ని ఎక్స్‌ప్రెషన్లు, రాసిన పాటలు మరొక కవి ఎవరూ రాయలేదేమోననిపిస్తుంది. ఆయన ఎక్స్‌ప్రెషన్ల ఎక్స్‌ప్రెస్‌లో పయనించిన ప్రయాణికులలో ఈ పాట మరొక అందమైన ప్రయాణికురాలు (?)

కులశేఖర్ రాయగా టిప్పు, సునీత పాడిన 'మేఘాల పల్లకి అడగనా ఈ నేలమీదికే పిలవనా' పాటని బెస్ట్ సాంగ్ ఆఫ్ ది క్యాసెట్‌గా చెప్పుకోవాలి. రెండు సార్లు ఈ ట్యూన్‌ని గనకవింటే కొన్నాళ్ళవరకు మరిచిపోవటం కష్టం.... అంతగా వెంటాడుతూ ఉంటుంది. కొన్ని ట్యూన్‌లు కొన్ని ప్రాంతీయ భాషాచిత్రాలకే పరిమితం. ఈ పాట ట్యూన్ ఆ కేటగిరికి చెందదు. ఏ ప్రాంతీయ భాషా చిత్రంలోనైనా సరే ఉపయోగించుకోవచ్చు. ఇటీవల కొన్ని నెలలుగా శ్రోతలకు వినిపించని కులశేఖర్ ఈ పాటద్వారా 'సుదర్శన'మిస్తాడు. 'దీపమల్లె ప్రేమా దారి చూపదా/ ప్రేమ నీడలోనా రాదు ఆపదా / ఆనంద గంధమే ఈ ప్రేమ' లాంటి వాక్యాలు వింటుంటే- "కులశేఖర్.... ఇలాంటి మంచి మంచి మాటలతో చక్కని పాటలు రాయాల్సిన మీకు అకస్మాత్తుగా అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోయే హక్కులేదు." అని అభ్యర్థించాలనిపిస్తుంది.

నెల్లూరి నెరజాణ (ఒకే ఒక్కడు), రావేరాజకుమారి (సందడే సందడి), ఎక్ లడికీ కో దేఖాతో ఐసాలగా (1942 లవ్‌స్టోరీ) వంటి పాటల లోని అందాలన్నీ ఈ పాటలో ఛాయామాత్రంగా అక్కడక్కడ తొంగి చూస్తూ వుంటాయి. (ఇది ఈ సమీక్షకుడి వ్యక్తిగత అభిప్రాయం).

సినారె రాసిన 'ఎందుకో ప్రేమలో ఇంత ఆరాటం' అనే పాట ఆ క్యాసెట్‌లో మరో మంచి గీతం. రిచి, బాలు ఈ పాటను పాడేరు. కొన్నాళ్ళుగా సినీరంగానికి దూరంగా వున్నా, అవసరం, అవకాశం వెదుక్కుంటూ వచ్చినపుడు తను తరంగంలా ఎగియగలనని సినారె తనను తాను నిరూపించుకున్న పాట యిది. సినిమాలో సందర్భం తెలుసుకున్న తర్వాత ఈ పాటను మరోసారి వింటే సినారె ఎంత నర్మగర్భంగా రాశారో తెలుసుంది.

మనసులో ఏదో మనకగా వున్నదీ / నిదురలో పదేపదే బెదురుపుడుతున్నది / గొంతులో అదే పదం వింతగా వున్నదీ / ఎదురుగా అదే పథం ఎదురు చూస్తున్నదీ / చిలిపిగా అదే గళం పలకరిస్తున్నదీ / బదులుగా అదే గతం పరిహసిస్తున్నది - వంటి వాక్యాలు సినారె ముద్రని చూపిస్తూ వుంటాయి. 'నువ్వు నాకు నచ్చావు' సినిమా తర్వాత 'ఒక్కసారి చెప్పలేవా నువ్వు నచ్చావని' పాట వంటి పాటల్ని చెయాల్సిన డిమాండ్ కోటికి ఏర్పడిందేమోనని ఈ పాట ట్యూన్‌ని వింటే అనిపిస్తుంది. అంతేకాదు 'మైనే ప్యార్‌కియా' చిత్రంలోని 'మెరె రంగ్ మె' పాట టేకాఫ్‌ని ఈ పాట టేకాఫ్ గుర్తు చేస్తూవుంటుంది కూడా!

రచన: కందికొండ (1) గానం : చక్రి

ప: చెన్నై చంద్రమా మనసే చేజారి చెన్నై చంద్రమా నీలోన చేరి
తెగించి తరలిపోతోంది హృదయం కోరి నీ చెలిమి
చెన్నై చంద్రమా... మనసే చేజారి ॥చెన్నై॥
చ: ప్రియా ప్రేమతో... ఆ... ఆ....
ప్రియా ప్రేమతో పలికె పూవనం ॥ప్రియా॥
పరవశంగ ముద్దాడని ఈ క్షణం
చెలి చేయని పెదవి సంతకం ॥2॥
అధరపు అంచున తీపి జ్ఞాపకం
చెన్నై చంద్రమా.... మనసే చేజారి చెన్నై చంద్రమా.....
చ: సఖి చేరుమా... ఆ.... ఆ....
సఖి చేరుమా చిలిపితనమా ॥సఖి॥
సొగసులు చంపేయకె ప్రేమా
ఎదే అమృతం నీకె అర్పితం ॥2॥
గుండెల నిండుగ పొంగె ప్రణయం
చెన్నై చంద్రమా... మనసే చేజారి చెన్నై చంద్రమా

రచన: సాహితి (2) గానం : చక్రి, కౌసల్య

అ: లంచ్‌కొస్తావా మంచెకొస్తావా కోణ్ణికోస్తావా కన్నెడిన్నరిస్తావా
ఆ: చోక్కుపాక్కవా పాక్కుకేక్కవా పూక్కళికొడుక్కవా కన్నిడిన్నరెడుక్కవా
అ: సై సై సై సోకులతో సై అంటావా
ఆ: దై దై తోపుకుల్లె తూల్ అడక్కవా
అ: గున్నమావి తోటకొస్తావా గుమ్మసోకు పండు ఇస్తావా
ఆ: కాదల్ మన్నా కణ్ణడిక్కవా కట్టిక్కిర మామనా కైపిడిక్కవా
చఅ: పైట నీదే పట్టుకుంటే వెచ్చబడే ఊపిరి
ఆ: పరువత్తిలే ముత్తమిడ వెట్కపట్టాల్ ఎప్పడి
కో: హైయ్యా.... ॥4॥
అ: పలక జడ నడుము ఇలా ఎగిసి పడే ఏం కథ
ఆ: తుల్లి ఆడుం నెంజయెల్లాం దిడీ ధిడుక్కుం హోసైదాన్
అ: జై జై కిస్సు ఒడి చేరుకుందామా
ఆ: చోరై కిస్ కబడ్డీ ఆడుగిర నేరందా
అ: కోరుకున్న రంభలజారే కోలికి తేర్చే నా కొరమేన
ఆ: మధురై మెట్టా సుందర పాడ్రు మనదైకేట్ట నిరుండుకు వాయ్యా
చా: మేని పొత్తా మాదిరిదా ఇండాళగు సుందరి
కో: హోయ్యా.... ॥4॥

ఆ: మనసును తాకే వెచ్చని ముద్దూ నిన్నూ నన్నూ కలిపెయ్యదా
అ: మస్తుగా.... మస్తుగా మస్తుమస్తుగా.....
మస్తుగా శ్రీరస్తుగా శుభమస్తుగా వస్తగా
పుస్తలే కొని తెస్తగా మరి...... హోయ్ హోయ్ హోయ్ ॥చుమ్మా॥

రచన: భాస్కరభట్ల రవికుమార్ (6) గానం : రఘుకుంచే, స్మిత

అ: తళుకు తళుకు తళుకు మంది సరుకు
కలుపు కలుపు కలుపు చెయ్యి కలుపు ॥తళుకు॥
అ: దఢకా దఢా తలుపుగడా అదిరిపడే ఎడాపెడా
పెరుగువడా చెరుకుగడా జమాజమారే
కో: గుంతలకిడి గుమా గుమా గుంతలకిడి గుమాగుమా
గుంతలకిడి గుంతలకిడి గుమాగుమా ఓ...
అ: తళుకు తళుకు తళుకు మంది సరుకు
ఆ: పడకు పడకు పడకు తత్తర పడకు
అ: వెన్నా జున్నూ కలిపి తెచ్చావే తిలోత్తమా
చెమ్మా చెక్కా ఆట ఆడించనా
ఆ: కన్నూ కన్నూ కలిపి చేసావూ హడావిడీ
గంగా యమునా తీరం చూపించనా
అ: అబ్బో నువ్ గులాబిలా ఉంటే జిల్ జిలేబిలా
వచ్చానే ఇలా ఇలా ముద్దులు పెట్టేశా
ఆ: చూసెయ్ నువ్ ఎగాదిగా వచ్చెయ్ మరి ఉగాదిగా
నీతోనే షికారుగా ముందరకొచ్చేశా
అ: ఓ... తప్పదు రాణీ నీ చెక్కిలి బోణీ
ఏ నాగమణీ నేడు మరీ దుమ్ముదుమ్మారే... ॥తళుకు॥
అ: సన్నాగున్నా నడుమ అమ్మమ్మో అరేబియా
నున్న గున్న సోకే నైజీరియా
ఆ: తట్టా బుట్టా పట్టు కొచ్చాలే మహాశయా
అట్టా ఇట్టా చేసి చుట్టేయవా
అ: నువ్వే నా కందిపొడి రావే నా నైటుబడీ
నీకే నా పెట్టుబడి చప్పున వచ్చేసా
ఆ: నీకే నా మొక్కుబడి విప్పెయ్‌రా చిక్కుముడి
నీపైనే మోజుపడి చెంగున కట్టేసా
అ: ఓ... కిన్నెరసాని నిను కమ్ముకుపోనీ
నా కంటపడీ వెంటపడీ చంపుతున్నావే... ॥తళుకు॥




రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (1) గానం : కార్తిక్, శ్రియాగోషాల్

అ: నిజమేనా నిజమేనా నే విన్నది నిజమేనా
నిజమేనా నిజమేనా నువ్వన్నది నిజమేనా
యా హూ......... ఐయామ్‌ఇన్ లౌ ॥నిజ॥
కనుపాప కాచుకున్నా కలలన్ని ఈ క్షణాన ఎదురై నిలిచి పిలచెనా
అ: ఆశలలో ఆలాపన జాబిలికే వినిపించనా
ఆ: ఊహాలలో ఆరాధనా కౌగిలికే చూపించనా
అ: చెలి చెలి అని పిలవనా మహా వరం అని తలవనా
ఆ: సరే అని జత కలవనా స్వయం వరం ఇది తెలుసునా
అ: అనుమానం తీరేలా నిను ఓసారిలా తాకనా ॥నిజమేనా॥
ఆ: ఈ నిమిషం ఏం కోరినా కానుకగా అందించనా
అ: నా హృదయం శృతిమించినా ఆపవుగా ఏంచేసినా
ఆ: తయారయా పద ముద్దుగా ముఖాముఖి మురిపించగా
అ: అయోమయం కద కొద్దిగా ఎకాఎకి బరితెంచగా
ఆ: ఉన్న దూరం తరిగేలా నన్ను ప్రేమించవా బుద్ధిగా ॥నిజమేనా॥

రచన: భువనచంద్ర (2) గానం : నాగూర్‌బాబు

ఏజీ ఓజీ సునోజీ ముద్దు సైన్స్ చెప్పుతా సీఖోజీ ॥2॥
బుగ్గమీద ముద్దులిస్తే బయాలజి లిప్పు లింకు లేసుకుంటే లవ్వాలజి
మనసు మిక్సు చేసుకుంటే సైకాలజీ జోరు ముద్దు జుర్రుకుంటే జువాలజీ
అవన్నీ ముందు నీకు నేర్పుతాను బాజీ..........
రాజీ రోజీ రంభాజీ టినేజిపట్లు మిస్సు కాకు మీనాజీ
రాణీ వాణీ వేణీజీ విని ప్రాక్టికల్స్ చేద్దాం ఆవోజీ
ముద్దుగుట్టు పట్టుకుంటే ఆస్ట్రాలజీ ముట్టుకొచ్చి మూర్ఛపోతే న్యూరాలజీ
రేయ్ చెంప ఛెళ్ళు మన్నదంటే పేథాలజీ మిస్సు కిస్సు లిచ్చెనంటే టెక్నాలజి
అడక్కముందె ముద్దులిస్తే ఆంత్రపాలజీ
సోనా లీనా ఆవోజీ మ్యారేజ్ ముందే ముద్దు సైన్స్ లెర్నోజీ
ఖానా పీనా ఓకేజీ కాస్త కిస్సు టేస్ట్ చేసెయ్ కమలాజీజీజీ
స్వీటుముద్దు స్పాట్ చేస్తే ట్రాపాలజీ స్పాటు మిస్సు అయినదంటే హ్యూమరాలజీ
ముద్దుగాటు పడ్డదంటే హెపటాలజీ ఆ మూడునెల్లు దాటిపోతే గైనకాలజీ
ఏనాడు కిస్సుమిస్సు కాదురోజీ - రానివాణ్ణి రానీజీ రోజీ ఆవో దేవో జావో
ఆ: (వచనం) లవ్‌లో నువ్వు ఎల్‌కేజీ

ఆ: ఎవ్వరాగమన్నా ఆగిపోదులే
అ: నూరేళ్ల బంధమే ఈ ప్రేమా
ఆ: అండదండగా ప్రేమ ఉండగా ఓటమే రాదులే ॥మేఘాల॥
ఆ: కోయిలలా నా మదిలో తీయగ పలికే ఈ ప్రేమా
కోవెలలో దేవతలా దీవెనలిచ్చును ఈ ప్రేమా
అ: కన్నులలో ఆశలనే నిజముగ నిలుపును ఈ ప్రేమా
పున్నమిలో జాబిలిలా వెలుగును పంచును ఈ ప్రేమా
ఆ: దీపమల్లె ప్రేమా దారి చూపదా
అ: ప్రేమ నీడలోనా రాదు ఆపదా
ఆ: ఆనంద గంధమే ఈ ప్రేమా
అ: ముళ్ల బాటలే పూల తోటగా మారవా ప్రేమలో ॥మేఘాల॥
ఆ: సందె పొద్దుల్లోనా సరసాలు సాగాలంటే
పెళ్లి బాజా మోగాలందీ ప్రేమ లాహిరి......... ఓహోహోహో

రచన: డా. సి.నారాయణరెడ్డి (7) గానం : టీ.చీ.ఎస్.పి.బాలు

అ: ఎందుకో ప్రేమలో ఇంత ఆరాటం ఎందుకో ప్రేమలో ఇంత ఉబలాటం
కన్న కలలు కనులలోనే కరిగిపోతున్నా
ఆ: ఎందుకో ప్రేమలో ఇంత ఆరాటం ఎందుకో ప్రేమలో ఇంత చెలగాటం
కన్నకలలే గుండెలోనా కాటువేస్తున్నా
అ: ఓ నా ప్రేమా ఆగిపో ఆణిగిపో ఆరిపో
ఆ: ఎందుకో ప్రేమలో ఇంత ఆరాటం
అ: ఎందుకో ప్రేమలో ఇంత ఉబలాటం
అ: మనసులో ఏదో ఏదో మసకగా ఉన్నదీ
బతుకులో క్షణం క్షణం బరువుగా ఉన్నదీ
ఆ: ఊపిరే అలా అలా ఉడికిపోతున్నదీ
నిదురలో పదేపదే బెదురుపుడుతున్నదీ
అ: చేరనున్న తీరమేమో చీలిపోయింది
ఆ: ఏరు తానే అంతలోనే ఎదురు తిరిగింది
అ: ఎందుకో ప్రేమలో ఇంత ఆరాటం
ఆ: ఎందుకో ప్రేమలో ఇంత చెలగాటం
అ: గొంతులో అదే పదం వింతగా వున్నదీ
ఎదురుగా అదే పథం ఎదురుచూస్తున్నదీ
ఆ: చిలిపిగా అదే గళం పలకరిస్తున్నదీ బదులుగా అదే గతం పరిహసిస్తున్నది
అ: నైజమేదో తేలిపోయే రోజు రానున్నదీ
ఆ: ముక్కలైనా అద్దమేమో వెక్కిరిస్తుందీ ॥ఎందుకో॥

యూనాడే యూడే తోడేసేయ్
యిప్పుడిక్కడ వయసే వాడేసేయ్ ॥జుమ్॥
చ: ఫ్యాషన్ టీవీ చూసేస్తూ - పోస్టర్లొంక కన్నేస్తూ
గుటకలు వేస్తూ కాలం గడపొద్దోయ్
కోరికంత దాచేస్తూ - ఆశలన్నీ మూసేస్తూ
బాడీలోని వేడే పెరిగి
ఆపైన బీపీ వచ్చి హాస్పిటల్లో అడ్మిటవ్వద్దోయ్
మీ ప్రాబ్లం నాప్రాబ్లంగా మీ సౌఖ్యం నా సౌఖ్యంగా
ఫ్రెండ్లీగా సాయం చేస్తాగా
హండ్రెడ్ పర్సెంటన్నీ యిస్తాగా
మీటింగే పెట్టేస్తాగా - గ్రీటింగ్సే చెప్పేస్తాగా
ఆటేదో ఆడించేస్తాగా
హేపీ హేపీ న్యూ ఇయరంటాగా ॥జుమ్॥

రచన: భాస్కరభట్ల రవికుమార్ (5) గానం: రవివర్మ, కౌసల్య

అ: చుమ్మా చుమ్మాదె చుమ్మా యమ్మాగున్నాదె గుమ్మా
ఆడేసుకుంటానమ్మా అచ్చంగ అష్టాచెమ్మా
ఆ: బస్సెక్కిరానా రైలెక్కిరానా ఏకంగ ఫ్లైటెక్కి వచ్చెయ్యనా
అ: జర్నీలు చేస్తే టైమంతవేస్తూ రెక్కలు కట్టుకు వచ్చెయ్యవా
అ: త్వరగా..... త్వరగా..... త్వరత్వరగా ॥చుమ్మా॥
ఆ: పొద్దున్న ఇచ్చే ముద్దూ
అ: వద్దన్న ఆగదులెద్దూ
ఆ: సాయంకాలం ముద్దూ
అ: సాయం కోరెనులెద్దూ
ఆ: లిప్పుకి లిప్పూ ఇచ్చిన ముద్దు నిప్పులకుంపటి పెట్టెయ్యదా
అ: గాలికి పంపే ఘాటైన ముద్దు గుండెకి గాలం వేసెయ్యదా
ఆ: కొత్తగా..... కొత్తగా..... కొత్తగా
కొత్తగా కొత్తకొత్తగా మత్తుమత్తుగా వుందిగా
మెత్తగా నన్ను హత్తుకో మరి హోయ్ హోయ్ హోయ్ ॥చుమ్మా॥
అ: బుగ్గకు ఇచ్చేముద్దూ
ఆ: సిగ్గునుపెంచును లెద్దూ
అ: పాదం పైనా ముద్దూ
ఆ: పారాణిలాగా ఇద్దూ
అ: నడుముకి ఇచ్చే నాజూకుముద్దూ సన్నాయిమేళం మోగించదా



అ: హత్తుకుంటే మత్తులెక్కి మతులు పోయే లాహిరి
కో: హోయ్యా..... ॥4॥
ఆ: పుంగివరం ఇళమై ఎల్లాం ఒణక్కుందానే మన్నవా
అ: పరుచుకుంటూ పట్టె మంచం పంచుకుందాం మక్కువ
ఆ: కై కై పేర్చు విడ్డు పొత్తికలామా
అ: హోయ్ హోయ్ గుమ్మగుమ చేసుకుందాం అందమా
ఆ: నీదాన్ని ఎణక్కు పొన్నిరవండు వాందాన్ వుణక్కు తేన్ కళకండు క
అ: సందేలిస్తా పూవుల చెండు కందిచేలో సిద్ధంగుండు

రచన: పెద్దాడమూర్తి (3) గానం: చక్రి

అ: నీవే నీవే నీవే నేనంటా నీవే లేక నేనే లేనంటా
వరమల్లే అందిందేమో ఈ బంధం వెలలేని సంతోషాలే నీసొంతం ॥నీవే॥
చ: నా కలలని కన్నది నీవే నా మెలకువ వేకువ నీవె
ప్రతి ఉదయం వెలుగయ్యింది నీవేగా నాకష్టం ఇష్టం నీవేగా
చిరునవ్వూ దిగులూ నీవే ప్రతి నిమిషం తోడై ఉంది నీవేగా
కనిపించకపోతే బెంగై వెతికావే కన్నీరే వస్తే కొంగై తుడిచావే ॥నీవే॥
చ: నే గెలిచిన విజయం నువ్వు నే ఓడిన క్షణమోదార్పు
నా అలసట తీరే తావే నీవేగా అడుగడుగున నడిపిన దీపం
ఇరువురికే తెలిసిన స్నేహం మది మురిసే ఆనందాలే నీవేగా
జన్మిస్తే మళ్ళీ నీవై పుడతాలే ధన్యోస్మి అంటూ దణ్ణం పెడతాలే ॥నీవే॥

రచన: చంద్రబోస్ (4) గానం: కౌసల్య

ప: జుమ్ జుమారే జుమ్ జుమ్ జుమ్ జుమ్
ధుమ్ ధుమారే ధుమ్ ధుమ్ ధుమ్ ధుమ్
జంటకొస్తె నీదే బబ్బుల్‌గమ్ యింటికి వస్తె యిస్తా బ్రెడ్డు జామ్
జాజిమల్లి మేరానామ్ జాణతనమే మేరా కామ్
జామురేయి చేస్తా ట్రాఫిక్‌జామ్ ఆపై తలపై రాస్తా జండూబామ్
చ: ఓపెలాస్తా కారున్నా - ఏడు ఫ్లోర్ల మేడున్నా
ఒంట్లో మాత్రం ఓపిక వుండాలోయ్
అమ్మబాబు పోగేసి - అంతులేని డబ్బున్నా
గుండెల్లోనే దమ్ముండాలి కళ్ళల్లో కలలుండాలి
కలలే తీరే దారే వెతకాలోయ్
నా దారికి నువ్వే వచ్చేయ్ - నచ్చింది నేడే దోచేయ్
యిష్టంగా ఏదో చేసేసేయ్ / యిచ్చిపుచ్చుకుంటే హేపీసోయ్
నిన్నంటూ లేనే లేదోయ్ - రేపంటూ రానే రాదోయ్



రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (5) గానం: టిప్పు, శ్రియాగోషాల్

అ: నీతో నిండు నూరేళ్ళు తోడై ఉండనీ చాలు
ఆ: నాలో పంచ ప్రాణాలు నీకే పంచనీ చాలు
అ: వేవేల జన్మాలు నీ జంటగా పుట్టి చెయ్యాలి ప్రేమాభిషేకాలు
ఆ: నీ వేలు అందిస్తే నీ వెంట నే వచ్చి చూడాలి ఏడేడులోకాలు
అ: ఇంకేం వద్దు వేరే వరాలూ మంత్ర మేసినట్టు నువ్వు నవ్వితే చాలూ
ఎంత మంటలైన నాకు మంచి గంధాలూ
ఆ: మంచమేసినట్టు నువ్వు అల్లితే చాలూ
కంట చూడలేవు నన్ను మంచు కాలాలూ
అ: చేరలేని తీరం ఉందా నీ చెలిమితో
ఆ: తీరిపోని కోరిక వుందా నీ చొరవతో
అ: నిను తలచిన నిముషం కదిలెను నా కలలో ॥నీతో॥
ఆ: వింత కాంతి నింపుకోవా కన్నె అందాలూ కోవెలంటి కౌగిలింట వాలితేచాలూ
అ: ఊపిరంత ఆపలేని తీపి తాపాలూ
దేవి గారి సేవలోన ధూపదీపాలూ
ఆ: పొద్దులన్ని పండుగలవనీ నీ మోజులో
అ: ముద్దులన్నీ మల్లెలుకానీ నీ పూజలో
ఆ: నా వయసుకు మెలకువ నీవేగా అసలూ- ॥నీతో॥

రచన: కులశేఖర్ (6) గానం: టిప్పు, సునీత

వహా వాహ్వా ॥2॥
అ: మేఘాల పల్లకీ అడగనా ఈ నేలమీదకే పిలవనా
నీ మాట ఇంతకీ నిజమేనా
ఆ: ఈ ఊరు వాడనీ పిలవనా నీ కళ్ళ ముందరే నిలపనా
నా మాట నమ్మవా అపుడైనా.....
అ: పాలబుగ్గల్లోనా చిరుసిగ్గు పూసేవేళా
మాఘమాసం తెస్తా ఉంది మంచి మాటనీ
ఆ: ఈ ఊరువాడనీ పిలవనా నీ కళ్ళముందరే నిలపనా
నా మాటనమ్మవా అపుడైనా
అ: ఎవ్వరిలో ఎన్నటికీ మారనిదేగా ఈ ప్రేమా
గుండెలలో గుప్పిటలో దాగనిదేగా ఈ ప్రేమా
ఆ: నీ యెదలో నే పలికే ఇష్టపదేగా ఈ ప్రేమా
నీ జతలో నే నడిచే సప్తపదేగా ఈ ప్రేమా
అ: పువ్వులాగ ప్రేమా వాడిపోదులే



రచన: చంద్రబోస్ (3) గానం: రాజేష్

హంపీలో శిల్పాలు అర్జీసి బస్సెక్కి ఆంధ్రాకే వచ్చేసె నేడే
ఖజురహో అందాలు కోణార్కు రైలెక్కి వైజాగ్‌కే విచ్చేసె నేడే
ఎల్లోరా వయ్యారులు ఎఫ్‌టివి ఓపెన్ టాపులు
అంతా ఒక్క చోటే చేరగానే రక్త పోటే పెరిగిందినాడే ॥హంపీలో॥
అరకేజి లడ్డూలాంటి అమ్మాయి మిడ్డీవేసి క్వింటాలు కులుకే కులికిందోయ్
ఫుల్‌బాటిల్ పెప్సీలాంటి పిల్లేమో మాక్సీవేసి ప్రాణాలే స్ట్రాతో పీల్చిందోయ్
తొలి తొలి బిడియము వదలని బికినిలు తొడిగెను బంతీ పూవే
పురుషుల పనులను పట్టగ టవలే చుట్టెను చిట్టిగువ్వే
పొగరున్న మిస్సుల్లోన పొదుపైన డ్రస్సుల్లోన పదునైన ఫ్యాషన్ షో నేడే
"హంపిలో॥
స్వీటెస్ట్ సిమ్రాన్ కన్నా హాటెస్ట్ ఆర్తికన్నా మహా బాగా ముద్దొస్తున్నావే..... గుమ్మా
జగదాంబ సెంటర్‌లోనా జెన్నీఫర్ పోస్టర్ కన్నా మరికాస్త పిచ్చెక్కించావే
పదమని పెదవులు పిలవగ త్వరపడి తొణకవె తేనె సీసా
జతపడి సుఖపురి యాత్రకు ఇకమరి ఈయవే వన్నె వీసా
అందాల బుజ్జి నువ్వే సందేల జడ్జి నేనే సరసాల బ్రిడ్జి కడదామె ॥హంపిలో॥

రచన: భువనచంద్ర (4) గానం: రాజేష్, చిత్ర

ఆ: కుశలమా ఓ ప్రియా కుశలమా ॥2॥
మనసులో మాటనీ తెలుపుమా
అ: చిరుగాలిలో ప్రియరాగం వినిపించె ఈ వేళా
శుభమస్తు అన్నది ప్రాయం దరిచేర రావేలా
ఆ: తనువు తనువు ఏకమై కరిగిపోయేలా ॥కుశలమా॥
అ: వెన్నెల్లో గోదారల్లే ఉప్పొంగే వయ్యారాలే చెలిమి త్వరపడితే
ఆ: అందాలే ఆనందాలై అంగాంగం అనురాగంతో ప్రియుని ఒడితడితే
అ: మగసిరితో హారతులివ్వాలే ప్రతి పతికి ఓలలనా
ఆ: కసి కౌగిళ్ళతో కవ్వించుకో చెలిని ఓ సఖియా
అ: చిరు పెదవులా మధువులే అందిస్తే ఔననా
ఆ: వయ్యారం నాది శృంగారం నీది ఒళ్ళోకి రా మదనా ॥కుశలమా॥
ఆ: ఎండల్లో వానల్లాగ వానల్లోతేనెల్లాగ తాకింది తొలి వలపూ
అ: చూపుల్లో స్నానం చేసి వాటంగా వెన్నే మీటి లాలిస్తా కడవరకూ
ఆ: పసి మనసుదోచిన తూనీగా చెలి సొగసే నీదికదా
అ: ఒడి చప్పట్లతో ముచ్చట్లతో తీరాలి వయసు వ్యథా
ఆ: చనువిచ్చావనీ వచ్చాననీ చెప్పొద్దు చిలిపి కథా
అ: నీలోనా నేను నాలోనా నీవూ ఉన్నామె భయపడకా ॥కుశలమా॥

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| లిరిక్స్ | : సాహితి, కందికొండ, రవికుమార్, పెద్దాడమూర్తి |
| రచనా సహకారం | : కోనా |
| కెమెరా | : శ్యామ్‌కె.నాయుడు |
| ఎడిటింగ్ | : మార్తండ్ కె. వెంకటేష్ |
| ఆర్ట్ | : చిన్నా |
| ఫైట్స్ | : రామ్ - లక్ష్మణ్ |
| పి.ఆర్.ఓ | : పులగం చిన్నారాయణ |
| కొరియోగ్రఫీ | : కృష్ణారెడ్డి, ప్రదీప్ ఆంటోని |
| కాస్ట్యూమ్స్ | : అంజిబాబు |
| మేకప్ | : సుద్దాల రాజు - శ్రీను |
| స్టిల్స్ | : దశరథ్‌లాల్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ | : కె. రాంబాబు, కె.వి. కృష్ణవర్ధన్ |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : మల్లి, భద్రం |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : అశోక్ కుమార్ లాలం, రమేష్‌చంద్ర, గాంధీ శ్రీనివాస్ |
| కో - డైరెక్టర్ | : రెడ్డి తరణిరావు |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : బి.ఎన్.వి. రామకృష్ణరాజు |
| సంగీతం | : చక్రి |
| కథ - మాటలు - స్క్రీన్‌ప్లే- నిర్మాత - దర్శకత్వం | : పూరీ జగన్నాథ్ |

## తారాగణం

రవితేజ, అశిన్, ప్రకాశ్‌రాజ్, జయసుధ, ఆలీ, ఎమ్.ఎస్. ధర్మవరపు, కాశీభట్ల, కాదంబరి కిరణ్‌కుమార్, పి.డి.రాజ్, ఆనంద భారతి, గౌతంరాజు, పృధ్వీరాజ్, కృష్ణంరాజు, ఉమ, రితి, జితేంద్ర

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

కె.ఎల్.ఎన్.రాజు సమర్పించు వైష్ణో అకాడమీ

purimovies.com

# అమ్మ నాన్న ఓ తమిళ అమ్మాయి

పూరి జగన్నాథ్

శ్యామ్ కె. నాయుడు చక్రి మార్తాండ్ కె. వెంకటేష్ రామకృష్ణంరాజు


పూరి జగన్నాథ్


చక్రి


భాస్కరభట్ల రవికుమార్


పెద్దాడమూర్తి


కందికొండ


సాహితి



## తారాగణం

రాజా, గజాల, మురళీమోహన్, గిరిబాబు, సునీల్, శివకృష్ణ, బ్రహ్మానందం, ఏ.వి.యస్, సుమన్‌శెట్టి, రాజీవ్ కనకాల, ధర్మవరపు సుబ్రమణ్యం, లక్ష్మీపతి, పవన్, సంతోష్ శ్రీనివాసరెడ్డి, మనోజ్, భగవాన్, వర్ష, శ్వేత, రాగిణి, హేమసుందర్, ముక్కురాజు, శివపార్వతి, ఆలపాటి లక్ష్మి


డా॥ డి.రామానాయుడు

సురేష్ ప్రొడక్షన్స్

# విజయం

డా॥ డి.రామానాయుడు కోటి సింగీతం శ్రీనివాసరావు


సింగీతం శ్రీనివాసరావు


కోటి


డా॥ సి.నారాయణరెడ్డి


సిరివెన్నెల


చంద్రబోస్


కులశేఖర్


భువనచంద్ర

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : సత్యానంద్, రమేష్‌గోపి |
| స్టోరీ కో-ఆర్డినేటర్స్ | : వేటూరి రవి |
| ఫోటోగ్రఫీ | : హరి అనుమోలు |
| ఆర్ట్ | : అశోక్ |
| సంగీతం | : కోటి |
| ఎడిటింగ్ | : కృష్ణారెడ్డి, మాధవ |
| పాటలు | : డా॥ సి.నారాయణరెడ్డి, సీతారామశాస్త్రి, కులశేఖర్, చంద్రబోస్, భువనచంద్ర |
| మేకప్ | : హరి |
| కాస్ట్యూమ్స్ | : జగదీష్ |
| డాన్స్ | : ప్రసన్న, రాజశేఖర్, కృష్ణారెడ్డి, బృంద |
| స్టిల్స్ | : ఎస్.ఎన్.పాల్వాయి |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : రాయుడు, కిశోర్, వసంత్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : రాజా |
| క్యాషియర్ | : రమేష్ |
| అసోసియేట్ డైరెక్టర్ | : జి.టి.రాయుడు |
| కో-డైరెక్టర్స్ | : బి.సాంబశివరావు, వి.ఈశ్వర్‌రెడ్డి |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : సురేంద్ర, అశోక్ |
| పి.ఆర్.ఓ. | : వెంకట్రావు |
| నిర్మాత | : డా॥డి.రామానాయుడు |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : సింగీతం శ్రీనివాసరావు |




విడుదల : ఆదిత్య
వెల : 38/-




# మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్లు




విడుదల : లియో
వెల : 32/-




విడుదల : ఆలాపన
వెల : 35/-




విడుదల : ఆలాపన
వెల : 35/-

పూరి జగన్నాథ్ దర్శకత్వంలో రవితేజ హీరోగా వైష్ణో అకాడమీ బ్యానర్‌పై కె.ఎల్.ఎన్.రాజు సమర్పించిన 'అమ్మ నాన్న ఓ తమిళ అమ్మాయి' సినిమా ఆడియో క్యాసెట్ విడుదలయింది. చక్రి ఈ సినిమాకి సంగీత దర్శకుడు.

కందికొండ రాయగా సంగీత దర్శకుడు చక్రి పాడిన 'చెన్నై చంద్రమా మనసే చేజారి' అనే పాట చక్రి ఇప్పటి వరకు చేసిన గుడ్ కంపొజిషన్స్‌లో ఇదొకటి. 'ఇద్దరు' డబ్బింగ్ సినిమాలో ఎ.ఆర్ రెహమాన్ స్వరపరిచిన 'శశివదనే శశివదనే స్వర నీలాంబరి నీవా' అనే పాట చరణంలోని ఎత్తుగడని ఈ పాట చరణాల ఎత్తుగడ జ్ఞప్తికి తెస్తూవుంటుంది. 'మహాగణపతిం మనసా స్మరామి' అనే ముత్తుస్వామి దీక్షితార్ కీర్తనలోని తొలి పాదాన్ని ప్రేరణగా తీసుకొని పాటను చక్రి మలచుకొన్న తీరు ప్రశంసార్హంగానే వుంది.

చక్రి, కౌసల్య పాడిన 'లంచ్‌కొస్తావా మంచెకొస్తావా' పాటలో తెలుగు తమిళ సాహిత్యాలను కలుపుతూ ఓ 'సాహితీప్రయోగం'లా రచయిత సాహితి రాసిన విధానం, దానికి చక్రి ఇచ్చిన హుషారైన ట్యూను యువతను ఆకట్టుకుంటుంది.

పాత్రికేయుడు పెద్దామూర్తి రాసిన 'నీవే నీవే నీవే నేనంటా' పాటని వింటుంటే ప్రస్తుతం నడుస్తున్న ట్రెండ్ బట్టి అది తల్లీ కొడుకుల అనుబంధాన్ని వెల్లడి చేసే పాట అని ఎవ్వరూ అనుకోరు. అదే ఈ పాట కాన్సెప్ట్‌లోని తమాషా. ఈ పాటకు చక్రి హాంటింగ్ ట్యూన్‌ని సమకూర్చటంలోనూ పాడడంలోనూ మంచి టాలెంటే చూపించాడు. కాకపోతే చక్కటి వాచకంతో పాడగల చక్రికి బాలీవుడ్ గాయకుల్లాగ 'నీవుల్లేక' అంటూ నొక్కి పాడాల్సిన అవసరం వుందా అని ఒకింత అనిపించటం సహజం.

చంద్రబోస్ రాయగా కౌసల్య పాడిన 'జుమ్ జుమారే జుమ్ జుమ్ జుమ్ జుమ్' పాట ఓ సరదా పాట. అలనాటి హిందీ చిత్రం 'నాగిన్' లోని 'మన్‌డోలే మెర తన్‌డోలె మెర దిల్‌కా గయా ఖరార్ రే కౌన్ బజాయె బాసురియా' అనే పాట ట్యూన్ మొత్తాన్ని ఈ సరదా పాటకు సరదాగానే అడాప్ట్ చేసుకున్నారు. ఇలాటి అవకాశం వస్తే చంద్రబోస్ ఊరుకుంటాడా? జంట కొస్తే నీదే బబ్బుల్ గమ్ / ఇంటికి వస్తే ఇస్తా బ్రెడ్డు జామ్ / జామురేయి చేస్తా ట్రాఫిక్ జామ్ / ఆపై తలపై రాస్తా జండూబామ్ లాంటి వాక్యాలతో చెలరేగిపోయాడు.

భాస్కరభట్ల రవికుమార్ రాయగా రవివర్మ, కౌసల్య పాడిన 'చుమ్మా చుమ్మాదె చుమ్మా' పాట మాస్ ఓరియెంటెడ్ సాంగ్. చక్రికి ఇళయరాజా ఒరిజినల్‌గా ఇష్టం. 'ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు' సినిమా వల్ల దర్శకుడు వంశీ పుణ్యమా అని ఇళయరాజాలా మ్యూజిక్ చెయ్యగలడన్న పేరుకూడా వచ్చేసింది. ఇవన్నీ కలిసి ప్రేరణ యిచ్చాయేమో మరి- 'సీతాకోక చిలక' సినిమాలో 'మిన్నేటి సూరీడు వచ్చెనమ్మా పల్లె కోనేటి కలువలు విచ్చెనమ్మా' అనే పాటకు చెల్లెల్లాంటి పాటలా ఈ 'చుమ్మా చుమ్మా' పాటను చక్రి తయారు చేశాడనిపిస్తుంది.

భాస్కరభట్ల రాసిందే మరోపాట - 'తళుకు తళుకు తళుకు'ని రఘు కుంచె, హాయ్‌రబ్బా స్మిత పాడేరు. ఇది కూడా మాస్ ఓరియెంటడ్ సాంగే! ట్యూన్‌కు సరిపోయేలా భాస్కరభట్ల రవికుమార్ చేసిన పద విన్యాసం ప్రశంసించ దగ్గదే. కానీ అర్థం, భావం విషయంలో కొస్తే మాత్రం ఏ ఉద్దేశంతో ఇటువంటి పద విన్యాసాలు ఆయన చేశాడో ఈ సమీక్షకుని అర్థంకాని విషయమే! 'ధడకుడడా / తలుపుగడా / అదిరిపడే ఎడాపెడా/ పెరుగువడా / చెరుకుగడా / జమాజమారే' అంటే ఏమిటో కొంచెం వివరిస్తేనే తప్ప అర్థ మయ్యేట్టులేదు.

ఏదిఏమైనా ఇది చక్రికి, భాస్కరభట్లకి మంచి బూమ్ పీరియడ్. సాధారణంగా ఎవరి సక్సెస్ టైమ్‌లోనైనా ఇటువంటి ప్రయోగాలు తమాషాగా జరుగుతూనే వుంటాయి. ఇదీ అంతే.... అటువంటిదే! ■


మూడుముక్కలాట - బాలరాం
ఏమండీ! మిమ్మల్ని ఎవరన్నా ఏమన్నా అంటే నేను భరించలేనండీ...!
నేనంటే నీకెంత ప్రేమ కాంతం!!
ప్రేమా.. పాడా! మిమ్మల్ని అంటే నేనే అనాలి... వేరే వాళ్లకా ఛాన్సెందుకిస్తాను!
ఈవిడే నా భార్య... నా ప్రాణం...
నేనంటే మీకు ఎంత ప్రేమండీ... ఎంత మంచి భర్త మీరు!
ఆగు... నన్ను పూర్తిగా చెప్పనీయ్... 'ఈవిడే నా భార్య నా ప్రాణం తీసేది కూడా ఈవిడే'!
ఏమండీ మీరు ఆర్టిస్టు కదా... మంచి డిజైన్‌తో నాకు గోరింటాకు పెట్టరూ!
భర్తలలోని కళను మెచ్చుకున్న ఏకైక భార్యవి నువ్వే డియర్...
అయ్యయ్యో! వంటచెయ్యడం మరిచాను... ఈ పూటకు మీరు చెయ్యరూ!!



మే 7 ఆత్రేయ జయంతిని పురస్కరించుకుని...

# కొమ్మ కొమ్మకో సన్నాయి...





# ఆత్రేయ తీపి గురుతులు

ఆత్రేయ నా ప్రాణం.
నా సొంత మనిషి - వింత మనీషి - ఋషి .
ఆయన జీవిత ధోరణి అందరికీ అర్థం కాదు.
ఆయన పాట ఎందరికో అర్థమయ్యేది.
ఆత్రేయ కవిగా జీవించాడు. మనిషిగా రాశాడు.
ఒక జీవితకాలం పాటు తన గుండె గుట్టుగా చేసిన
చప్పుళ్లే
ఆత్రేయ పాటలు.
తలుపు మూసిన ప్రేయసి తలవాకిట నిలబడి
పిలిచి పిలిచీ బదులే రాక అలసి తిరిగి వెళ్లిపోయిన
తీరని దాహార్తి ఆత్రేయ మానసకామూర్తి.

చలించడం, కనులు చెమరించేటట్లు గుండె ద్రవించడం నిజమైన కవికి జీవ లక్షణం. ఏ పాట విన్నా అది ఎవరు రాసినా అందులో ఆర్ద్రత వుంటే దానికి దాస్యం చేశాడు ఆత్రేయ. ఎక్కడో విజయాగార్డెన్స్‌లో రికార్డింగు జరుగుతోంది. అది 'పండంటి జీవితం' చిత్రానికి చెందిన పాట. ఎందుకో అటువెళ్లాడు ఆత్రేయ. పల్లవి విన్నాడు - అంతే ఎక్కడో జెమిని రికార్డింగ్ థియేటర్‌లో వున్న ఆ రచయితను వెతుక్కుంటూ వచ్చి జుట్టు పట్టుకుని తలవంచి నెత్తిని ముద్దు పెట్టుకుంటూ 'ఎంత చక్కని పల్లవి రాశావురా... ఎంత బాగుందిరా' అని చటుక్కున తిరిగి కారెక్కి వెళ్లిపోయాడు. ఇంతకీ ఆ పల్లవిలో పెద్ద విశేషం ఏమీ లేదు. అయినా ఆత్రేయకి నచ్చింది కనుక ఆ పల్లవి గొప్పది.

'అంతులేని అనురాగం అన్నగా
చెల్లిపోని మమకారం చెల్లిగా
దీవించనీ నిన్ను అమ్మగా నాన్నగా వెరసి మీ అన్నగా'

ఇదే ఆ పల్లవి. ఈ పల్లవి ఆత్రేయకి చాలా రోజులు జ్ఞాపకం ఉండిపోయింది - ఎందుకంటే అనేక సార్లు మళ్లీ అదే ప్రస్తావన తెచ్చి 'వెరసి' అన్నావు చూడు... ఆ మాట అక్కడ పడడం మాత్రం నీకే చెల్లిందిరా అనేవాడు.

ఒకసారి రాజమండ్రిలో రాఘవేంద్రరావు గారు 'త్రిశూలం' షూటింగులో వుండి అక్కడకు వేరే పనిమీద వెళ్లిన నాకు ఆ చిత్రంలో ఆత్రేయ రాసిన పాటలు పెట్టి వినిపించారు. వింటుంటే నాలో కలుగుతున్న స్పందన ఆయన గమనించి 'ఇమోషనల్ అవ్వకండి గురువుగారూ అన్నారు. ఆనాడు నేను ఆత్రేయ మహాజ్ఞాని అనీ ద్రష్ట అనీ తెలుసుకున్నాను. 'నా నృషిః కురుతే కావ్యం' అని లాక్షణికులు ఎందుకన్నారో తెలిసివచ్చింది.



నేను సినిమా రచనా రంగంలోకి రాకముందు ఆంధ్ర సచిత్ర వార పత్రికలో సబ్-ఎడిటర్‌గా ఉండేవాడిని. ఆ రోజుల్లో అంటే 1962 ప్రాంతాలలో ప్రతీ సాయంత్రం గురుదేవులు శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి గారి వద్ద అనేక మంది పెద్దలతో పాటు నేనూ కూర్చుని ఆశువుగా ఆయన నోట వెలువడే సాహితీ. మర్మాలనీ, సాంఘిక సాంప్రదాయిక సత్యాలనీ ఈ రెంటి సమన్వయం సాహిత్యంలో ఆధునిక యుగంలో ఎలా ప్రతిబింబించిందీ (సినీ సాహిత్యంతో సహా) వింటూ వుండేవాడిని - అటువంటి అనేక సందర్భాలలో ఆయన ఆనాడే ఆత్రేయ ప్రస్తావన తెచ్చేవారు. అర్ధాంగి చిత్రంలో 'వద్దురా కన్నయా ఈ పొద్దు ఇలువిడిచి పోవద్దురా' అనే పాటని ఆయన ముద్దులాడుతూ మురిసిపోయేవారు. 'పట్టు పీతాంబరము మట్టిపడి మాసేను పాలుగారే మోము గాలికే వాడేను' ఇత్యాది తేనె తెనుగు మాటలకు శాస్త్రి గారు అబ్బురపడేవారు కూడా. ప్రతిభాశాస్త్రి గారు 'జయభేరి' చిత్రం తీస్తున్న రోజులవి. తనను అందులో ఒక పాట రాయమని అడగవచ్చిన నిర్మాతను 'ఇది ఆత్రేయ చేత రాయించండి... బాగుంటుంది' అని చెప్పడం నాకు గుర్తు. ఒకసారి ఆత్రేయ ఏదో చిత్రానికి (బహుశా తన చిత్రమే కాబోలు) మల్లాది వారి చేత పాట రాయించి డబ్బు యివ్వబోతే తరువాత నాకే ఖర్చు చేద్దువు గాని నీ దగ్గరే ఉంచు' అనడం జరిగిందట. శాస్త్రి గారు దేహాన్ని చాలించిన రోజున దుఃఖ విహ్వాలుడై ఆత్రేయ పసిపిల్లవాడిలా విలపించిన సంఘటన మరపురానిది.

ఆ రోజుల్లోనే రామారావు దేవిక నటించిన 'పెండ్లిపిలుపు' చిత్రం షూటింగు జరుగుతూ వుండేది. నిర్మాత డి.బి.నారాయణ మాకు దూరపు బంధువు. ఆ చిత్రానికి దర్శకత్వం వహించిన ఆమంచర్ల శేషగిరిరావు నాకు ఆప్తమిత్రుడు. రచయితలు చాలా మంది మారి డైలాగులు, కథ కూడా 'నానా గోత్రేభ్యః'గా తయారయింది. నాచేత కొంతవర్కు చేయించారు. కొన్ని సన్నివేశాలు రాయడం అంతకుముందు ఏమాత్రం అనుభవం లేని నాకు ఇబ్బందికరంగా తోచింది. ఆత్రేయను పిలిపించి నేను రాసిన డైలాగులు చూపించారు. కొన్నిటిని ఆత్రేయ మార్చి రాశాడు. అందులో ఒకటి - 'మనసివ్వలేని మగడితో కన్నీటి కాపురం చేయడం ఎంత అబలకైనా అసాధ్యమే' యతిప్రాసలు డైలాగులకూ అవసరమే. అదే డ్రామా - అన్నాడు ఆత్రేయ ఆ సందర్భంలో -

విశాల లోకపు సర్కస్ చూడడానికి టికెట్ లాగా డబ్బు మనిషికి ఈ లోకంలో అవసరం. ఆ టికెట్ లేనిదే ఏమీ చూడలేము, చెయ్యలేము, అనుభవించలేము, ఒక్కమాటలో బ్రతకనూలేము, చచ్చిపోనూలేము. ప్రాణవాయువును కూడా సిలిండర్ పంజరాలలో బిగించి అమ్ముకునే ఆస్పత్రులలో డబ్బున్న వాడికే బ్రతికే హక్కు, అవకాశం వున్న రోజులివి. తెలుగు పాటకీ మాటకీ, నాటకానికీ తన ప్రాణాన్ని ధారపోసిన ఆత్రేయకీ చివరికి ఆక్సిజన్ అవసరమైంది. అది లభించే సమయానికి ఆత్రేయకు విరక్తి కలిగింది. ఈ ధన పంజరం నుంచి ఆత్రేయ కవితా విహంగమై విముక్తుడై ఆంధ్ర వాఙ్మయాకాశంలోకి ఎగిరి వెళ్లిపోయాడు. గ్రహణాలూ, అమావాస్యలు ఎన్నో అనుభవించి అవి రెండూ లేని తారగా మిగిలిపోయాడు.

పుట్టుక, చావు అనే 'ఈ రాకపోకల సందున వున్నది రంజైన ఒక నాటకము.. అది అంతా ఎందుకుగానీ అనుభవించి పోనీ జీవిని అనుభవించి పోనీ' అని ఎన్నడో 'అర్ధాంగి' చిత్రంలో ఆత్రేయ రాసిన పాట. లోకాన్ని డోంట్ కేర్ అని నాకింకా లోకంతో పని ఏముంది అని నిలదీసిన నిలువెత్తు పొగరు ఆత్రేయది.

'మనసు గతి యింతే
మనిషి బ్రతుకింతే
మనసున్న మనిషికీ
సుఖము లేదంతే'

అని రాసినప్పుడు దర్శకుడు శ్రీ కె.యస్.ప్రకాశరావు (ఆత్రేయను పాటల రచయితను చేసిన విజ్ఞుడు) ఆ చివర అంతే ఎందుకు? ప్రాసకోసమా అని అడిగారట - దానికి ఆత్రేయ 'అదంతే' అని ఖండితంగా చెప్పి 'అదంతే' అని నిరూపించాడు. దృఢాభిప్రాయం, ధృతి గల రచయిత ఆత్రేయ.

పంచరంగుల ప్రపంచానికీ, నవ్తవర్ణాల జీవితాకాశానికి, నవరసాల జీవితానికి వ్యాఖ్యాత ఆత్రేయ - ఏ శ్రీశ్రీ వ్రాశాడో ఈ పాట అనుకునే గీతాలు రాసింది ఆత్రేయ. 'కారులో షికారుకెళ్లే పాలబుగ్గల పసిడి చాన బుగ్గ మీద గులాబి రంగు ఎలా వచ్చెనో చెప్పగలవా' ఈ పాట చాలదా ఉదాహరణకి - అజరామరమైన అనేక గీతాలు, లక్షల రూపాయలు నిర్మాతలకు అర్జించి పెట్టిన ఖజానా గీతాలు, అక్షర లక్షలు చేసి అందరినీ అలరించిన అందమైన అచ్చ తెలుగు గీతాలు, వేదాంత గీతాలు, సిద్ధాంత ప్రాతిపదికలైన గీతాలు ఎన్నో రాసిన ఆచార్యుడు, మాకు గీతాచార్యుడు ఆత్రేయ! 'హర్తుర్యాతి నగోచరం' ఆయన గీతాక్షరం!

ఆత్రేయ మాటలు, పాటలు ఎన్నో రాసి ప్రేక్షకులను, రాయక నిర్మాతలను ఏడిపించాడు. నేను సినీ రంగంలో ప్రవేశించిన తొలినాళ్లలో నన్ను మాటలు అన్నాడు. ఏం తొందరొచ్చిందని వచ్చావయ్యా... ఇంకాముందు ఎంతో భవిష్యత్తు పెట్టుకుని... ఎడాపెడా రాసి పారేస్తున్నావట. చాలా స్పీడుగా రాస్తున్నావట... ఇత్యాదిగా ఆ కవికుల గురువు ప్రచ్ఛన్నంగా దీవిస్తుంటే అనలేక అనలేక ఒకనాడు 'గురువుగారూ మీ అంత గొప్పగా ఎలాగూ వ్రాయలేను - మీ కన్నా తొందరగానైనా రాయకపోతే నా బ్రతుకు తెరువు ఎలాగండీ' అన్నాను. ఆయన మనసు కరిగి కళ్లలో మెరిసింది.

అటు తరువాత తిరుపతిలో ఒక కవి పండిత సభలో ప్రసంగం మధ్యలో నా వైపు తిరిగి 'నీ ఆరోగ్యం గీత, తెలుగు సినిమా పాట ఆయుష్యం గీత నీ చేతిలో వున్నాయి. నిన్ను మందలించే అధికారం, అవసరం నాకున్నాయి' అని గంభీరంగా తర్జని నా వైపు ఎక్కుపెట్టి హెచ్చరించిన పెద్దదిక్కు ఆనాడు నాకు ఆత్రేయ.

సన్నజాజుల మాలలల్లినట్లు అలతి అలతి తెలుగు పదాలతో పాటలు రాసిన ఆత్రేయలో నాకు కవితా ప్రపంచరవి తిక్కన దర్శనమిస్తాడు. ఆ

శైలి ప్రాక్తన వాసనాజన్యమైన కవితాశక్తికి అభివ్యక్తి తప్ప మరొకటి కాదు. తమిళంలో కణ్ణదాసన్, హిందీలో శైలేంద్ర అటువంటి మహాగురువులు, ఆత్రేయ వంటి మహాకవి సరసన, చరణ సన్నిధానాన, సమకాలీన సహ జీవితాన పాతికేళ్ల పాటు ప్రాణ వాయువులు పీల్చుకున్న నా జన్మ చరితార్థం.

ఆత్రేయ మాత్రమే అనగలిగిన మాటలు అనేకం పాటలలోను ఆయన రాసిన మాటలలోనూ కనిపించి గుండెను పిండేస్తాయి. ఆయన రాసిన మాటలు వినగానే ఆయన హృదయ పరిపాకానికి తలవంచి నమస్కరిస్తాము. 'కన్నీళ్లే మనిషిని బ్రతికించగలిగితే అవికూడా అమృతంలాగే కరువయ్యేవి'-అన్నాడు ఒక చిత్రంలో ఆత్రేయ. ఆయనలో బడదీదీ దేవదాసు నవలను రచించిన తాత్వికుడు శరత్‌చంద్ర ఛటర్జీ మనకు కనిపిస్తాడు. ఆత్రేయ మంచి మాటకారి. చమత్కారం ఆయన తోబుట్టువు. కథా రచనలో ట్విస్ట్ అనే ప్రయోగానికి ప్రాణ ప్రతిష్ట చేసిన ఓ హెన్రీని తలపిస్తాయి ఆత్రేయ మాటలు, పాటలూ కూడా. 'నీ వొస్తావని దారి పొడుగునా ఎడదను పరిచాను. నీవు రాకే -అడుగు పడకే నలిగిపోయాను.' హృదయం నలగడం అంటే అంతకన్నా ఏముంటుంది. కానీ ఆ లోతైన అనుభూతిని గీతస్థం చేయడం మాత్రం అందరికీ సాధ్యం కాదు. కవిత్వాంశకు పరమావధి ఆత్మానుభూతిని వెల్లడించడం కాదా! అందుకే ఆత్రేయ మహాకవి.



ఇక ఆయనతో నాకుగల అనుబంధంతో వృత్తిపరమైనవి ఒకటి రెండు సందర్భాలు చెప్పక తప్పదు. మాట తప్పడం నేరంగా పరిగణించే లోకంలో ఆత్రేయ ఆ నేరాన్ని ఎంత అందంగా ముద్దొచ్చేటట్లు చేసేవాడో ఆయన సన్నిహితులకు బాగా అనుభవం. ఒకసారి అట్లూరి పూర్ణచంద్రరావుగారి చిత్రం...పేరు జ్ఞాపకం లేదు...మాటలు, పాటలు ఆత్రేయ అని ఖరారు చేసుకుని ముహూర్తం పెట్టుకున్నారు. పాటల రికార్డింగు విజయా డీలక్సు థియేటర్‌లో -దర్శకుడు జి.రామమోహనరావు -పెద్దలందరినీ పిలిచారు- తెల్లవారితే ముహూర్తం-పాటలేదు. ఆత్రేయ రాసి ఇవ్వలేదు. విపరీతమైన టెన్షన్. ఉద్రేకాలు అణుచుకుంటూ దర్శకుడు, మిగతావారు నాదగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చారు.'మేం పొరపాటు చేశాం...పెద్ద మనసుతో మీరు ఈ ముహూర్తం జరిపించాలి'-సారాంశం యిది. నేను ఒక షరతు విధించాను. 'ఈ ఒక్కపాట మాత్రమే నేను రాయడానికి ఆత్రేయ అంగీకరించాలి. ఆ విషయం నాకు ఆయన ఫోన్ చేసి చెప్పాలి - ఇందుకు మీరు నాకు ఇచ్చే పారితోషకం ఆయనకే ఇవ్వాలి. అది ఆయనకు ముట్టినట్లు నాకు చెప్పాలి. ఇది నేను గురువుగారు ఆత్రేయ గారి కోసం, ఆయనపై భక్తితో చేస్తున్నదని మీరు గ్రహించాలి'-అన్నాను. పాట రికార్డింగు జరిగిపోయింది. ఆ రాత్రి నేను ఇంటికి వెళ్లేసరికి మా శ్రీమతి నాతో చెప్పిన విషయం -'ఆత్రేయ గారు ఫోన్ చేసారు, అమ్మా చూశావటమ్మా మీ ఆయన ఎంత పని చేసాడో - నేను మనస్సు సరిగా లేక పాట రాయలేకపోతే ఆ పాట తను రాసి నా మాట దక్కించాడు. ఆ పాట తాలూకు డబ్బూ నాకే పంపించాడు. వాడు నా కన్న బిడ్డలాంటి వాడమ్మా. రేపు శుక్రవారం నీకు తండ్రిగా పట్టుచీర తెచ్చి ఇస్తాను. నీ చేత్తో పట్టెడన్నం తిని వెడతాను -అంతకన్నా ఏం చేయగలను-ఇదీ ఫోను"-అని చెప్పింది. 'పట్టుచీర' ప్రమేయం వద్దు మీరు తప్పక భోజనానికి రండి. మా తండ్రిగారు వచ్చినంత సంతోషిస్తాను' అని కూడా అన్నదట.

ఆ తరువాత ఆ శుక్రవారం వచ్చింది,వెళ్లింది. పరంపరగా అనేక శుక్రవారాలు వచ్చాయి. కానీ ఆత్రేయ రాలేదు. 'ఆత్రేయగారు అంతగా చెప్పారు రాలేదేమండీ' అని ప్రశ్న...'వస్తే ఆత్రేయ కాదుగనుక' ఇదీ సమాధానం. నిలిచిపోయే మాటలు ఎన్నో రాసిన ఆత్రేయ తన మాటను నిలబెట్టుకున్న సందర్భాలు తక్కువ. జీవితం తనతో కలిసిరాక లేదా జీవితంలో రాజీపడలేక ఆత్రేయ ఇతరుల విమర్శలకు గురి అయి వుంటాడన్నది నిజం.

ఆత్రేయ స్వగ్రామం మంగళంపాడు. మద్రాసు నుంచి కారులో వెడితే గంట కూడా పట్టదు. సినీ పూర్వ జీవనం చిత్తూరులో - కిళాంబి నరసింహాచార్యులుగా జీవిత చరిత్ర అంతవరకే ఆయనకు వర్తిస్తుంది. కానీ ఆత్రేయగా ఆయన జన్మస్థలం మనసు అనే మయసభ... విస్మయసభ... మాయామహల్ - ఆయన ఉద్యోగం తెలుగుతల్లికి గీత మాలికలతో అలంకారం చేయడం. మనసు అనే మాయ పంజరంలో కొట్టుమిట్టాడే మనిషి అనే విహంగానికి రెక్కలు నిమిరి విముక్తి ద్వారం తెరవాలని తాపత్రయపడడం.

ఎన్నో మమతా బంధాల నుంచీ బాధల నుంచీ బయటపడబోయి వాటిలో కూరుకుపోయి అలమటించడం ఆత్రేయ జీవితం - చెరలోనే విడుదల అనుభవించిన మమకారాల ముద్ద ఆత్రేయ. ఇవన్నీ విడమరచి చెప్పాలంటే తెలుపునలుపుల్లో ఆత్రేయ జీవిత చిత్రం చూడకతప్పదు.

"ఎదమెత్త నౌటకై సొదగుందరా - నీ
మదిగల అహమ్మెల్ల మాసిపోవునురా"

అన్న బసవరాజు అప్పారావు గీతం ఆత్రేయ జీవితానికి ఛాయాచిత్రం.

రాయగలిగినవి, రాయలేనివి, పరిస్థితులను, పరిమితులను మన్నించి రాయకూడనివి ఎన్నో ఒక మహావ్యక్తితో వున్న అనుబంధంలో వుంటాయి. ఈ అన్నిటా మేరు శిఖరమై గోచరించే వ్యక్తిత్వం ఆత్రేయ మహర్షిది. 'అభిలాష' శత దినోత్సవ సభ మద్రాసు తాజ్ కోరమాండల్ హోటల్‌లో ఘనంగా జరుగుతున్నప్పుడు నన్ను విడిగా పిలిచి దగ్గర కూర్చోబెట్టుకుని ఆత్రేయ నాకు బోధించిన గీతా వాక్యాలు లక్ష్మణ గీతలుగా ఏనాడో గుర్తించాను.

అంతా మట్టేనని అదీ ఒక మాయేనని తెలిసి వలచి విలపించడం ఎంత తీయనో ఈ నాలుగు అశ్రుకణాక్షరాలే మీకు విన్నవిస్తాయి.

ఆత్రేయ పోయిన రోజున నేను విశాఖపట్నంలో 'చాలా అర్జంటు... రేపే రికార్డింగు' బాపతు పాటలు రాస్తున్నాను. ఒక రోజు ఆత్రేయ పరమపదించినట్లు మా నిర్మాతలకు ఫోను వచ్చింది. అయితే ఆ వార్త నాకు చెప్పకుండా గుట్టుగా వుంచి సాయంత్రం 4 గంటలకు చెప్పారు. అప్పటికి వారి పాట పూర్తయింది. ముందుగా తెలిసివుంటే చివరి చూపుకైనా వెళ్లివుండేవాడినే అనే పల్లవితో మూగకన్నీటి పాట ఒకటి అలేఖ్యంగా వినిపించసాగింది. అందుకే ఆత్రేయ మెచ్చిన నా పాట

ఎవరికెవరు ఈ లోకంలో
ఎవరికి ఎరుక
ఏదారెటుపోతుందో
ఎవరినీ అడుగక

- ఆయన నాతో యిప్పటికీ అంటున్న మాటగా వినిపిస్తూ వుంటుంది. ప్రాచీన ఆంధ్ర సారస్వతరంగంలో శ్రీనాథుడు, అధునాతన భారత రాజకీయ రంగంలో ఆంధ్రకేసరి ఎటువంటి వారో సినీ నాటక సాహితీ రంగంలో ఆచార్య ఆత్రేయ అటువంటివారు.

ఎంత రాసినా రాయలేని రత్నగిరి రహస్యాల గని ఆత్రేయ జీవన వాహిని! ఈ వ్యాసం కూడా ఆయనకు స్మృత్యంజలి ఘటించడానికి వెలువడిన 'అర్థోక్తి' మాత్రమే. ఇక మిగిలినవన్నీ ముద్దబంతి పూవులు, మూగకళ్ల ఊసులు ఎదలఎనక బాసలు - అంతే... అవి ఎప్పటికీ అంతే.

ఆంగ్ల మహాకవి లాంగ్‌ఫెలో అన్నట్లు కాలమనే ఇసకదారిలో కాలి గురుతులెన్నో... అందులో ఈ కాలిగురుతు ఆత్రేయుది అని తెలుసుకోగలిగిన మనసు నాకుంది. ఇది కూడా ఆయన ఆశీర్వచన ఫలితమే.

తెలుగు జాతికి మనసైన పాట ఆత్రేయ. మనసులా, మనసైన ఆ పాటలా ఆత్రేయ శాశ్వతుడు.

కొమ్మకొమ్మకీ ఓ సన్నాయి ఉండవచ్చు. కానీ తెలుగుజాతి పట్టుగొమ్మ అయిన పాటలమ్మకి ఒక్కటే సన్నాయి... ఆ సన్నాయి పేరే ఆచార్య ఆత్రేయ.

**- వేటూరి సుందరరామ్మూర్తి**

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



ఇలపావులూరి మురళీమోహనరావు

5

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





## జరిగిన కథ

వెంకట్రావు, సుందరి ఇంట్లో ఓ ఎలుక దూరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన కేకును వాళ్ళ పాప అనూహ్య పొరపాటున రుచి చూస్తుంది. దాంతో కంగారుపడి డాక్టరుకు, ఉత్తుత్తి టెస్టులకు పదిహేనువేలదాకా ఖర్చవుతుంది. పిల్లిని పెంచితే మంచిదంటుంది సుందరి. (ఇక చదవండి)

పేషెంట్ అదిరిపడేదెపుడు?
'రక్తాన్ని చూస్తే నాకు కళ్ళు తిరుగుతాయి. కనుక మీ రక్తాన్ని మీరే తీసివ్వండి'
అని సిస్టర్ చెప్పినపుడు.
ఇలాంటివెన్నో ఉన్నాయి ఈ సీరియల్‌లో...

## ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఆఫీసులో ఫ్రెండు గోపాలంతో-

"మంచి పిల్లొకటి కావాల్రా"

"పిల్లా...దాన్నేం చేసుకుంటావురా?"

"పెంచుకుందామని"

"అదేమైనా కోడా?మేకా? బాగా పెంచుకుని చుట్టాలొచ్చిన రోజు కోసుకు తిండానికి! కుక్కను పెంచుకునే వాళ్ళను చూశాను. ఆవును, గేదెను పెంచుకునే వాళ్ళను చూశాను. పెంచుకోడానికి పిల్లి కావాలన్న వనిలేని వాడిని నిన్నే చూస్తున్నాను."

"ఏడిశావులే వెధవ జోకులు. ఇంట్లో ఎలుకొకటి చేరి నిద్రలేకుండా చేస్తున్నది."

"ఎలుక చేరితే ఏదైనా మందు పెట్టు"

"పెట్టాం. ఆ మందును మా అమ్మాయి తిని హాస్పటల్లో చేరి నానా గోలై పదిహేనువేలు వదిలాయి"

"అయ్యయ్యో...ఎంత పనైంది. అయితే ఒక పని చెయ్"

"ఏంటది?"

"ఎలుకలబోను ఒకటికొని ఇంట్లోపెట్టు. ఆ బోనులో ఏదైనా పండు ఉంచు. నేరుగా వెళ్ళి బోనులో పడుతుంది."

"అంత సులభంగా పడుతుందా?"

"చచ్చినట్లు పడుతుంది."

"పడ్డ తరువాత ఏంచేయాలి?"

"ఏంటా పిచ్చి ప్రశ్నలు? ఊరిబయటకు తీసికెళ్ళి వదిలేసిరా"

"అయిడియా బాగుంది. సాయంత్రం ఇంటికెళ్ళేటపుడు తీసుకెళ్తాను."

బస్టాండుకు వెళ్ళగానే బయలు దేరడానికి సిద్ధంగా ఉన్న బస్సు కనిపించింది వెంకట్రావుకు.

గబగబా పక్కనే ఉన్న షాపులోకి పరిగెత్తాడు వెంకట్రావు.

"ఏం కావాలిసార్" అడిగాడు షాపువాడు.




"తొందరగా ఒక ఎలుకల బోనివ్వండి. మా కాలనీ బస్సు వెళ్ళిపోతుంది. క్విక్." అన్నాడు వెంకట్రావు.

"సారీ సార్...బస్సులు పట్టేంత బోన్లు మా షాపులో లేవు" చెప్పాడు షాపతను.

చిర్రెత్తింది వెంకట్రావుకు.

"బస్సును పట్టుకోడానికి కాదయ్యా. ఎలుకను పట్టుకోడానికి"

"అదైతే ఉందండీ! నలభై రూపాయలు. ఇందు" ఇస్తూ చెప్పాడు షాపువాడు.

బోనును తీసుకుని హుషారుగా ఇంటి కొచ్చాడు వెంకట్రావు.

"పిల్లి దొరకలేదా బోనును తెచ్చారు?" అడిగింది సుందరి.

"ముందు దీంతో ప్రయత్నించమని సలహా ఇచ్చాడు గోపాలం. చూద్దాం" చెప్పాడు వెంకట్రావు.

బోనులో అరటి పండు పెట్టి హాల్లో పెట్టారు.

తెల్లవారిలేచి చూస్తే దాన్లో నాలుగు బల్లులు కనిపించాయి. వాటిని చూడగానే వళ్ళు జలదరించింది ఇద్దరికీ.

"ఊ...ఈ బల్లులను తీసుకువెళ్ళి ఊరిబయట వదలిపెట్టరండి" నవ్వుతూ చెప్పింది సుందరి.

నవ్వాడు వెంకట్రావు.

డికాక్షన్ వేద్దామని కాఫీపొడి డబ్బా తియ్యగానే దభాల్న మీదకు దూకింది ఎలుక. కప్పు కూలిపోయేలా అరిచింది సుందరి.

అకస్మాత్తుగా ఒక జీవి మీదకు దూకేసరికి వెంకట్రావుకు కూడా వళ్ళు జలదరించింది. అలమరలో ఉన్న అప్పడాల ప్యాకెట్టు, రకరకాల పిండి ప్యాకెట్లు కొరికి పారేసింది ఎలుక.

"ఛి...ఛీ...ఇవన్నీ నాశనమై పోయాయి. పనికిరావు. బయట పారబొయ్యండి" అన్నది సుందరి.

ఏడుపు మొఖంతో మొత్తం బయట పారేశాడు వెంకట్రావు.

"లాభం లేదురా గోపాలం. ఎన్నాళ్ళని నా కన్నులు కాయగ ఎదురు జూతురా గోపాలా" పాట అందుకున్నాడు వెంకట్రావు ఆఫీసులో మర్నాడు గోపాలం రాగానే.

"ఏమైందిరా?" నవ్వుతూ అడిగాడు గోపాలం.

"మా ఎలుక బోనులో పడటంలేదు. ఆఖరుకు పాతగుడ్డలు కూడా కరకరా




"లంచం తీసుకుంటుండగా ఏసీబీ వారికి పట్టుబడ్డావుగా? ఎలా వచ్చావు బయటకు?" అడిగాడు పాపారావు
"సింపుల్... లంచమిచ్చి" చెప్పాడు రామారావు.
ఇలాంటి బాపతు వారు ఈ సీరియల్‌లో దర్శనమిస్తారు.

నమిలేస్తున్నది."

"తొందర పడకూడదు. బోనును ఆ ఎలుక చూడాలి కదా"

"లాభం లేదురా. ఎక్కడైనా మంచి పిల్లిని చూడరా"

"పిల్లిని పెంచాలని నువ్వు ఎందుకంత తొందర పడుతున్నావో నాకు అర్థం కావడంలేదు. పిల్లి మహా నికృష్టజంతువు. ఎన్నో జన్మల పాప ఫలితంగా పిల్లి జన్మ ఎత్తుతారని పెద్దలంటారు"

"వాళ్ళకేమోయ్ ఎన్నైనా అంటారు. మరి వాళ్ళనొచ్చి ఎలుకను పట్టుకోమని చెప్పు"

"అద్సరే. పెట్టిన చేతినే కరవడం పిల్లి లక్షణం. అది పాలు తాగుతుంది పెరుగు తింటుంది. అదే నోటితో మాంసాన్ని తింటుంది."

"ఆహా...మరి నువ్వు? కాఫీ తాగిన నోటితోనే చికెన్లు మింగడంలా? భగవంతుడు జీవులకు ఒకటే నోరిచ్చాడు. శాకాహారానికో నోరు, మాంసాహారానికో నోరూ లేవు గదా?"

"కాదురా అది పచ్చి మాంసం తింటుంది"

"మరి పచ్చి మాంసం తినక! మసాలాలు వేసి వండిపెట్టడానికి దానికేమైనా భార్యా సంసారం లాంటి ఉన్నాయా? ఊరికే నసవాగుడు కట్టిపెట్టి పిల్లి దొరికే మార్గం చూడు"

"అలాగే చూద్దాం. మరో రెండు రోజులు ఓపిక పట్టు. ఈ లోపల మంచి పిల్లి కోసం అన్వేషణ సాగిద్దాం"

"అలా అన్నావు బాగుంది"

"ఎలుకకు మాంఛి ఎర్రని యాపిల్స్ అంటే చాలా ఇష్టం. అందుకని ఈ రాత్రి మంచి యాపిల్నొకదాన్ని దాని పంజరంలో పెట్టు. పడుతుందేమో చూద్దాం."




"ఓ యస్...అలాగే...ఇవాళే మంచి కాశ్మీర్ యాపిల్స్ పట్టుకెళ్తా." లేస్తూ అన్నాడు వెంకట్రావు.

* * *

నాలుగు రోజులు గడిచినా ఎలుక బోనులో పడలేదు. ఇంట్లోని బట్టలు, పుస్తకాలు కొరికి పారేస్తున్నది.

"ఈ ఎలుకలు కూడా తెలివి మీరి పోయాయి. నా ఉద్దేశంలో బోనులో ఒకసారి దూకితే బయటకు రాలేనని దానికి అర్థమై ఉంటుంది. ఏ గదిలో పెట్టినా అది బోనులో పడటం లేదు." అన్నాడు వెంకట్రావు.

"అది ఇంతకుముందొకసారి బోనులో పడి ఉంటుంది. అందుకే ఈసారి అది బోనులో పడటం లేదు" ఆలోచిస్తూ అన్నది సుందరి.

"బోనులో పడ్డది బయటకెలా వచ్చింది?"

"బోనులో చిక్కితే వీధిలో వదిలేస్తారు గదా. చేతులారా చంపలేం కదా"

"అంతే అయి ఉంటుంది. ఎలుకలు కూడా తెలివైనవని దీన్ని బట్టి మన కర్థమౌతున్నది."

"ఏదైనా యూనివర్సిటీలో చెప్పండి. ఒక సత్యం కనుగొన్నందుకు డాక్టరేట్ ఇస్తారేమో"

"ఈ ఎగతాళిమారి మాటలాపి తరణోపాయం చూడు."

"మొదటే చెప్పాను కదా. పిల్లిని పట్రండి."

"సరే.. ఈరాత్రి చూద్దాం. మర్యాదగా బోనులో పడుతుందా సరే. లేకపోతే రేపు పిల్లిని తెస్తా." అన్నాడు వెంకట్రావు.

ఎర్రని యాపిల్ పండును బోనులో పెట్టి పడుకున్నారిద్దరూ.

తెల్లవారి లేచి చూసేసరికి -

బోనంతా బద్దలు బద్దలై ఉండి పంజరపు తీగలన్నీ తెగిపోయి ఉన్నాయి.

గుండెలు బాదుకుంది సుందరి ఎలుక చేసిన పని చూసి.

"ఇదెక్కడి అఘాయిత్యపు ఎలుక? అవ్వ! ఇనప తీగలను కూడా కొరికి పారేసింది. ఇంకొన్ని రోజులుంటే మనుషుల్ని కూడా తినేట్లుంది" మొత్తుకుంది.

"గత జన్మలో ఇది ఏ టార్జానో అయి వుంటుంది. దీనికి ఇంత బలం ఎక్కడ్నుంచి వస్తుంది లేకపోతే?" అన్నాడు వెంకట్రావు.

"దాని గత జన్మల సంగతి ఇప్పుడు దేనికి? ముందు నా మాట విని పిల్లిని పట్రండి"

"పిల్లిని పట్రండి... పిల్లిని పట్రండి అంటే అదేమైనా రెడీమేడ్ వస్తువా అంగట్లో దొరకడానికి? మంచిపిల్లిని చూడాలి. జాగ్రత్తగా తీసుకురావాలి. ఓపిక పట్టు"

"ఓపికంతా చచ్చింది. ఇప్పటికే ఇంట్లో ఉన్న బట్టలు, సరుకులు హారతి కర్పూరమైపోయాయి. ఇక మిగిలింది మనమే"

"ఒకే ఒకే సాయంత్రం ఎలాగైనా సరే పిల్లితోనే ఇంటికి వస్తాను" స్నానానికి వెళ్తూ అన్నాడు వెంకట్రావు.

సుందరి పెరట్లోకి వెళ్ళింది.

ఆండాళమ్మ పలకరించింది. "ఏంటండోయ్ సుందరిగారూ. మా తమ్ముడేదో పిల్లను తెస్తానంటున్నాడు! వ్యవహారం అంతదూరం వెళ్ళిందా ఏంటి?" అన్నది.



"మాయింట్లో నా మాటకు ఎదురులేదు" మిత్రుడితో చెప్పాడు రమణ.
"అబ్బా... నీ భార్యను ఆ విధంగా ఎలా తయారు చేశావు?" అడిగాడు మిత్రుడు.
"ఏముంది? ఆవిడ అంట్లు తోమమన్నా, ఇల్లు ఊడ్చమన్నా, బట్టలుతకమన్నా 'అలాగే' అంటాను. ఇక నా మాటకు ఎదురేముంది?" రహస్యం విప్పాడు రమణ. అలాంటి జంటతో ఈ సీరియల్‌లో ఏ జంటకు పోలిక వుందో చదివిచూడండి.

## ఎలుక వచ్చె ఇల్లు భద్రం

"పిల్లకాదండీ... పిల్లి...పిల్లి... పిల్లిని తెస్తానంటున్నారు" చెప్పింది సుందరి.

కిసుక్కున నవ్వింది ఆండాళమ్మ.

"బాగుంది దేనికి?" అన్నది.

"పెంచుకుందామని"

"మరీ బావుంది. ఎవరైనా కుక్కను పెంచుకోవడం చూశాను. పిల్లిని పెంచుకుంటామన్న వాళ్ళను మిమ్మల్నే చూస్తున్నాను."

"శాశ్వతంగా కాదండీ. తాత్కాలికంగానే."

"ఇది ఇంకా బాగుంది. ఇన్ని రకాల పెంపకాలుంటాయా ఏంటి?"

"ఇంట్లో ఎలుకొకటి చేరి యమయాతనలు పెడుతున్నదండీ. మందు పెడితే తినడం లేదు. చంపుదామంటే చేతికి చిక్కడం లేదు. దాని పీడ వదిలించుకోవాలంటే పిల్లిని పెంచడమే మార్గం అనిపిస్తున్నది."

"బాగుంది బాగుంది. ఒకవేళ పిల్లితో మీ పని అయితే నాలుగు రోజులు మా యింటికి కూడా పంపండి. మా యింట్లో కూడా ఎలుకలు చేరినట్లు అనుమానంగా ఉంది."

"మహాభాగ్యంగా పంపిస్తాం."

సుందరి అంట్లు తోమడంలో మునిగింది.

"బోను ఉపాయం పనిచెయ్యలేదోయ్." గోపాలంతో చెప్పాడు వెంకట్రావు.

"అదేంటి? బోనులో పడలేదా?" అడిగాడు గోపాలం.

"బోన్లో పడటం సంగతి అటుంచు. అసలు బోనునే కొరికి పారేసింది."

"అసలు మీ ఇంట్లోఉంది ఎలుకా పందికొక్కా?"

"ఎలుకేనోయ్. నేను చూశాను."

"అబ్బా... ఇదేదో జేమ్స్‌బాండ్ టైపులా ఉంది. మరో ఉపాయం చెప్పనా?"

"ఇంకే ఉపాయం వద్దు. పిల్లి దొరికే ఉపాయం చెప్పు. సాయంత్రం వచ్చేటపుడు పిల్లిని తెస్తానని కచ్చితంగా చెప్పా."

"పెళ్ళానికంత భయపడతావేందోయ్?"

"ఏడిశావులే. ఇలా మాట్లాడేవాళ్ళు ఇంట్లో అంట్లు చెంబులు తోముతుంటారు."

"నా ఉద్దేశంలో పెళ్ళానికి భయపడేవాళ్ళు అసలు మగాళ్ళే కాదు. మగాడంటే ఆడదాన్ని కళ్ళతో శాసించాలి."

"పెళ్ళి కాకముందు ప్రతి కుర్ర వెధవా అలాగే అనుకుంటాడు. తన అభిప్రాయాలు తప్పని పెళ్ళి అయిన తరువాత తెలుస్తుంది."

" పిల్లి లేకుండా వెళ్తే మా చెల్లెమ్మ నిన్ను ఇంటికి రానివ్వదంటావు. అంతేనా?"




"అంతే." అన్నాడు వెంకట్రావు.

ఇంతలో తలుపులు తెరుచుకుని బయటకు వచ్చాడు మేనేజర్. స్టాఫంతా ఉలికిపడి ఎవరి పన్లు వాళ్ళు చేస్తున్నట్లు యాక్షన్ చెయ్యసాగారు.

"జంటిల్‌మెన్...మా అంట్ల వెధవ ఉన్నాడా ఎక్కడికైనా చచ్చాడా అని ఒకలేడీ ఫోన్ చేసింది. మీ పేరేంటండీ అనడిగాను. ఎందుకు దండగ? నేను ఫోన్ చేశానని చెప్పండి. వెంటనే రాకపోతే ఇంటికి రాగానే మోకాళ్ళు పగలగొడతాను అన్నది. అంత అథార్టీగా ఒక ఆడది మాట్లాడుతుందీ అంటే అది కచ్చితంగా ఎవరో ఒకరికి పెళ్ళామే అయి ఉంటుంది. ఎవరు? ఎవరా మొగుడు? మీలో ఎవరో వెంటనే లోపలకు వెళ్ళి మోకాళ్ళను రక్షించుకోండి" గంభీరంగా చెప్పాడు.

స్టాఫంతా ఒకరి ముఖం మరొకరు చూసుకుంటున్నారు. నిముషం గడిచింది.

"డోన్ట్ వేస్ట్ మై టైమ్. ఒకే... లోపలకు నేను రాను. మీరే వెళ్ళి మాట్లాడుకోవచ్చు. ప్లీజ్... పెళ్ళాం సత్తా ఏమిటో బాగా ఎరిగినవాడిని. కాబట్టి నేను ఛాన్సిస్తున్నాను. గో అహెడ్..." అన్నాడు మేనేజర్.

(ఇంకావుంది)

**నమస్కారములు**

నా వయసు 65 సం॥లు. అన్ని పత్రికలు చదువుచుంటాను. 'హాసం' కూడా మొదటి నుంచి చదువుతున్నాను. అయితే సీరియల్స్ మాత్రం చదవను. ఎందుకో ఉగాది సంచికలో 'ఎలుకవచ్చె ఇల్లు భద్రం' చదివాను. రచయిత రాసింది అక్షరాలా నిజం. ఎప్పటి నుంచో వ్యాధిగ్రస్తుడనైన నేను చాలాసార్లు ఈ డాక్టర్ల దోపిడీకి గురయినాను. అవసరం ఉన్నా లేకపోయినా అన్ని రకాల పరీక్షలు చేయిస్తారు. అందులో వీరికి తప్పకుండా వాటా ఉంటుంది. అయితే మనకు వారి అవసరం తప్పదు కాబట్టి ఏమీ చెయ్యలేము. ఇది చదివిన తరువాత మొదటి రెండు భాగాలు చదివాను. కథనం, శైలి, నడక బాగున్నాయి. చిన్నవాడో, పెద్దవాడో రచయితకు ఆశీస్సులు, అభినందనలు.

భవదీయుడు
ఎ.నారాయణస్వామి
యూసఫ్‌గూడ, హైదరాబాద్.



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

ఎన్.టి.ఆర్, సావిత్రితో సారథీవారు 1961 లో "కలిసిఉంటే కలదు సుఖం" అనే చిత్రాన్ని నిర్మించారు. ఎలక్ట్రిక్ షాక్ తగిలి కాలు, చెయ్యి వంకర పోయి అవిటితనం సంక్రమించిన వానిగా ఎన్.టి.ఆర్. చూపిన నటనకు ఆంధ్రప్రేక్షకులు బ్రహ్మరథం పట్టారు. ఆ చిత్రంలో "ముద్దబంతి పూలు చుట్టి" వంటి హిట్ సాంగ్‌తో పాటు "మేలిమి బంగరు మెలిక తిరిగినా" వంటి మానవీయ విలువలు కలిగిన పాటొకటి వుంది ఆ పాటకు సంబంధించిన విశ్లేషణ యిది.

తంగత్తిలే ఒరు కుఱై ఇరుందాలుమ్
తరత్తినిల్ కుఱైవదుండో- ఉంగళ్
అంగత్తిలే ఒరు కుఱై ఇరుందాలుమ్ అన్బు కుఱైవదుండో ॥తంగత్తిలే॥
సింగత్తిన్ కాల్‌గళ్ పఱుదు పట్టాలుమ్
సీట్రమ్ కుఱైవదుండో సిందైయుమ్ సెయలుమ్
ఒండ్రు పట్టాలే మాట్రమ్ కాణ్బదుండో ॥తంగత్తిలే॥
కాల్‌గళిల్లామల్ వెణ్‌మది వానిల్ తవళ్‌న్దు వర విల్లైయా ఇరు
కై గళిల్లామల్ మలర్‌గళై అణైత్తు
కాదల్ తరవిల్లైయా?
కాలం పగైత్తాలుమ్ కణవర్ పణిసెయ్దు
కాదల్ ఉఱవాడువేన్ - ఉయర్
మానం పెరిదెండ్రు వాళుం కులమాదర్ వాళ్విన్ సువై కూఱువేన్ ॥తంగత్తిలే॥


'బాగప్పిరివినై' చిత్రంలో
బి.సరోజాదేవి,
శివాజిగణేశన్

'బాగప్పిరివినై' (భాగాల పంపకం) తమిళ చిత్రం కోసం 'కణ్ణదాసన్' రాసిన పాట ఇది. ఈ పాటను పి.సుశీల పాడారు. 'బాగప్పిరివినై' చిత్రాన్ని 'కలసి ఉంటే కలదు సుఖం' పేరిట తెలుగులో నిర్మించినపుడు - ఈ పాట భావాన్నీ, వరసనూ కలిపి తెలుగులో పాడుకున్నారు. తమిళ చిత్రానికి సంగీత దర్శకులు విశ్వనాథన్ - రామమూర్తి. తెలుగు చిత్రానికి సంగీతం సమకూర్చినవారు మాస్టర్ వేణు.

కథానాయకునికి చిన్నతనంలో ప్రమాదవశాత్తు అవిటితనం వస్తుంది. ఆ అవిటితనాన్ని కాక అతనిలోని సుగుణాలను చూస్తుంది నాయిక. లోపాలను చూడక గుణాలను చూడడం సమంజసమంటుంది.

సన్నివేశానికి తగ్గట్టు పాటలు రాయడంలో కణ్ణదాసన్ కొత్త ఒరవడులెన్నో పెట్టారు. అలా సన్నివేశ పరంగా రాసిన పాటలకు కూడా సార్వకాలికమైన ప్రతిపత్తిని కలిగించిన ప్రతిభ కణ్ణదాసన్‌ది. ముందే చేసిన 'ట్యూన్'కు పాట రాసినా సాహిత్య స్థాయి తగ్గకుండా రాయడంలో కణ్ణదాసన్ సమర్థులు.

'బాగప్పిరివినై'లో - భర్త మేలిమిని భార్య ప్రశంసించే పాట భావం ఇది:

"బంగారంలో ఒక కొరత (లోపం) ఉన్నా
మేలిమి తరిగేనా - మీ
దేహంలో ఒక లోపం ఉన్నా ప్రేమ తరిగేనా
సింహం కాళ్ల దెబ్బతిన్నా - దాని
ఉగ్రత తరిగేనా - ఆలోచనా, చేతా
ఒకటయ్యాక మార్పు కలిగేనా?
కాళ్లు లేక తెలిజాబిలి మింట పాకడం లేదా - రెండు
చేతులే లేక పువ్వులను కౌగిలించి
ప్రేమ నివ్వడంలేదా
కాలం పగబూనినా భర్త సేవ చేసి
ప్రేమగా మెలుగుతాను - ఉన్నత
శీలమే గొప్పదని జీవించే కులస్త్రీల జీవితపు రుచిని వివరిస్తాను."

తమిళగీతాన్ని పాడిన పి.సుశీల గారే తెలుగు గీతమూ పాడారు. తెలుగు పాటను రాసిన వారు ఆరుద్ర.

తమిళం పాటలోని కొన్ని అభిప్రాయాలు తెలుగులోకి వచ్చేసరికి మారిపోయాయి. తమిళ గీతంలో సింహపు కాళ్ల దెబ్బతిని చెడిపోయే ప్రస్తావన ఉండగా - తెలుగులో దాని కాళ్లు చిక్కుపడతాయి. ఆలోచనా, చేతా ఒకటే అయిన వారు మార్పు లేకుండా నిలకడగా ఉంటారని తమిళగీతంలోని భావం. తెలుగులో 'చేతలు మాటలు ఒకటే అయితే త్యాగము కరువగునా' అని రూపాంతరం పొందింది.

కాళ్లు లేని జాబిలి నింగిలో పారాడుతూ పాకుతూ వస్తున్నాడనే తమిళ పంక్తిలోని సొగసంతా 'తవళ్‌న్దు' అనే మాటలో ఉంది. అది మామూలుగా పాకడం కాదు. సున్నితంగా పాకడం...

ఆ చంద్రుడికి కాళ్లే కావు చేతులూ లేవు. అయినా ఆ చేతులు లేని చంద్రుడు పువ్వులను కౌగిలించి ప్రేమ పంచుతున్నాడట. తెలుగు పాట కాళ్లు లేని చంద్రుడు చేతులు చాపే కలువను చేరి ముదము కలిగిస్తాడంటుంది.

ఎటువంటి సమస్యలు ఎదురైనా, కాలం తనకు పగ అయినా పతికి సేవ చేసి ప్రేమగా మెలుగుతాననే తమిళ నాయిక - ఉన్నతమైన శీలం కోసమే జీవించే కులస్త్రీల జీవిత మాధుర్యాన్ని తానూ అనుభవించి ఆ అనుభవాన్ని చెబుతానంటుంది. ఆమె తన నిర్ణయమేమిటో స్పష్టంగానే చెబుతున్నది. కష్టాలు వచ్చినా తాను ఎదుర్కొంటుంది. అలా ఎదుర్కొని

భర్తను తన ప్రేమతో మురిపిస్తుంది. ఆమెకు భర్త తప్ప వేరే లోకం లేదు. అందువల్ల శీలానికి విలువనిచ్చే కులస్త్రీల దారిలో తానూ నడిచి ఆ సౌశీల్యం రుచి ఏమిటో చెబుతుంది. తెలుగు పాటలోని చివరి చరణంలో - తమిళ గీతంలోని తెగువ కనిపించదు. తమిళ గీతంలో పతిసేవ అని మాత్రమే ఉంది. తెలుగులో అది 'పతి పాద సేవాభాగ్యము'గా పరిణమించింది. తెలుగు సినిమా నాయిక నోముల గురించీ, నోచడం గురించీ పాడడం ఒక సంప్రదాయం. ('లైలా-మజ్ను' చిత్రంలో అరేబియాకు చెందిన లైలా పాడే విరహ గీతంలోనూ 'ఏ కొర నోములు నోచితినో' అని ఉంటుంది కదా!)

ఒక భాషలో విజయవంతమైన పాటను మరొక భాషలో రాయడంలో చాలా కష్టాలు ఉంటాయి. ఎప్పుడో తప్ప మాతృకను మించే పుత్రిక పుట్టదు! కణ్ణదాసన్ పాటలతో మరొక ఇబ్బంది ఉంది. ఆయన తమిళ ఛందస్సులో నిపుణుడు. తమిళ ఛందస్సును 'యాప్పు' అని అంటారు. అప్రయత్నంగా ఛందోబద్ధంగా పాటల పంక్తులను ఆశువుగా చెప్పి ఆయన సంగీత దర్శకులను అదరగొట్టేవాడు. ఈ పాటలోనూ అటువంటి ఛందో విహారం కనిపిస్తుంది. చివరి చరణంలోని లయను గమనించండి.

కాలం పగైత్తాలుం/కణవర్ పణిసెయ్యు/కాదల్‌ఉఅవాడులేన్ ఉయర్ మానం పెరిదెండ్రు/వాళుం కులమాదర్/వాళ్విన్ సువై కూఱువేన్

ఆరుద్ర-తమిళ గీతంలోని గతికి తగ్గట్టు తెలుగు మాట వరసలు ఎట్లా పేర్చారో తెలుసుకోవడానికి చివరి చరణంలోని పంక్తులు చూడాలి.

"పతి పదసేవా/భాగ్యమునేనే/సతతము నోచితినీ
మీ -
చల్లని మదిలో / సౌఖ్యములాసగే/స్వర్గము చూచితిని."

ఇక - ఆరుద్ర రాసిన పాటను ఒకసారి గుర్తు చేసుకుందాం:



'కలిసిఉంటే కలదు సుఖం' చిత్రంలో ఎన్.టి.ఆర్. సావిత్రి
(ఫోటో కర్టెసీ విజేత)

మేలిమి బంగరు మెలికతిరిగినా - విలువ తరిగేనా?
మీ దేహములో చిరులోపములున్నా ప్రేమ కరువగునా?
సింహము కాళ్లు చిక్కుపడిననూ
శౌర్యము కొరవడునా? - చేతలు మాటలు ఒకటే అయితే
త్యాగము కరువగునా? ॥మేలిమి బంగరు॥
కాళ్లే లేని కమ్మని చంద్రుడు - నిరతము పయనించునే
కరములు చాపే కలువను చేరి
ముదము కలిగించునే ॥మేలిమి బంగరు॥
పతి పదసేవాభాగ్యము నేనే
సతతము నోచితినీ... మీ
చల్లని మదిలో సౌఖ్యములాసగే
స్వర్గము చూచితిని ॥మేలిమి బంగరు॥

-పి.ఎస్.గోపాలకృష్ణ

హాస్యవల్లరి సంగీతలహరి



సీరియల్ 15

# కిశోర్ జీవనఝరి

**- ఎమ్మెస్ స్వాతి**

కిశోర్ అమాయకుడు కాదు, అజ్ఞాని కాదు. లోకంపోకడ తెలిసినవాడే! అయినా ఎందుకీ పోరాటానికి దిగాడు? అదీ ఎమర్జన్సీ ఎన్నాళ్లు నడుస్తుందో తెలియని పరిస్థితిలో? అతనికి రాజకీయ సిద్ధాంతాలేమైనా ఉన్నాయా? అన్న ప్రశ్న సహజంగా ఉద్భవిస్తుంది.

ఎమర్జన్సీని గట్టిగా ఎదిరించిన పార్టీలు రెండు. ఒకటి జనసంఘ్ (మూలసంస్థ ఆర్.ఎస్.ఎస్.తో సహా), రెండు సి.పి.ఎమ్. కమ్యూనిస్టులలో మితవాదులైన సి.పి.ఐ. ఇందిరాగాంధీకి, ఎమర్జన్సీ పాలనకు మద్దతు ఇచ్చింది. కిశోర్ మాతృభూమి అయిన బెంగాల్‌లో సి.పి.ఎమ్.ప్రాబల్యం ఎక్కువ. పైగా అక్కడ అధికారంలో ఉన్న సిద్ధార్థ శంకర్ రాయ్ (కాంగ్రెసు) ఇందిరాగాంధీకి ఎమర్జన్సీ పెట్టమని సలహా ఇచ్చినవారిలో ప్రథముడు. ఎమర్జన్సీ రోజుల్లో రాజకీయ ప్రత్యర్థులను నానాహింసలూ పెట్టాడు. బెంగాల్‌లో ఉన్న అనేకమంది బంధుమిత్రులద్వారా కిశోర్ ఈ విషయాలు వినివుండవచ్చు.

ఇక కిశోర్ పెరిగిన ఖాండ్వా మధ్యప్రదేశ్ లోనిది. అక్కడ ఆర్.ఎస్.ఎస్. ప్రాబల్యం ఎక్కువ. ఎమర్జన్సీ దుష్పరిపాలనకు బాగా దెబ్బతిన్న ఉత్తరాది ప్రాంతాలలో మధ్యప్రదేశ్ ఒకటి. అక్కడి పరిస్థితులు మిత్రులద్వారా విన్న కిశోర్ బహుశా పాలకుల పట్ల ఏహ్యాభావాన్ని పెంపొందించుకొని ఉండవచ్చు. ఈ కారణాలు తప్ప రాజకీయ కారణాలు కనబడవు.

కిశోర్ తన సినిమాలలో రాజకీయాల జోలికిపోలేదు. ప్రేక్షకులలో రాజకీయ చైతన్యం పెంపొందించాలన్న ఉద్దేశ్యాలు ఎన్నడూ కనబరచలేదు. అతను నటించిన సినిమాలలో కూడా తిరుగుబాటును ప్రోత్సహించేవి, కార్మిక ఐక్యతకోసం కంకణం కట్టుకున్నవీ ఏమీ లేవు. ఐ.యస్.జోహార్ హాస్యనటుడే అయినా జై బంగ్లా వంటి యుద్ధసినిమాలు, ఎమర్జన్సీ అనంతరం దానిని వెక్కిరిస్తూ సినిమాలు తీశాడు. కానీ కిశోర్ స్వంత సినిమాలలో కూడా ఆ దరిదాపులకు పోకుండా తీశాడు.

రాజకీయాలతో సంబంధం పెట్టుకున్న హిందీ నటులు ఉన్నారు. దిలీప్‌కుమార్, సునీల్‌దత్, మనోజ్‌కుమార్ లాంటివాళ్లు



కిశోర్ పాటలకు తెరస్థాయి
ఖ్యాతి తెచ్చిన నటుడు రాజేశ్ ఖన్నా

కాంగ్రెసు పార్టీకి, బలరాజ్ సహానీ వంటివాళ్లు కమ్యూనిస్టు పార్టీకి పనిచేసేవాళ్లు. మామూలుగా పట్టించుకోకపోయినా ఎమర్జన్సీ ఎత్తేశాక జనతాపార్టీకి మద్దతు పలికిన దేవ్ ఆనంద్ వంటి మిత్రులున్నారు కిశోర్‌కి.

ప్రజలకు అతి చేరువగా ఉండి, వారిని ఉత్తేజపరచగల కళాకారులపై ప్రభుత్వం ఎప్పుడూ ఒక కన్నేసి ఉంచుతుంది. వారిని మంచిచేసుకుని వారి ద్వారా ఓట్లు సంపాదిద్దామని ప్రజాస్వామ్య ప్రభుత్వాలు ప్రయత్నిస్తే నియంతృత్వ ప్రభుత్వాలు స్వతంత్ర భావాలున్న కళాకారులను నిర్బంధించి వారు ప్రజలలో ప్రభుత్వ వ్యతిరేక భావాలు పెంచకుండా జాగ్రత్త పడతాయి. అత్యంత స్వేచ్ఛాయుత వాతావరణం ఉందని చెప్పుకునే అమెరికాలోనే రెండవ ప్రపంచ యుద్ధానంతరం అనేకమంది మేధావులపై దాడి జరిగింది. యుద్ధం తర్వాత రష్యాపై, కమ్యూనిజంపై అనేకమందికి అభిమానం పెరిగిందన్న విషయాన్ని గుర్తించిన నాటి అమెరికా ప్రభుత్వం అన్ అమెరికన్ యాక్టివిటీస్ కమిటీ అనే ఓ కమిటీ ఏర్పరిచి అనుమానం వచ్చిన వాళ్ళందరిపై అభియోగాలు మోపి వేధించింది. హాలీవుడ్ రచయితలలో, దర్శకులలో కూడా చాలామంది కమ్యూనిస్టు సానుభూతి పరులున్నారనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం వారిపై విచారణలు జరిపింది. చాప్లిన్ కూడా ఈ చిత్రహింసకు గురయిన వాడే. ఈ భయంచేత కొంతమంది సినీ కళాకారులు (నటులు, రచయితలు, దర్శకులు) అజ్ఞాతంగా ఉండి, వేరే వారి పేర్లమీద రాసేవారు.

మన దేశంలో కూడా స్వాతంత్ర్యం వచ్చాక కమ్యూనిస్టు పార్టీపై ఆంక్షలుండేవి. ఇప్టా (ఆంధ్రలో ప్రజా నాట్యమండలి)లో సభ్యులైన అనేకమంది కళాకారులు తమ పార్టీ నిషేధానికి గురి కావడంతో సినీ పరిశ్రమను ఆశ్రయించారు. అయితే భారత ప్రభుత్వం వారి రాజకీయ కార్యకలాపాలపై విచారణ సాగించింది కానీ వారి వృత్తిపై ఆంక్షలు విధించలేదు. అందువల్లనే బలరాజ్ సహానీ వంటివారు జైలు అధికారుల అనుమతితో షూటింగ్‌లలో పాల్గొనగలిగేవారు.

ఈ నేపథ్యంలో ఎమర్జన్సీ

**బిందూరే బిందు.....**

'పడోసన్' సినిమాలో సునీల్‌దత్ కిశోర్‌కుమార్ వద్దకు వచ్చి సైరాబాను తనను ప్రేమించటం లేదని వాపోతాడు. అప్పుడు కిశోర్ అతనికి ధైర్యం చెబుతాడు. ఒరిజినల్ స్క్రిప్టులో డైలాగులు మాత్రం ఉన్నాయి. రిహార్సలు చేస్తూండగా కిశోర్‌కి సీను నచ్చలేదు. మానేసి ఓ మూలకూర్చున్నాడు. డైరెక్టర్ జ్యోతిస్వరూప్‌కి హడలెత్తిపోయి నిర్మాత మెహమూద్‌కి కబురంపించాడు. అతను వేరే స్టూడియోలో షూటింగులో ఉన్నా పరిగెట్టుకు వచ్చాడు. సంగతేమిటి, కిశోర్‌దా! అని అడిగాడు 'డైలాగులు రక్తి కట్టవు. పాటపెడదాం' అన్నాడు కిశోర్. 'నీ యిష్టం' అని కొంతమంది మ్యూజిషియన్స్‌ను పిలిచాడు మెహమూద్. గంటలోపునే బెంగాలీ భాటియాలీ స్టయిల్‌లో ఏక్‌తారా సహాయంతో 'బిందురే బిందూ' పాట తయారైంది. 'బిందురే బిందూ మేరీ ప్యారీ బిందూ...' వంటి అందమైన పాట ఆశువుగా తయారయిందంటే నమ్మడం కష్టం కదూ!

### కిశోర్ పాడవలసిన 'ముత్తుక్కుళి'

'అనుభవించు రాజా, అనుభవించు' గా తెలుగులోకి డబ్ అయిన కె.బాలచందర్ తమిళచిత్రం 'అనుబవి రాజా అనుబవి'ను మెహమూద్ 'దోపూల్' గా హిందీలో పునర్నిర్మించాడు. దానిలో 'ముత్తుక్కుళిక్క వారి గళా' అనే పాటను కిశోర్, ఆశాభోంస్లేల చేత పాడించాలని ప్లాను చేశాడు రాహుల్‌దేవ్ బర్మన్. కానీ రికార్డింగ్ రోజున కిశోర్ లేటయిపోయాడు. అక్కడి మ్యూజిక్ డైరెక్టరు 'రీటేక్' చెప్పి కిశోర్ చేత మళ్ళీ పాడించనారంభించాడు.

మొహమూద్ కిశోర్‌కి ఫోన్ చేశాడు. 'వచ్చేస్తున్నా' అన్నాడు కిశోర్. కానీ రాలేకపోయాడు. ఇవతల ఆర్డీ, ఆశా, ఆర్కెస్ట్రా మొత్తం వెయిటింగ్. స్టూడియో అద్దె వృధా అయిపోతోంది. రోజంతా గడిచిపోయినా కిశోర్ జాడలేకపోయేసరికి 'ఆశా పక్కన ఎవరిచేతనైనా ట్రాక్ పాడించి పూర్తిచేద్దాం. తర్వాత కిశోర్‌ది కలుపుదాం' అన్నాడు రాహుల్. 'సరే దమ్మీవాయిస్ వెతుకుదాం' అన్నాడు నిర్మాత కూడా అయినా మెహమూద్.

'వేరెవరో ఎందుకు? నువ్వే పాడేయ్' అన్నాడు రాహుల్.

'అట్టే నేనేమైనా సింగర్నా ఏమైనానా? అప్పుడప్పుడు పాటల్లో అరవడం తప్ప నాకేం వచ్చు?" అన్నాడు మెహమూద్ సిగ్గుపడుతూ.

"ఫర్వాలేదు, పాడేయి. కావాలంటే నేను హెల్ప్ చేస్తాను" అనిహామీ యిచ్చింది ఆశా.

ఎలాగూ ఉత్తిత్తిదేకదా అని మెహమూద్ ధైర్యంగా పాడేశాడు. తర్వాత చూస్తే మెహమూద్ వాయిసే చాలా బాగుందనిపించింది రాహుల్‌కి, ఆశాకి, అంతా అయిపోయాక వచ్చిన కిశోర్‌కూ!. అందరూ పట్టుబట్టి మెహమూద్ వాయిసే వుంచేశారు.

కాలంనాటి భారత ప్రభుత్వం 'కిస్సా కుర్సీకా' అనే రాజకీయ చిత్రాన్ని నెగటివ్‌తో సహా కాల్చివేసి అప్రతిష్ట మూటగట్టుకుంది. అయితే ఆ ప్రభుత్వం కిశోర్‌ని 'శిక్షించినది' అతని రాజకీయ కారణాలకు కాదు. తన మాట వినలేదన్న అక్కసుతో, అహంభావంతో ఈ దుశ్చర్యకు పాల్పడింది. ఆ విషయం కిశోర్ బాగా అర్థంచేసుకున్నాడు అందుకే అతడు ఇందిరాగాంధీపై కసిపెట్టుకుని ఆమెకు వ్యతిరేక ప్రచారం చేయలేదు.

'వాళ్ళు పిలిచినా తను వెళ్ళకపోవడానికి కారణం డబ్బు. ఇవ్వవలసిన పారితోషికం ఇవ్వకపోతే నటించకూడదు, పాట పాడకూడదు అని తను పెట్టుకున్న నియమం. దాని గురించి ఎన్ని కష్టనష్టాలకైనా తాను సిద్ధపడాలి. ఎమర్జెన్సీలో జరిగినది ఒక మరిచిపోవలసిన బాధాకరమైన అధ్యాయం' అనుకుని కిశోర్ ఊరుకున్నట్టు కనబడుతుంది.

కిశోర్ డబ్బు యావ గురించి ఒక వింతకథ ప్రచారంలో ఉంది.

తన చేత పాట పాడించేసుకుని నిర్మాతలు డబ్బు ఎగ్గొడతారన్న భయం కిశోర్‌ను ఎప్పుడూ అంటిపెట్టుకునే వుంది. రికార్డింగు టైములో ఇస్తానని చెప్పి రమ్మనడం, పాట పాడినదాకా ఉండి తర్వాత పంపిస్తామనడం, ఆ తర్వాత కూల్‌గా మర్చిపోవడం నిర్మాతలకు పరిపాటి. అందువల్ల రికార్డింగుకి వచ్చినట్టే వచ్చి, రిహార్సలు చేస్తూ, చేస్తూ డబ్బు ముట్టిన తర్వాతనే రికార్డింగు పూర్తి చేయాలని కిశోర్ పథకం.

దానికోసం ఓ అసిస్టెంటును ఏర్పాటు చేసుకున్నాడు. అతని పని ఏమిటంటే డబ్బు ముట్టగానే కిశోర్‌కు సిగ్నల్ ఇవ్వడం, ఆ సిగ్నల్ అందాకనే కిశోర్ పాట రికార్డు చేస్తాడు. అప్పటిదాకా గొంతు బాగాలేదంటూ దగ్గుతూ,



నకిలిస్తూ గొంతు సవరించుకుంటూనే ఉంటాడు. ఇదీ ఏర్పాటు. ఇది బాగానే నడిచేది కానీ ఓ రోజు కాస్త దెబ్బతింది.

అవాళ అసిస్టెంటు సిగ్నల్ ఇవ్వలేదు. ఎంతసేపు గొంతు సవరింపులు సాగించినా సిగ్నల్ ఊడిపడటం లేదు. ఇక ఇది కాదని దగ్గు అందుకున్నాడు. అయినా అసిస్టెంటు ఉలకలేదు, పలకలేదు.

కిశోర్ కళ్లతోనే సంకేతాలు పంపాడు 'డబ్బు సంగతేమిట్రా బాబూ' అని. వాడు ఓ చిరునవ్వు నవ్వేసి ఊరుకున్నాడు. కిశోర్‌కి అర్థం కాలేదు కానీ కాస్సేపు పోయాక రియలిస్టిక్‌గా ఉండాలని, దగ్గు స్థాయి పెంచాడు. అది శృతిమించడంతో తక్కిన వాళ్ళందరూ గాభరా పడ్డారు, 'ఒంట్లో బాగాలేదేమో, ఇవాళ రికార్డింగు కాన్సిల్' అని.

చూసి, చూసి కిశోర్‌కి మండుకొచ్చింది. రికార్డింగు థియేటర్ బయటకు వచ్చి "డబ్బు సంగతేమిటంటే ఇకిలిస్తావేమిరా సన్నాసీ?" అని అడిగాడు గుసగుసగానే.

"డబ్బేమిటండీ బాబూ? ఇది మీ సినిమాయే కదా!" అని నిర్ఘాంత పోయాడు అసిస్టెంటు.

* * *

ఈ సంఘటన నిజంగా జరిగింద నుకోవడానికి అవకాశం లేదు. జరిగినా దీన్ని కిశోర్ చేసిన ప్రాక్టికల్ జోక్‌గానే భావించాలి. కిశోర్ లాటి కాలిక్యులేటెడ్ పెర్సన్‌కి తను నిర్మాత అనే విషయం మరుపుకు వచ్చే అవకాశం లేదు. పైగా అతని సినిమాలకు అతనే సంగీతదర్శకుడు కాబట్టి పాట రికార్డింగు సమయంలో ఆ విషయం అనుక్షణం గుర్తుకు వస్తూనే ఉంటుంది.

నిజంగా జరగకపోయినా కిశోరే ఈ కథను ప్రచారంలోకి పెట్టినా ఆశ్చర్యం లేదు. తను డబ్బు దగ్గర అంత గట్టి అని నిర్మాతలకు తెలిసిరావాలని కూడా అతని ఉద్దేశ్యం కావచ్చు.

అతను నటుడిగా బాగా సంపాదించే రోజుల్లో కూడా చాలా జాగ్రత్తగానే ఉన్నాడు. పొగరుబోతుతనం చేతనో, ఆశపోతుతనం చేతనో వేషాలు పోగొట్టు కోలేదు. వచ్చిన వేషమల్లా - చిన్న నిర్మాతైనా, పెద్ద నిర్మాతైనా సరే వేశాడు. అతని సినిమాల లిస్టు చూడబోతే ఆ విషయం స్పష్టమవుతుంది.

1960 లో మాలాసిన్హాతో 'బేవకూఫ్', వహీదా రెహమాన్ తో 'గర్ల్ ఫ్రెండ్', మధుబాలతో 'మహలోం కా ఖ్వాబ్', 1961 లో శశికళాతో 'కరోడ్‌పతి', మధుబాలతో 'ఝుమ్రూ', 1962 లో మాలాసిన్హాతో 'బొంబాయి కా చోర్', మధుబాలతో 'హాఫ్ టికెట్' (ఈ సినిమాలో కిశోర్ కుమార్ పాత్ర తమాషాగా ఉంటుంది. ఇంట్లోంచి పారిపోతూ రైల్వే స్టేషన్‌కి వస్తాడు. తన దగ్గరున్న డబ్బు అర టిక్కెట్టు కొనడానికి మాత్రమే సరిపోతుంది. అందువల్ల మీసం గీసేసి, ఓ లాగూ వేసుకుని కళ్ళ జోడు తగిలించి కాస్త పెద్ద సైజు పిల్లవాణ్ణి అంటూ అర టిక్కెట్టుతో రైలెక్కేస్తాడు. అదే రైలెక్కిన విలన్ ప్రాణ్ అతని జేబులో తను చోరీ చేసిన వస్తువు పడేస్తాడు. తర్వాత తక్కిన సినిమా అంతా దాని వేటలోనే నడుస్తుంది. కాళిదాస్ డైరెక్టు చేసిన ఈ సినిమా హిట్ అయింది), సాధనాతో 'మన్‌మౌజీ' (ఏవియం వారికై కృష్ణన్ పంజు దర్శకత్వం వహించిన ఈ సినిమాకు సంగీతం మదన్‌మోహన్), కల్పనాతో 'నాటీ బాయ్', వైజయంతీమాలతో 'రంగోలీ' 1963 లో జమున(అవును మన తెలుగునటి జమునతోనే) తో 'ఏక్ రాజ్', వచ్చాయి.

పేరున్న హీరోయిన్స్‌తోనే వేసిన రెండు, మూడు తప్పిస్తే తక్కిన సినిమాల పేర్లు ఎక్కడా వినబడవు కదూ! వీడియోలలో కూడా దొరకవు కదూ! అంటే కిశోర్ సినిమాలు సరిగా ఎంచుకోలేదనేగా అర్థం! తన నటనా ప్రతిభను సీరియస్‌గా తీసుకుని ఉంటే దిలీప్‌కుమార్‌లా ఏడాదికి ఓ సినిమా వేసేవాడు. కానీ కిశోర్‌కి అలాటి పట్టింపులు లేవు. వేషం వచ్చింది వేసేద్దాం, అంతే!

1964 వచ్చేసరికి కిశోర్ స్థాయి

మరింతపడిపోయింది. పేరున్న హీరోయిన్లు ఎవరూ అతనిపక్కన వేయలేదు. కుమ్‌కుమ్ లాటి వాళ్లే అతనికి జోడీ. ముంతాజ్ చిన్నతారగా ఉన్నపుడు అతని పక్కన వేసింది. 'పాయల్ కీ ఝంకార్' లో హీరోయిన్‌గా పరిచయమైన జ్యోతిలక్ష్మి వేయడానికి కారణం - ఆ సినిమా దర్శకనిర్మాత టి.ఆర్. రామణ్ణ ఆమె అన్నగారు కావడం!

1964 లో కిశోర్ సినిమాలు - దాల్ మే కాలా (నిమ్మి), దూర్ గగన్ కీ ఛావ్ మే (సుప్రియా), గంగా కీ లహరే (కుమ్‌కుమ్) మిస్టర్ ఎక్స్ ఇన్ బాంబే (కుమ్‌కుమ్). గంగా కీ లహరేలో టైటిల్ సాంగ్, ఛేడో న హమ్‌కో రెండూ మంచి పాటలు. మిస్టర్ ఎక్స్ ఇన్ బాంబే లక్ష్మీకాంత్ ప్యారేలాల్ తొలిదినాల సినిమా. 'మేరే మెహబూబ్ ఖయామత్ హోగీ' ఇప్పటికీ ఓహ్ అనిపించే పాట. 'దూర్ గగన్ కీ ఛావ్ మే' లో అన్ని పాటలూ బాగుంటాయి. 'ఆ చల్ కే తుఝే', 'కోయీ లౌటాదే ముఝే' వంటివి అజరామరమైన పాటలు. 1965 లో లక్ష్మీ, ప్యారేలు సంగీతం సమకూర్చిన ఇంకో హిట్ సినిమా కిశోర్‌కు వచ్చింది. 'హమ్ సబ్ ఉస్తాద్ హై' (మారుతి అనే ఒక చిన్న హాస్యనటుడు స్వీయ దర్శకత్వంలో నిర్మించిన సినిమా ఇది. అమీతా హీరోయిన్. షేక్‌ముక్తార్, దారాసింగ్ నటించారు. లో బడ్జెట్ సినిమా అయినా హిట్ అయింది. వెంటనే 'అజనబీ తుమ్ జానే వహచానేసే లగ్‌తే హో' అనే పాట గుర్తుకువస్తుంది కదూ! 'ప్యార్ బాంట్‌తే చలో' అనే సరదాపాట కూడా ఇంకా డిమాండ్‌లోనే ఉంది.) అదే సంవత్సరం విడుదలయిన ఇంకో సినిమా - శ్రీమాన్ ఫంటూష్ (కుమ్‌కుమ్). 1966లో అకల్‌మంద్ (సోనియా సహానీ), లడ్కా, లడ్కీ (ముంతాజ్)లతో బాటు హిట్ సినిమా 'ప్యార్ కియే జా' (కల్పనా) ఉంది.

'ప్యార్ కియే జా' లో కిశోర్ వేసిన వేషం 'ప్రేమించిచూడు' లో జగ్గయ్య వేసింది. అంటే సెకండ్ హీరో అన్నమాట! అప్పటికే కిశోర్‌ను పెద్దనిర్మాతలు వదిలేసినట్టన్నమాట! 1967లో కిశోర్ సినిమాలు - అల్‌బేలా మస్తానా (ఆశా), దునియా నాచేగీ (కుమ్‌కుమ్), హమ్ దో డాకూ (గంగా), 1968 నాటివి - హాయ్‌మేరా దిల్ (కుమ్‌కుమ్), శ్రీమాన్‌జీ (షహీదా), పాయల్ కీ ఝంకార్ (జ్యోతిలక్ష్మి) ఈ సినిమాలో 'యే మేరే సోయే హుయే ప్యార్ జరా' అనే మంచిపాటతో బాటు, 'పాపా కహేనా..' అనే పాటను ఓ ఇంగ్లీషు ట్యూన్ ఆధారంగా అందించాడు సంగీతదర్శకుడు సి.రామచంద్ర. బిమల్‌రాయ్ సినిమా 'దో దూనీ చార్' లో తనూజాతో నటించడంతో బాటు 'హవావోం సే కహదో' అనే చక్కటిపాట సలిల్‌చౌధురి సంగీతంలో పాడాడు కిశోర్!

**కిశోర్ ఇల్లు**

కిశోర్ తన ఇంట్లో క్లోజ్‌డ్ సర్క్యూట్ టీవీ పెట్టించుకున్నాడు. గేటువద్ద ఎవరున్నదీ అతనికి మానిటర్‌పై వెంటనే కనబడేది. 1963లో ఇన్‌కంటాక్స్ దాడి దుర్ఘటన తర్వాత అటువంటి సర్‌ప్రైజ్ ఎటాక్‌ల నుండి కాపాడుకోవడానికి అతను పడిన జాగ్రత్త అది.

అతని డ్రాయింగ్ రూములోని గ్లాసు షోకేసుల్లో విదేశీయాత్రలలో కిశోర్ సేకరించిన అనేక ఆటబొమ్మలుండేవి. రకరకాల సైజుల్లో కల డమ్మీ కుక్కలు, మగ, ఆడ మేనక్విన్స్ (బట్టల షాపుల్లో పెట్టే నిలువెత్తు బొమ్మలు) ఉంటాయి. గోడలమీద చార్లీచాప్లిన్ బొమ్మ వర్జిన్‌మేరీ బొమ్మ

అతని ఇంట్లో ఎన్నో హారర్ సినిమా వీడియోలు ఉండేవి. కిశోర్‌కి అవి మహా ఇష్టం.



వీటితోబాటు 'పడోసన్' లో ఓ ముఖ్యపాత్ర "హంగామా', సాధూ ఔర్ సైతాన్'లలో చిన్నపాత్రలు వేశాడు. 1970 వచ్చేసరికి 'అంసూ ఔర్ ముస్కాన్'లో ఓ ప్రత్యేకపాత్రలో కనబడి 'జై గోవిందం, జై గోపాలం' అంటూ సినిమా నటుల పేర్లు ఏకరువు పెట్టే మంచి హిట్ సాంగ్ పాడాడు. ఇక ఆ తరువాత వేసిన వేషాలన్నీ తన స్వంత సినిమాలలోవే తప్ప ఇతరులు ఆహ్వానించి వేయించుకున్నవి కావు.

గాయకుడిగా పునర్జన్మ ఎత్తి వుండకపోతే కిశోర్ పూర్తిగా మరుగున పడివుండేవాడేనని నిస్సందేహంగా చెప్పవచ్చు. గాయకుడైన తర్వాత కిశోర్ కెరియర్‌ను చాలా సీరియస్‌గా తీసుకున్నాడనే చెప్పాలి. సైగల్‌తో సహా అనేకమంది గాయకులను నాశనం చేసిన మద్యం జోలికి అతను వెళ్ళలేదు. పార్టీలకు వెళ్ళి తెల్లవారేదాకా ఉండే అలవాటులేదతనికి. తన బంగళాతోటలో ఆరేడు రకాల తమలపాకు మొక్కలు వేసి రోజూ ఆకులు నమిలి గొంతు శుభ్రంగా ఉంచుకునేవాడు.

తన బంగళాలో ఒక సీక్రెట్ రూము కట్టుకుని, ఒంటరిగా హార్మోనియం పెట్టుకుని పాటలు పాడుకుంటూండేవాడు. కష్టమైన పాట ఏదైనా వస్తే రోజుల తరబడి ఆ రూములో సాధన చేస్తూ ఉండిపోయేవాడు. భోజనానికి మాత్రం బయటకొచ్చేవాడు. ఎక్కడ మాయమయిపోయాడాని నిర్మాతలు జుట్టు పీక్కుంటూండగా చివరికి ఓరోజు బయటపడి పాట అద్భుతంగా పాడేవాడు. అందుకే అంత మంచి పాటలు!

(ఇంకావుంది)

## అమర్‌ప్రేమ్

చింగారీ కోయీ భడ్‌కే ॥2॥
తొ సావన్ ఉసే బుఝాయే సావన్ జొ అగన్ లగాయె
ఉసె కౌన్ బుఝాయే ॥2॥
పత్‌ఝడ్ జో బాగ్ ఉజాడే వొ బాగ్ బహార్ ఖిలాయె
జో బాగ్ బహార్‌మే ఉజ్‌డే
ఉసె కౌన్ ఖిలాయే ॥2॥
హమ్‌సే మత్ పూఛో కైసే మందిర్ టూటా సప్‌నోఁ కా ॥2॥
లోగోఁకీ బాత్ నహీ హై యే కిస్సా హై అప్‌నోఁ కా
కోయీ దుష్‌మన్ ఠేస్ లగాయెతొ మీత్ జియా బెహలాయె
మన్‌మీత్ జొ ఘావ్ లగాయె ఉసె కౌన్ మిటాయె
న జానె క్యా హో జాతా జానే హమ్ క్యా కర్ జాతే ॥2॥
పీతే హై తో జిందా హై న పీతే తో మర్‌జాతే
దునియా జో ప్యాసా రఖే తొ మదిరా ప్యాస్ బుఝాయే
మదిరా జో ప్యాస్ లగాయే
ఉసెకౌన్ బుఝాయే ॥2॥
మానా తూఫాఁ కె ఆగె నహీ చల్ తా జోర్ కిసీకా ॥2॥
మౌతోంకా దోష్ నహీహై ఏ దోష్ హై కౌన్ కిసీకా
మఝ్‌ధార్‌మె నయ్యా ఢోలే తొ మాఝీ పార్ లగాయె
మాఝీ జొ నావ్ డుబోయే
ఉసె కౌన్ బచాయె ॥2॥ చింగారీ...







(రాజేశ్‌ఖన్నా, షర్మిలాటాగూర్‌లు నటించిన విభిన్న చిత్రం 'అమర్‌ప్రేమ్' అందునా ఈ పాట భావం అతి విలక్షణమైనది. హృద్యంగా పాడిన ఘనత కిశోర్‌ది.)


చదువులావు
ఈవేళ నాకంటే ముందే చదువులావు మేల్కొన్నాడే!!!
అయ్యగారు ఎగసాయంలో పెట్టేత్తానని సిన్నయ్యగారిని బెదిరిత్తున్నారు కానీ, ఈయన బాగానే సదువుకుంటున్నారు, పళ్ళు తోముకుంటూ కూడ.
పాపం... పరీక్షలని ఒక్క క్షణం కూడా వేస్టు చెయ్యకుండా చదువుతున్నాడు
వెర్రినాగన్న... పరీక్షలని ఒక నిముషం కూడా వేస్టు చెయకుండా ఎలా చదువుతున్నాడో
పాపం పరీక్షలని దృష్టంతా చదువుమీదే పెట్టుకున్నట్టున్నాడు
పొద్దున్నించి చదివేసుకనుక కానీ, లేకపోతే రేపు కూడా ఉంచుకున్నారంటే ఇంకో రూపాయి ఇవ్వాల్సి వచ్చేది, ఈ 'ఒక రూపాయి లైబ్రరీ' లో ఈ డిటెక్టివ్ నవలకి
1Re. PER DAY



## సంగీతాభిమానుల 'దిల్ కి రాణీ'

# అలీషా చినాయ్






'అలీషా చినాయ్'

పేరు తలుచుకోగానే 'మేడిన్ ఇండియా' ఆల్బమ్ గుర్తుకు వస్తుంది. భారతీయ ఆత్మను తన సంగీతంతో 'మేడిన్ ఇండియా' ఇండిపాప్ ఆల్బమ్ ద్వారా అలీషా చినాయ్ ఆవిష్కరించే ప్రయత్నం చేసినా - ఆమె మాత్రం భారతీయ మడోన్నా అనే ముద్రనుండి దూరం కాలేకపోయింది. 'ఇండిపాప్' అంటే ఏమిటో ప్రజలకు తెలియని రోజుల్లోనే అలీషా భారతీయ సంగీత ప్రపంచంలోకి అడుగుపెట్టింది. అనతికాలంలోనే ఇండిపాప్ రారాణిగా పేర్గాంచింది. అంతేకాదు ఇవాళ ఎందరో సంగీత అభిమానులకు ఆమె 'దిల్ కీ రాణి'. ఆమె రూపొందించిన 'బేబీడాల్', 'జాదూ', 'ఆహ్ అలీషా' ముఖ్యంగా 'మేడిన్ ఇండియా' ఆల్బమ్... ఇవన్నీ అత్యధికంగా అమ్ముడుపోయాయి. దాంతో అలీషా ఇండిపాప్‌లో అగ్రస్థానానికి చేరింది. అలీషా-బిద్దు కాంబినేషన్‌లోనే 'మేడిన్ ఇండియా', 'ఓం - ద ఇన్నర్ వాయిస్', 'దిల్ కీ రాణి' ఆల్బమ్స్ వచ్చాయి. 'మేడిన్ ఇండియా'తో భారతీయ సరిహద్దుల్ని దాటి ప్రపంచ ఖ్యాతి పొందింది అలీషా. అయితే ఆ తర్వాత వచ్చిన 'ఓం '- 'దిల్ కీ రాణీ' ఆమెను నిరాశకు గురిచేశాయి. పాత కాంబినేషన్‌కి తిలోదకాలిచ్చి అలీషా రెండు సంవత్సరాల వ్యవధి తీసుకుని 2002 ప్రారంభంలో ప్రముఖ సంగీత దర్శకుడు సందీప్‌చౌతాతో కల్సి 'అలీషా' పేరుతో ఆల్బమ్ విడుదల చేసింది. 'మేడిన్ ఇండియా' అంత ఘనవిజయాన్ని ఈ ఆల్బమ్ పొందకపోయినా- ఆమె - ఎప్పటికీ సంగీతాభిమానుల 'దిల్ కీ రాణీ'నే అని నిరూపించింది. ఈ ఆల్బమ్ అమ్మకాలమీద టిప్స్ అధినేతలు సంతృప్తిని వ్యక్తంచేశారు.

ఇండిపాప్‌లో రారాణిగా అలీషా పేరు తెచ్చుకున్నా- నిజానికి ఆమె తొలి ప్రాధాన్యం తొలుత సంగీతం కాదు. క్లాసికల్ సింగర్‌కు కూతురుగా పుట్టినా - తొలుత మోడలింగ్ పైనే ఆసక్తి చూపించింది. అటునుండి నాటకరంగం వైపు పయనించింది. పబ్లిసిటీ, నాటకరంగంలో పేర్గాంచిన అలెక్యే పదమ్‌సేతో కల్సి 'ఇలిటా' నాటకానికి వర్క్ చేసింది. అయితే అదే సమయంలో ఆమె అంతరాంతరాల్లో దాగున్న సంగీత ప్రతిభ బయటపడింది. 'జాదూ' అనే ఆల్బమ్‌తో ఇండిపాప్ రంగంలోకి ప్రవేశించింది. ఆ ఆల్బమ్ ప్లాటినమ్ డిస్క్‌ను పొందడంతో ఇక అలీషా వెనుతిరిగి చూడలేదు. ఆ తర్వాత వచ్చిన ఆహ్ అలీషా. బేబీడాల్, మడోన్నా, కామసూత్ర.... ఇవన్నీ ప్లాటినమ్స్ పొందాయి.

అయితే అలీషా బాటలో విజయ కుసుమాలే కాదు పరాభవ కంటకాలూ వున్నాయి. ముఖ్యంగా సంగీత దర్శకుడు అనూమాలిక్ తన పట్ల అసభ్యంగా ప్రవర్తించాడని ఆమె ప్రకటించినప్పుడు సంగీత ప్రపంచంలో పెద్ద సంచలనం రేగింది. అలానే వరుసగా అలీషా ఆల్బమ్స్‌ను విడుదల చేసిన మాగ్నా సౌండ్ కంపెనీ ఆ తర్వాత ఆమె మీద పరువు నష్టం దావా వేసింది. ఈ రకమైన చికాకులు ఆమె కెరీర్ మీదకూడా ప్రభావం చూపించాయి. ఆ తర్వాత విడుదలైన రెండు ఆల్బమ్స్ గొప్ప విజయాన్ని పొందలేదు. కానీ పరాజయాలతో, అవరోధాలతో అలసిపోకుండా తానేమిటో తాజా ఆల్బమ్ 'అలీషా' ద్వారా నిరూపించుకుందామె. సందీప్ చౌతాతో కల్సి దాదాపు సంవత్సరం పైగా వర్క్‌చేసి కొత్త ఆల్బమ్‌ను రూపొందించి- మళ్ళీ విజయాన్ని కైవశం చేసుకుంది.

అయితే కేవలం ప్రైవేట్ ఆల్బమ్స్ సింగర్ గానే కాకుండా అలీషా నేఫథ్యగాయనిగానూ పేరు తెచ్చుకుంది. 1985లో బప్పీలాహిరి సంగీతం సమకూర్చిన 'టార్జాన్' చిత్రంలో 'టార్జాన్ ఓ మై టార్జాన్' అనే పాటతో నేపథ్య గాయనిగా ప్రవేశించింది. ఆ తర్వాత 'మిస్టర్



☆ అలీషా చినాయ్ అసలు పేరు సుజాత. అయితే అలీషా అంటేనే తనకిష్టమని ఆమె అంటుంది.

☆ ఇప్పటి వరకూ 9 ఆల్బమ్స్ విడుదల చేసింది అలీషా. ఇందులో అగ్రస్థానం 'మేడిన్ ఇండియా'కే దక్కింది. దాదాపు సంవత్సరం పాటు ఆ ఆల్బమ్ టాప్ టెన్ లిస్ట్‌లో ప్రథమ స్థానంలో వుంది.

☆ 'మేడిన్ ఇండియా' లాంటి ఆల్బమ్‌ను మళ్ళీ చేయటం అసాధ్యమంటుంది అలీషా. అంతేకాదు 'ప్రతి సింగర్‌కూ ఏదో ఒకటే పాపులర్ ఆల్బమ్ ఉంటుంది. మైఖేల్ జాక్సన్ 'థ్రిల్లర్'ను, మడోన్నా 'లైక్ ఏ వర్జిన్' ను రిపీట్ చేయగలరా? అలానే లతా మంగేష్కర్‌కు 'యే మేరే వతన్‌కె లోగో' పాటకొచ్చినంత ఖ్యాతి మరే పాటకైనా వస్తుందా? ఇదీ అంతే' అని ఉదాహరణలతో సహా సెలవిస్తోంది.

☆ 'మేడిన్ ఇండియా' లాంటి ఆల్బమ్ కోసం మరోసారి ప్రయత్నించటం వృథా ప్రయాస అని తెలిసే డిఫరెంట్‌గా వుండాలని 'ఓమ్', 'దిల్ కీ రాణి' ఆల్బమ్స్ చేశాను. కానీ అన్ని ప్రయోగాలూ సక్సెస్ కావాలని లేదుకదా! ఏదేమైనా రిస్క్ తీసుకోవడం అనేది నాకు మొదటి నుండే అలవాటే అని అంటోంది.

☆ 'అలీషా' ఆల్బమ్‌కు సంగీతాన్ని సమకూర్చిన సందీప్ చౌతా గురించి చెబుతూ 'అతను జీవితంలో తొలి ప్రాధాన్యం సంగీతానికే ఇస్తాడు. అతనికి సంగీతమే శ్వాస. నా గొంతులో కొత్త ధ్వనిని పలికించిన క్రెడిట్ సందీప్‌దే' అంటూ అతన్ని ఆకాశానికి ఎత్తేసింది.

☆ 'మేడిన్ ఇండియా' సక్సెస్ తర్వాత 'అలీషా షోస్' పేరుతో అనేక స్టేజ్ షోలు ఇచ్చింది అలీషా. వాటి కారణంగా వచ్చే గుర్తింపు, డబ్బు, సినిమా పాటలు పాడటం వల్లరాదని- అందుకనే తాను నేపథ్య గాయనిగా కొనసాగటం లేదని చెబుతోంది.

☆ దాదాపు రెండు సంవత్సరాల క్రితం సంగీత దర్శకుడు అనూమాలిక్ తనని శారీరకంగా వేధించాడని ఆరోపించిన అలీషా ఇప్పుడు అతనితోనే కల్సి ఓ కొత్త ఆల్బమ్ రూపొందించే పనిలో వుందనే వార్తలు వినవస్తున్నాయి. రాజకీయాలలో, సినిమాలలో, బిజినెస్‌లో శాశ్వత శత్రువులు వుండరని అలీషా- అనూమాలిక్ నిరూపించ బోతున్నారన్నమాట.

☆ త్వరలోనే అలీషా తన కెనడియన్ స్నేహితుడు రొమెల్ కజువాను వివాహం చేసుకోబోతోందనే వార్తలు వినవచ్చాయి. గత యేడాది ముంబాయిలో రొమెల్‌తో పరిచయం అయ్యిందని- ఇద్దరం 'తొలిచూపు ప్రేమకు గురయ్యామని' అలీషా అంటోందట. మ్యూజిక్ బిజినెస్‌లోనే కాకుండా రొమెల్ సొంతంగా ఓ రెస్టారెంటును, రియల్ ఎస్టేట్ వ్యాపారాన్ని నిర్వహిస్తున్నట్టు తెల్సింది. అతనితో పెళ్ళయిన తర్వాత ఇక అలీషా 'ఇండిపాప్'కి ఫుల్‌స్టాప్ పెట్టి భర్తతో కలిసి టోరంటోలో స్థిరపడే అవకాశాలు ఉన్నాయని అంటున్నారు.

☆ సందీప్ చౌతా- అలీషా కలిసి రూపొందించిన 'అలీషా' ఆల్బమ్‌కి తొలుత 'ఇష్క్‌సె ఇష్క్‌హై' అనే పేరు పెట్టాలనుకున్నారు. అలానే ఇందులో ఓ పాటను రాంగోపాల్ వర్మ దర్శకత్వంలో పబ్లిసిటీ కోసం పిక్చరైజ్ చేయించాలని అలీషా ఆశించింది. కానీ ఆమె కోరిక నెరవేరలేదు.

☆ 'మడోన్నా' పేరుతో ఓ ఆల్బమ్ విడుదల చేయడమే కాదు- 'అలీషా' అనే ఆల్బమ్ కోసం తీసిన పాటలో మడోన్నా తరహాలో మేకప్ అయ్యి కనిపించింది అలీషా. అంత మాత్రం చేత తనని 'మడోన్నా'ని అనుకరిస్తున్నట్టుగా విమర్శిస్తే అంగీకరించనని అలీషా చెబుతోంది. ఆమె పాప్ రారాణి. ఆమె ప్రభావం కొంత వరకు నామీద వుండొచ్చు. అయినా- నేను- నేనే తప్ప - మడోన్నాను కాను. అని ఖండిస్తోంది.

ఇండియా' 'త్రిదేవ్' తదితర చిత్రాలలో పాడింది. తాజాగా ' ప్యార్ తునే క్యా కియా', 'తక్షక్', 'కరోబార్' ' హాలీవుడ్ బాలీవుడ్' తదితర చిత్రాలలో పాడింది. అయితే నేపథ్యగాయనిగా ఎవరి ముఖానికో తాను పాట పాడటం అంత ఇష్టంవుండదని- అందుకనే చిత్ర సీమ పట్ల ఆసక్తి చూపటం లేదని అలీషా చెబుతుంది.

విశేషం ఏమంటే ఇండిపాప్‌లో ఆమె రారాణి అయినా 'స్కాండల్ ఛైల్డ్' అనే ఇమేజ్ నుండి మాత్రం బయటకు రాలేకపోయింది.

**- అరుణ సత్యవతి**

## హిందీ సినీ సంగీతంలో మైలురాళ్లు - మజిలీలు

### 1955

* **'ఉ**డన్ కఠోలా' సినిమాలో 'ఓ దూర్ కే ముసాఫిర్...', 'మొహబ్బత్ కి రాహోఁ మేఁ', 'హమారే దిల్ సే న జానా', వంటి గీతాల ద్వారా నౌషాద్ సిక్సర్ కొట్టారు. దాంతో రాజ్‌కపూర్, శంకర్-జైకిషన్‌ల టీమ్ లాగానే దిలీప్‌కుమార్ -నౌషాద్‌ల టీమ్ స్థిరపడింది.



నౌషాద్

* ఫిల్మిస్తాన్ వారి 'మునీమ్‌జీ', నవకేతన్ సంస్థ నిర్మించిన 'హౌస్ నెం.44' చిత్రాల ద్వారాఎస్.డి. బర్మన్-దేవానంద్‌ల టీమ్ కూడా స్థిరపడింది. 'మునీమ్‌జీ' లోని కిశోర్,లతా వేరువేరుగా గానం చేసిన జీవన్ కే సఫర్ మేఁ రాహీఁ...., 'హౌస్ నెం.44'లోని ఫైలీ హుయీ హైఁ సప్నోఁ కి బాహేఁ ...', 'పీఛే పీఛే ఆకే....', ' చుప్ హై ధర్తీ...', 'తేరీ దునియా మైఁ జీనే సే...' మొదలైన పాటలతో హిట్ సాధించారు. బర్మన్‌దాదా స్వరపరిచిన 'దేవదాస్' చిత్రంకూడా 'ఆన్ మిలో ఆన్ మిలో శ్యామ్ సఁవారే...', 'జిసే తూ కబూల్ కర్ లే...', 'మిత్‌వా...' వంటి పాటల ద్వారా ఆయనకు మంచిపేరు తీసుకువచ్చింది.



* మహారాష్ట్రకు చెందిన ఎన్.దత్తా 'మిలాప్' చిత్రం ద్వారా సంగీత దర్శకునిగా పరిచయం అయ్యారు. తర్వాత దత్తా,జి.పి.సిప్పీ నిర్మించిన యాక్షన్ థ్రిల్లర్ 'మెరైన్ డ్రైవ్'కు కూడా ఆయన సంగీతాన్నిచ్చారు. 'మిలాప్' చిత్రం ద్వారానే మ్యూజికల్ చిత్రాల దర్శకుడు రాజ్‌ఖోస్లా కూడా పరిచయం అయ్యారు.

* నాషాద్ (నౌషాద్ కాదు)అనే చిన్నపాటి సంగీత దర్శకుడు 'బరాదరి' చిత్రానికి సంగీతాన్నిచ్చి తలత్ మెహమూద్ జీవితంలో క్లాసిక్స్ గా నిలిచిపోయిన 'తస్వీర్ బనాతా హూఁ, తస్వీర్ నహీఁ బన్తీ....', రఫీ, లతా పాడిన 'భులా నహీఁ దేనా...', 'మొహబ్బత్ కి బస్ ఇత్నీ దాస్తాన్ హై...' గీతాలతో శాశ్వతమైన కీర్తిని సంపాదించారు.

* 'వచన్' చిత్రం ద్వారా సంగీత దర్శకునిగా రవి పరిచయం. (కానీ రికార్డులపై 'రవి-చంద్ర' అని కనబడుతుంది. పాటలన్నీ తను చేసినవే అని రవి అంటారు.)అదే చిత్రంలో ఆయన రవిశంకర్ పేరుతో ఆశాతో కలసి యూహీఁ చుప్‌కే చుప్‌కే ...అనే పాట కూడా పాడారు. ఆశా గీతం 'చంద మామా దూర్ కే...', సూపర్ హిట్ అయింది.



రవి

ఆ సినిమా ద్వారా దేవేంద్రగోయల్‌తో ప్రారంభమయిన అనుబంధం 'ఆద్మీ సడక్ కా' (1977) వరకూ కొన సాగింది.

- (వచ్చే సంచికలో మరికొంత)

## కొంటెకొశ్శెన్లు-తుంటరి జవాబులు




సి.హెచ్.రమేష్‌బాబు- గుంటూరు

ప్ర॥ నాలుగు రాళ్ళు వెనకెయ్యాలంటే ఏం చెయ్యాలి?

రమేష్, హైదరాబాద్

జ॥ క్వారీలో రాళ్ళను లారీలకెత్తి ట్రాన్స్‌పోర్ట్ చెయ్యాలి

**ప్ర॥ ఎవర్నైనా ఉంచుకోవాల నిపిస్తూ వుంటుంది.... అది తప్పని తెలుసు..... ఈ మానసిక జాడ్యం నుంచి బైటపడేదెలా?**

జ॥ సైక్రియాటిస్టుకు పంపవలసిన ప్రశ్నను 'హాసం' కి పంపారు. అయినా మాకు తెలిసిన పద్ధతిలో చెప్పడానికి ప్రయత్నిస్తున్నాం. చిత్తగించండి..... అలా ఉంచుకోవడాలు, పెంచుకోవడాలు, తెంచుకోవడాలు అన్నీ రిస్కు కదా..... ఎందుకొచ్చిన గొడవ.... అయినా ఎవర్నో ఉంచుకోవడం ఎందుకు... హాయిగా మీ మనసునే మీరు శుభ్రంగా ఉంచుకోవచ్చుకదా ఆరోగ్యానికి ఆరోగ్యం..... సేఫ్టీకి సేఫ్టీ....

వి. మంజురాణి- హైద్రాబాద్.

**ప్ర॥ మామూలు తెలివి తేటలు కాకుండా అతి తెలివి తేటలు అర్జంటుగా వచ్చేసిన ఓ వెర్రివెంగళప్పను పురాణ కాలక్షేపానికి తీసుకెళ్తే ఏంచేస్తాడు?**

జ॥ పాక శాస్త్రప్రావీణ్యంగల భీముడు ఉండగా తిరిగి అక్షయపాత్రని ధర్మరాజుకి సూర్యుడు ఇచ్చాడంటే భీముడిమీద వాయు దేవుడి మీద నమ్మకంలేనట్టేగా అని ఫిట్టింగులు పెడతాడు.

## డబుల్‌రోల్




మనం సైకిల్ మీద పోవాలంటే జోరుగా వీస్తున్న 'ఆ-గాలి' ఆగాలి - మాధవీసనారా,ఖర్గపూర్, వెస్ట్ బెంగాల్.

చెం'గున' పోయి ఓ 'గునపం' తీసుకురా -బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.

'మీరటు' 'మీరటు' వైపు వెళ్తే కాస్త చెప్పండేం -భమిడిపాటి వెంకటేశ్వరరావు, చందానగర్



## చిలిపి లిపి



Bun D Raw = బం

Win Jaw మ Raw = వింజామర

V Raw G = వీరాజీ

-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం

## ఈ రూటే వేరు




Each Hot = ప్రతీకారం

Goat Colour Tiger = మేక వన్నె పులి

Work subjects = కార్యకర్తలు

-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.

## చిలిపికవిత




నీ భార్య ఎదుటివాడికి
నమస్కరిస్తే- అది సంప్రదాయం
ఎదుటివాడి భార్య
నీకు షేక్‌హాండిస్తే - అది సభ్యత
నువ్వు కూడబెడితే పొదుపు
ఎదుటి వాడైతే పిసినారి
నువ్వు అంటే ముందుచూపు
ఎదుటివాడంటే తొందరపాటు
ఎదురెదురు భావాలు
చెదురు మదురు కాబోలు

- శ్రేష్ట, హైదరాబాద్.

## షార్ట్‌కట్స్




గారపాటి భగవాన్ రావు = గాభరా
నండూరి గిరీష్ = నంగి
బొంతల గుర్నాధం = బొంగు

-టి.యల్.ప్రసాద్, విశాఖపట్నం.

## పేరు -రిపేరు




చెవిలో పువ్వు - పూజకు పనికిరాని పువ్వు

- కె.కృష్ణ, గుంటూరు.

అమ్మ నాన్న ఓ తమిళ అమ్మాయి - అంతా మనవాళ్ళే

- ఎం.రామరావు, కాకినాడ.

'నువ్వు-నేను' - 'లైలా మజ్ను'

-ఎం.డి.ముస్తఖీమ్, కొల్లాపూర్.

## పేరడీ పేరేడ్




అంతగా నువ్ పాడకు....
ఇష్! మాటాడకు
అంతగా నువ్ పాడకు
వింతగా వెంటాడకు, వేటాడకు
ఏయ్ అంతగా నువ్ పాడకు
శృతి, లయలను విడనాడకు
ఆ స్వరముల పరువును తీయకు
జనమునే జడిపించకూ....
పదునౌ గతులను వేసెయ్యకు
ఏయ్ అంతగా నువు పాడకు
సాగుడు పాకము తీయకు
జోరీగలు చెవిలో వదలకు
కడుపులో మండించకూ
గానముతో నను వధియించకు
ఏయ్ అంతగా నువు పాడకు

- తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం

('మంచి మనిషి' చిత్రంలో 'అంతగా నను చూడకు' పాటకు పేరడీగా...)

# మరదే... జీకే తక్కువంటే

-వారణాసి రామకృష్ణ



సుబ్బారావు గుర్రుపెడుతూ నిద్రపోతుండగా భార్య దుప్పటి లాగుతూ

“ఏమండీ! ఏమండీ! ఓసారి లేవండీ!” అంటూ గావు కేకలు పెట్టింది.

హడలిపోతూ సుబ్బారావు లేచి కూర్చోగానే ఆమె

“మీ సుపుత్రుడి నిర్వాకం చూశారా? స్కూల్‌కి వెళ్ళనని పేచీ పెడుతున్నాడు! అసలే ఈసారి పదోతరగతికి పబ్లిక్ పరీక్షలు!” చెప్పగానే అసలు నిద్ర సరిగ్గాలేని సుబ్బారావు కొడుకు సుధీర్‌వంక కోపంగా చూసి

“ఏరా! ఒళ్ళు తిమ్మిరి తిమ్మిరిగా ఉందా? వేలకివేలు ఫీజులు కట్టాక స్కూల్‌కి పోనంటున్నావంట?” గదిమాడు.

సుధీర్ నిర్లక్ష్యంగా క్రాఫ్ సర్దుకుని “నేను స్కూల్‌కెళ్ళను! చదువుకోవటం ఇష్టంలేదు” అన్నాడు.

సుబ్బారావు కోపంగా మంచంమీంచి ఇంతెత్తున కిందికి దూకి

“చదువుకోక గాడిదల్ని మేపుతావుట్రా?” అరిచాడు గట్టిగా!

సుధీర్ ఖాతరులేనట్టుగా మొహానికి పౌడరు పట్టించసాగాడు. సుబ్బారావు కోపంగా లుంగీ సరిచేసుకుని “చదువుకోకపోతే గాడిదల్ని కాయాల్సి వస్తుంది!” అంటూ మీదకి పోబోయాడు. భార్య అతన్ని ఆపి “వాడు సిన్మా హీరో అవుతాడట!” చెప్పింది.

“ఏమిటీ!” నోరు వెళ్ళబెట్టాడు సుబ్బారావు. వెంటనే ఆమె-

“మీ ఫ్రెండు ఫిలిం ఫైనాన్షియర్ చిదానందంతో మాట్లాడమని వాడిగోల! వీడ్ని హీరో చెయ్యమని చెప్పమంటూ గత నెల్రోజులుగా సతాయిస్తూ నా మెదడు తినేస్తున్నాడు వీడు!” విసుగ్గా చెప్పింది.

“పదోక్లాసు చదివే కుర్రకుంకవి - నువ్వు హీరో అవటం ఏంట్రా!?” సుబ్బారావు కొడుకుతో అనగానే వాడు నవ్వేసి హీరోలా ఫోజుపెట్టి

“నీకు జీకే తక్కువని కాలనీలో జనాలంతా అంటుంటే - ఏమో అనుకున్నా! నిజమే! తినటం, తొంగోటం తప్ప మరొకటి తెలీదు నీకు!” అన్నాడు.

“నాకు జీ.కే. తక్కువని కూసిన వాడెవడ్రా?” అంటూ సుబ్బారావు ఆగ్రహంతో చిందులు త్రొక్కగానే భార్య కోపంగా చూసి-

“మీకు జీ.కే. ఏమోగానీ ప్రథమ కోపం ఎక్కువ! తెలివి మాత్రం తక్కువ! లేకపోతే ఒక్కగానొక్క కొడుకు భవిష్యత్తు గురించి ఆందోళనలేకుండా కల్లు తాగిన కోతిలాగ చిందులేస్తారా?” అన్నది.

సుబ్బారావు చిరాకుగా “నన్నేం చెయ్యమంటావిప్పుడు?”

“ముందెళ్ళి మొహం కడుక్కోండి! ఆనక చిదానందంతో మాట్లాడి వీడ్ని హీరో చేసే అవకాశం ఉందేమో చూడండి”

“పదో క్లాసు పిల్లకుంక సిన్మా హీరో ఏమిటే?” సుబ్బారావు అసహనంగా అరవగానే

“మీ మతి మండినట్టే ఉంది! ఇప్పటి సిన్మా హీరోలందరూ మూతిమీద మీసం, గడ్డం మొలవని కుర్రకుంకలే!” ఆమె చెప్పగానే సుబ్బారావు ఆశ్చర్యంగా చూసి “నిజమా?” అన్నాడు.

“మరదే జీ.కే. తక్కువంటే” సుధీర్ వ్యంగ్యంగా అనేసి వెళ్ళబోతుంటే సుబ్బారావు మళ్ళీ కొడుకు మీద చిందులు త్రొక్కబోయి అవసరం ముంచుకొచ్చి బాత్రూమ్‌లోకి పరుగులు తీసాడు.

వారం రోజుల తర్వాత- తన ఫ్రెండ్ చిదానందం దగ్గరికి కొడుకుని తీసుకెళ్తే - చిదానందం వాళ్ళకి 'తుజా' అనే ఫిలిం డైరెక్టర్‌ని పరిచయం చేశాడు.

అప్పుడక్కడ "ఔను... వాళ్ళిద్దరూ తన్నుకున్నారు" ఫిలిం షూటింగ్ జరుగుతోంది!

సుబ్బారావు చిదానందం మొహం దగ్గర నోరుపెట్టి "తుజానా! డైరెక్టరు పేరేంటిలా వుంది?" అడిగాడు. చిదానందం ముక్కు మూస్కుని మొహం చిరాగ్గాపెట్టి "తుమ్మల జానకీరాము' అయితే షార్ట్‌ఫామ్‌లో అలా పెట్టుకున్నాడు లేరా! అతని పేరుతో మనకేం పని? ఎంత బాగా ఫిలిం తీస్తాడో నోరు మూస్కుని గమనించు అర్థమైందా?" గట్టిగా చెప్పాడు- సుధీర్ చాలా ఆసక్తిగా షూటింగ్‌ని చూడసాగాడు.

'తుజా' అనే ఆ డైరెక్టరు గడ్డం గోక్కుంటూ, శూన్యంలోకి చూస్తూ ఏదో లెక్కలేస్తున్నట్టు డైలాగు చెబుతూ, మళ్ళీ వెంటనే తన రెండు చూపుడు వేళ్ళని దగ్గరిగా పెట్టి కెమెరా ఏంగిల్ సెట్ ఎలా చెయ్యాలో ఆలోచిస్తుండగా - అసిస్టెంటు వచ్చి "సార్!షాట్ రెడీ సార్" చెప్పాడు.

తుజా వెంటనే 'హాచ్ఛ్'మని గట్టిగా తుమ్మి అరిచేతులతో గడ్డం గోక్కున్నాడు. సుబ్బారావు నోరు తెరచి ఏదో అనబోగా చిదానందం మొహం అసహ్యంగా పెట్టి "నోర్మూయ్యి! మట్లాడబాక! అది అతని సెంటిమెంటు!" చెప్పాడు.

సదరు తుజా కెమెరాలోంచి యాంగిల్ చూసి"రెడీ" అనగానే గౌను వేస్కున్న పన్నెండేళ్ళ పాప పరుగెత్తుకుని షాట్‌లోకొచ్చింది.

వెంటనే తుజా "కట్" అని గట్టిగా అరచి కోపంగా ఆ పిల్ల చెవి మెలేస్తూ "ఏమ్మా! పరుగెత్తుకొచ్చావ్- వచ్చిన దానివి నీరసం మొహం ఏంటి?" అని జడలు పట్టి గుంజుతూ "చూడు! ఇంకోసారి తీస్తున్నాం! ఈసారి నవ్వుతూ రావాలి! సరేనా?" అనేసి మళ్ళీ తుమ్మి "రెడీ" అరిచాడు.

ఎర్రగా కందిన చెవిని ఆ పిల్ల రుద్దుకుంటూ పరుగెత్తింది. అయితే ఈసారి తుజా కోపంగా కెమెరా దగ్గర నిలబడ్డ హీరో కుర్రాడి దగ్గరికెళ్ళి

"ఏరా బేవకూఫ్! ఆ పిల్ల ఆనందంగా వస్తే బిక్కమొహం వేసుకుని పక్క చూపులు చూస్తావేంట్రా బక్కనాయలా! మక్కెలిరగ తన్నా" అంటూ వీరబాదుడు బాదేసరికి పాపం ఆ కుర్రాడు "లేద్సార్! లేద్సార్" అంటూ అరిచాడు.

తుజా మళ్ళీ తుమ్మి ఈసారి గట్టిగా "కెమెరా స్టార్ట్" అన్నాడు. హీరోయిన్ పరుగెత్తుకొచ్చింది. హీరో కుర్రాడు నవ్వుతూ చూసి వెంటనే గతుక్కుమని డైరెక్టర్ మొహంకేసి చూశాడు- డైలాగు చెప్పడం కాస్త మర్చిపోయి.

ఇక అప్పుడు తుజా వీరలెవల్‌లో వీపు విమానం మోత మోగిస్తూ "ఏరా స్కూలుఎగ్గొట్టి, ఇల్లు వదిలేసి ఇక్కడకి పారిపోయొచ్చి 'హీరోని చెయ్యండిసార్ - హీరోని చెయ్యండిసార్' అంటూ నా బుర్ర తిన్నావు కదరా. తీరా చేద్దామనుకుంటే ఆముదం తాగిన వాడిమొహం పెట్టి కెమెరా వంక చూస్తావా? తాట వలుస్తా బుద్ధిలేని గాడిదా! డైలాగ్ చెప్పవేమిరా? మర్చిపోయావా?"అంటూ కాళ్ళమీద వాతలు తేలేలా కొట్టాడు.

హీరో కుర్రాడు "లేదుసార్ మరిచిపోలేదు సార్." అంటూ పెడబొబ్బలు పెట్టాడు.

"మరయితే- చెప్పరా- చెప్పరా డైలాగు!" అని గట్టిగా తొడపాసం పెట్టగానే కుర్రాడు కుయ్యో మొర్రోమంటూ అరచి ఏడుపుమొహంతో

"ఆ అమ్మాయి నవ్వుతూ పరుగెత్తుకుని రాగానే- నేనూ నవ్వుతూ "రా సీతా! రా నన్ను ప్రేమిస్తున్నావనే చెప్పటానికే ఇక్కడికి వచ్చావు కదూ!' అని డైలాగు చెప్పాలి సార్" అంటూ బావురుమని ఏడుస్తూ చెప్పాడు!

"అలా ఏడుస్తూ కాదు నవ్వుతూ చెప్పాలి సరేనా?" అంటూ తుజా డొక్కలో పొడవగానే కుర్రాడు విలవిలలాడి బాధ ఓర్చుకుంటూ

"ఈసారి టేకులో కరెక్టుగా చెప్తాను సార్" కాళ్ళా వేళ్ళా ప్రాధేయపడ్డాడు. తుజా కళ్ళతోనే "ఊఁ" అని ఉరిమి చూసి ఆగ్రహంగా "ఈసారి టేకులు తిన్నావో నా చేతిలో మరిన్ని తన్నులు తింటావు" గట్టిగా తుమ్మేసి "యాక్షన్" అరిచాడు.

ఆ పిల్ల నవ్వుతూ రాగానే హీరో కుర్రాడు ఏడుపు మొహంతో బాధగా డైలాగ్ చెప్పేసరికి తుజా కోపంగా ప్రక్కనున్న కుర్చీని అమాంతం గాల్లోకిలేపి "చంపేస్తాను! ఎందుకురా నా ప్రాణాలు తోడేస్తున్నావు" అంటూ ఉగ్రనరసింహుడిలా లేచేసరికి అసిస్టెంటు అతన్ని వారిస్తూ "సార్!సార్! కుర్రాడు.. చచ్చూరుకుంటాడు సార్! పోనీ ఎట్లాగూ ఏడుపు మొహంతో బానే వున్నాడు కనుక చివర్లో తీద్దామనుకున్న రెండు ఏడుపు సీన్లు ఇప్పుడే లాగించేస్తాను సార్" సలహా చెప్పాడు.

"ఊఁ ఎట్లాగో ఏడవండి" అంటూ తుజా విసురుగా వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత రెండు, మూడు సన్నివేశాలు-

ఒకటి- ఇంతెత్తున్న గోడమీంచి హీరో హీరోయిన్‌లిద్దరూ దూకి పారిపోవటం!

తర్వాత- ఇద్దరూ లారీలో వెళుతుండగా- విలన్ ఛేజింగ్!

తుజా వాళ్ళిద్దరి భుజాల మీద చిన్నగా కొడుతూ "గోడమీదనుంచి గెంతాలి!తర్వాత టర్నింగ్ దగ్గర లారీలోంచి దూకెయ్యాలి! సరేనా?" గుడ్లురిమాడు.

వెంటనే వాళ్ళిద్దరూ బిక్క చచ్చిపోయి "సార్! లారీలోంచా?" బెరుగ్గా అడిగారు.

"లారీలోంచి కాకపోతే నా నెత్తిమీంచి దూకుతార్రా?" గట్టిగా అరిస్తూ బెత్తం తీసుకుని ఇద్దర్నీ కంబైన్డ్‌గా మరో విడత బాది "వీళ్ళిద్దరికీ ఫుడ్ ఎక్కువయింది! పదిరోజులబాటు తిండి పెట్టినట్లు తెలిసిందో నీ సంగతి చూస్తా!" అంటూ ప్రొడక్షన్ మేనేజర్‌కి గట్టిగా చెప్పి చేతిలో ఉన్న బెత్తం భుజం మీద వేసుకుని "ఛీఛీ! అప్పటిగ్గానీ వీళ్ళిద్దరూ దారిలోకిరారు!" అంటూ కోపంగా దూసుకుని సుబ్బారావు వాళ్ళుండే వైపుకి వచ్చి వెంటనే క్షణంలోనే నవ్వుమొహంతో సుధీర్‌ని చూసేసరికి సుధీర్ వణికిపోయాడు.

"స్వీట్ బాయ్! కుర్రాడు బావున్నాడు. ఎవరీ అబ్బాయి?" అనేసరికి చిదానందం తెగ ఆనందంగా అన్నీ చెప్పి సుధీర్‌తో

"డైరెక్టరుగారి ఆశీర్వాదం తీస్కోబాబూ" అంటూ తోశాడు ముందుకి!

ఇంతలో అసిస్టెంటు వచ్చి "సార్! షాట్ బ్రహ్మాండంగా వచ్చిందిసార్!" నవ్వుతూ చెప్పాడు. తుజా 'హాచ్ఛ్'మని వెంటనే తుమ్మి తీరిగ్గా గడ్డం నలుపుతూ "నాలుగు కొట్టాకయినా షాట్ బాగా రాకపోతే వేస్టు" గలగలమని నవ్వేడు.

మరో వారం గడిచాక - సుబ్బారావు ఆ



రోజున పొద్దున్నే ఐదింటికల్లా లేచి స్నానం చేసి పూజా పునస్కారాలు ముగించి నుదుటున ఆరు అంగుళాల వెడల్పుతో విబూది పట్టించి భార్యతో నవ్వుతూ "మన అదృష్టం కొద్దీ ఇంతకు ముందున్న హీరో కుర్రాడు ఎవ్వరికీ చెప్పకుండా ఎక్కడికో పారిపోయాడట! తుజా గారు మన సుధీర్‌ని హీరోగా వోకే చేశారట ఇవాల్టి నుంచే షూటింగ్" అంటూ చెప్పి అటు ఇటు చూసి

"ఇంతకీ సుధీరేడి? ఎక్కడా కనిపించడేంటి?" వరండాలోకి వచ్చేనరికి సుధీర్ స్కూల్ యూన్‌ఫాంలో ఉన్నాడు.

"అదేంట్రా? ఎక్కడికెళ్తున్నావు?" అశ్చర్యంగా అడిగాడు.

"స్కూల్‌కి" సీరియస్‌గా సుధీర్ చెప్పాడు.

"హీరోనవుతానని అంతలా అలిగావు, పేచీలు పెట్టావు! తీరా హీరో అవకాశం వస్తే స్కూల్‌కి పోతున్నావేమిట్రా?"

"మరదే జీ.కే. తక్కువంటే" అనేసి నవ్వేసి షూలేసు వేసుకుంటుండగా భార్య గ్లాసుడు పాలు కొడుక్కి ఇచ్చి "వాడు చక్కగా చదువుకుని పెద్ద ఇంజనీరో డాక్టరో అవుతాడట! ముందు చదువు. ఆ తర్వాతే ఏదైనా అని వాడికి బాగా అర్థం అయిందట!" చెప్పింది.

"అదేంటి?" సుబ్బారావు నోరు అయోమయంగా తెరిచాడు.

సుధీర్ వెంటనే తండ్రి దగ్గరికొచ్చి

"మరదే... జీ.కే.తక్కువంటే" అనేసి నవ్వుతూ స్కూల్‌కెళ్ళిపోయాడు! సుబ్బారావు వెంటనే కోపంతో చిందులు త్రొక్కలేదు.

"ఎవడ్రా నాకు జీ.కే.తక్కువన్నది? పిల్లకుంకా! చదువుకోరా అంటే- హీరో అవుతావా? స్కూలు మానేసి నా దగ్గర నకరాలు పోతావా? కుర్రసన్నాసి" అనుకుని నవ్వుకుని ఏదో గుర్తొచ్చినవాడిలా ఫోన్‌చేసి

"వారే చిదానందం! కథ సుఖాంతం! అన్నట్టు తుమ్మలకి నా స్పెషల్ థాంక్స్ చెప్పరా! నిజంగా ఓ డైరెక్టర్ లెవల్లో భలేగా కథ నడిపించాడు!" అని పొగిడాక ఫోన్‌పెట్టేశాడు.

అతని భార్య అనుమానంగా చూసి

"ఫోన్‌లో తుమ్మల అంటున్నారు... కొంపదీసి తుమ్మలంటే చిదానందం చుట్టం... నాటకాల్లో వేసన్తాంటాడు, తుమ్మల జానకీరాముడు! అతనేనా" ప్రశ్నించింది.

సుబ్బారావు ఏమీ మాట్లాకుండా మంచం మీదకి గెంతి దుప్పటి తీసి కప్పుకుని నవ్వుతూ "మరదే...జీ.కే.తక్కువంటే" అని చెప్పేసి హాయిగా పడుకున్నాడు!! ■

---




## మార్కాపురంలో మధురవాణి

**-నిశాపతి**

మధురవాణి:- నమస్కారం! 'శంకల'- సారీ 'శంకర' నారాయణగారూ!

శంకరనారాయణ:- ఎవరూ! మధురవాణే!! (తనలో ! అబ్బ! ఇంగ్లీషు వెలిగొస్తాందండీ గుంటది. ఆ గిరీశం గాడి ట్రైనింగ్ గావునా.(పైకి) ఏమిటి మీ విజయనగర రాజ వీధుల వదిలి యిలా మార్కాపురం పలకల గనుల్లో వూడిపడ్డావ్! ఎవరి కాపురం తీద్దామని?!

మధు: హన్నన్నా ఎంత నిర్దయ! ఏదో మీలాంటి 'పలుకులగని' యిక్కడుందని వచ్చాను గాని విట్‌లు వేసేవాళ్ళంతా విటులు కాదని నాకుతెలీదో!

శంక: భేష్! మా 'ఫన్‌దేహాలు' నువ్వూ చదివావన్నమాట! నీకు మంచి టేస్టుంది!

మధు: ఔరా ఏమి బేహద్బీ! అయినా నేనేమీ మిమ్మల్ని మోహించి రాలేదులెండి? మీ సంగతి నాకు తెలీదా! ఆ అమ్మాయెవరో మీకు **లైనేసుకోవాలని వుందంటే రేషన్ షాపులో నుంచో!** అన్నారు. ఇహ మీ జోలికి ఏ ఆడదొస్తుంది?! ఇదే మారావప్పంతులు అయితేనా.

శంక: అబ్బే! దానర్థం............

మధు: ఇంకో పిల్లెవరో మిమ్మల్ని 'అంకులూ!' అంటే ' **ఈ అంకులు మాటున ఏ లింకులు దాగెనో'** అని ఆ పిల్ల మొహం మీదే అంటిరి! ఇహ ఎవరూ మీ క్యాసి చూళ్ళేదంటే వాళ్ళదియాఁవన్నా దోషం వుందీ?!

శంక: మరీ అంత తీసిపారెయ్యక! నేను డిప్టీ కలెక్టరు దొరగారింట్లో.....

మధు: చాల్లెద్దురూ బడాయి! మీ 'యావ' గేసనంతా నవ్వించడంలోనే గాని మరో 'యావ' లేదు. **మీదంతా బెడ్‌లైట్ ఏరియానే! రెడ్‌లైట్ ఏరియా కాదు!**

శంక: (తనలో) ఈ సాన్ది మనం పూర్తిగా 'సేఫ్' అని నమ్మేసింది. మన **అవుట్‌డోర్ షూటింగులు** దీనికి తెలిసినట్లు లేవు. దీనికో రస్సా వేద్దాం! (పైకి) అవును! **ఇంటికి దీపం ఇల్లాలే!** ఒకవేళ రంభగాని నా ఎదురుగావచ్చినట్టాయనా "నేనే'యాంటినాచ్' పొమ్మంటాను" తెలుసా?! నేను నిప్పు.

మధు: **అబ్బో! నిప్పుకాదు పప్పు!** 'యాంటినాచ్' కాదు 'ఆంటీ క్యాచ్'! ఇంటి దీపానికి గ్యాస్ కబుర్లు చెప్పి **టాప్** సీక్రెట్ల కోసం మా వంటి వాళ్ళని ఆశ్రయించేది ఎవరు? పెళ్ళాం దగ్గర ఏముంటాయి సీన్లు అన్నది మీరు కాదో!

శంక: అమ్మో! ఇదేంటి యిలా రివర్సుపోయింది. 'శీఘ్రబుద్ధే పలాయనః అన్నారు.



మధు: మండే ఉదరంగల మండోదరి లాంటి భార్యలకి భయపడి **వాలంటరీ రిటైర్మెంట్** తీసుకున్న మీలాంటి వాళ్ళను చూసే "వృద్ధ నారీ పతివ్రతా' అన్నారు. నా దగ్గరేమో పోజులు!

శంక: మధురవాణీ! నువ్వు సొగసరివే కావు! గడసరివి గూడా!

మధు: చాలిద్దురూ, పొగడ్తలు! మీ 'ఎలెవెన్ స్కీలు చాలక నన్ను పన్నెండో స్కీ చెయ్యాలనా?!

శంక: (తనలో) ఇహనా ఆబోరు దక్కేలా లేదు. ఏఁమిటి సాధనం?! (పైకి) అబ్బ! మధురవాణీ! ఎంత తెలివైన దానివి నీవు! నువ్వు మగాడి వయివుంటే నిన్ను సురేంద్రనాధ బెనర్జీ అంత గొప్పవాణ్ని చేసి వుందును. ఫ్చ!ఫ్చ! సౌజన్యారావు పంతులంతటి వాణ్ణి పడగొట్టిన దానివి, నేనో లెక్కా?

మధు: ఇప్పుడా మహానుభావుడి పేరెందుకులెండి?! పైగా, 'ఫ్చ ఫ్చ' అంటూ ఏవిఁటా సౌండ్స్?! ముద్దు కావాలని డైరెక్టుగా అడగొచ్చుగా!

శంక: అడగొచ్చు! ముద్దు చేదని కాదు. మా యావిడ చూస్తుందేమోనని దిగులు!

మధు: మీరు షుగర్ పేషంట్ గదా! **షుగర్ పేషంట్లకి ముద్దు చేదే!** ఎలా మరి?

శంక: మధురవాణీ! ప్లీజ్!

మధు: అయ్యో! తఁవరలా శలవియ్యగూడదు! వృత్తి ధర్మం చేత ద్రవ్యాకర్షణ చేయవలసిన దానను! టాటాలనూ, బిర్లాలనూ చేరదీయవలసిన దానను. తఁవరే శలవిచ్చారట గదా **బీపీ లేనివాడు బిర్లా, షుగర్‌లేనివాడు టాటా** అని. మరి వృత్తికి ద్రోహం చెయ్యమంటారా! మీరే చెప్పండి!

శంక: డామిట్! కథ అడ్డం తిరిగింది!

**(నవ్వు నాలుగు విధాలుగా చేటయినా నవ్వే బెటరు -** ఎందుకంటే ఏడుపు **ఎనిమిది విధాల చేటు-**

ఈ బోల్డ్ లెటర్స్ అన్నీ శంకరనారాయణగారివే! లేకపోతే యింత 'బోల్డ్'గా యింకెవరు రాస్తారంటారా? యివేగాదు- ఇంకా బోల్డు బోల్డు /గోల్డు లెటర్స్ కావాలంటే 'మీడియా హౌస్ పబ్లికేషన్స్ వారికి గానీ, విశాలాంధ్ర వారికి గానీ ఓ నూరు రూపాయలు అలా ఫీజిచ్చి నూరేళ్ళ ఆరోగ్యం కోసం కావలసినన్ని "ఆంటీ' బయొటిక్స్", "స్మైల్ క్యాప్స్యూల్స్" యిలా పుచ్చేసుకోండి).

# దిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి BV



మీ ఫ్లాట్ పై అంతస్థులో ఉందని, చల్లగా ఉండడం కోసం తెల్లవారుగట్ల 'కూల్‌హోమ్' వేయిస్తారు.



మీరు లేవకముందే, మీ అపార్ట్‌మెంట్‌లోని మిగిలిన ఫ్లాట్స్ వాళ్లంతా మోర్నింగ్ వాక్ చేసి మీరు వేయించిన 'కూల్‌హోమ్' పాడు చేస్తారు.



మీ కంపెనీలో 'సేఫ్టీ అండ్ సెక్యూరిటీస్ విషయంలో మీరు మంచి జాగ్రత్తలు తీసుకుంటారని, మిమ్మల్ని 'సేఫ్టీ అవార్డు' తీసుకోడానికి స్టేజ్ మీదకి పిలుస్తారు.



'అవార్డ్' తీసుకోడానికి స్టేజి ఎక్కుతూ, గట్టు తగిలి మీరు బోర్లా పడబోతారు.



మీ క్లాస్‌మేట్ అందంగా ఉంటాడని, అతగాడి క్రాఫ్ అద్భుతంగా ఉంటుందని మీరు ప్రేమిస్తారు



మీ ప్రేమ ఫలించాలని గుడికెళ్ళి మొక్కుకుంటున్నప్పుడు పూజారి శఠగోపం పెట్టి తీసేసరికి అతగాడి క్రాఫ్ ఒరిజినల్ కాదని, విగ్గని తెలుస్తుంది.

# తూము నరసింహదాసు

## (1753-1820)




మనకి రామదాసు తెలిసినంత బాగా నరసింహదాసు తెలీదు.... అడపాదడపా 'ఆకాశవాణి' వాళ్ళు ఆ కీర్తనలు ప్రసారం చేస్తూ ఉండేవారు...

**భజన చేసే విధము తెలపండీ జనులార మీరూ**
**నిజము గనుగొని మోదమందండీ!!**

**అన్న కీర్తన ఈయన రాసిందే.....**

తూము నరసింహదాసు 1753-1820 ఆ ప్రాంతాల్లో ఉన్న వాగ్గేయకారుడు. ఊరు గుంటూరు... తల్లి వెంకమాంబ.... తండ్రి అప్పయ్య మంత్రి. బాల్యంలోనే సంస్కృత ఆంధ్ర సాహిత్యాలలో పరిచయం ఏర్పడింది. ఎలా అబ్బిందో పూర్వజన్మ సుకృతం కొద్దీ సంగీతం కూడా అబ్బింది!!

అయితే యవ్వనమొచ్చాక ఉద్యోగం వచ్చింది...

అదీ ప్రభుత్వోద్యోగం..... ఇంక ప్రభువుల కొలువంటే.....

ఎంతసేపూ వారిని భజన చేసే సరికే జీవితం అయిపోతుంది ఇక దేవుడూ లేడు దెయ్యమూ లేదు!!

అయితే రామభక్తుడైన నరసింహదాసు ఏ పని చేసినా 'రామాయణం'గా చేసేవాడు..... అంచేత కాబోలు ఆ రాముడు కరుణించి కమ్మటి పలుకిచ్చాడు.....

పగలల్లా ఉద్యోగం చేసినా.... సాయంత్రం ఇంటికెళ్ళాక... కాళ్ళూ చేతులతో పాటూ.... ప్రభుత్వోద్యోగం పాపం కూడా ప్రక్షాళనం చేసుకునీ.... తంబుర పట్టుకుని కూర్చునేవాడు.... అంతే ధారగా సంగీతం అమృతమై స్రవించేది!!

ఇలా సాయంత్రాలు మొదలైన సంగీత కచేరీ.... తెల్లవారిపోయేదాకా జరుగుతూ ఉండేది..... ఎప్పుడైనా బెంగగా ఉంటే.....

''రామనామామృతమే నాకు రక్షకంబనుకోవే మనసా'' అంటూ 'మధ్యమావతి' రాగంలో మనసుని బజ్జో పెట్టేవాడు.

ఇంకెప్పుడన్నా బతుకుమీద విరక్తి లాంటిది కలిగిందా....

**“ఎందుకే ఈ వట్టి బాధలు - నాకెందుకే**
**ఎందుకే బాధలజెందుచు - నుండెద అందముగా!!**

అని మనసుని కేకలేసేవాడు.....

మెల్లిగా భావసామీప్యం గల పది మందిని చేర్చి.... ఇంట్లోనే భజన మొదలెట్టాడు.... భజన ముదిరిన కొద్దీ భక్తి పెరిగిపోతోంది. ఉద్యోగం మీద ఆసక్తి తరిగిపోతోంది!....

ఓరోజు పదిమందినీ పోగేస్సీ.. దక్షిణ దేశం తీర్థయాత్రలకి వెళ్దామనుకుంటున్నా.... వస్తారా అన్నాడు.

అంతే.... సర్వజనం మూటాముల్లే సర్దుకుని... దక్షిణ దేశం బైలుదేరారు!!

శ్రీరంగపట్నం వచ్చాడు.... రంగనాధుణ్ణి చూసి భక్త్యావేశంలో

**కావేటి రంగా నను గావవేరా!**
**కావేటి రంగా నను గావమనుచు వేడ**

రావేమి సేతురా రాకుమారా..... అని యమునా కల్యాణిలో గోలపెట్టాడు. అంతే కదమరి.... నవవిధ భక్తుల్లోని 'సఖ్యం' వచ్చేసరికి భగవంతుడు స్నేహితుడై పోతాడు.... అప్పుడు వాణ్ణెన్నైనా తిట్టిపొయ్యొచ్చు...

యదుకుల కాంభోజిలో - కరుణయేదిరా రంగా.... నీకరుణ ఏదిరా అని మొత్తుకున్నాడు.... అప్పుడు అలుపొచ్చీ....తోడిరాగంలో వందన మిదె నా రంగా! అంటూ మోకరిల్లాడు...

అక్కణ్ణించి కంచికెళ్ళాడు.... శహనరాగంలో-

వరదునిగంటి - కంచి వరదుని గంటినీ-

అని పొంగిపోయాడు.... అక్కణ్ణించి చెన్నపట్నం వచ్చి...

పార్థసారథి స్వామిని దర్శించుకునీ

మనసారా కీర్తించుకునీ... తిరువత్తియూల్ ప్రయాణం అయ్యాడు!...

ఇప్పుడొక చారిత్రాత్మక సంఘటన జరగబోతోంది!!

ఒక గురుదేవుణ్ణి ఒక శిష్య పరమాణువు కలుసుకోబోతున్నాడు....

ఒక నాద యోగిని... మరో నాదసాధకుడు చేరుకోబోతున్నాడు!

ఒక రామ - దాసుణ్ణి- మరో నరసింహదాసు దర్శించబోతున్నాడు.

అది వీణకుప్పయ్యర్ ఇల్లు!!

వీణకుప్పయ్యర్ అంటే సాక్షాత్తూ త్యాగరాజ స్వామి ప్రియశిష్యుడు!!

తూము నరసింహదాసు పంటపండీ... అప్పుడు త్యాగరాజస్వామి వారు అక్కడే ఉన్నారు!!

కుప్పుస్వామయ్యర్ - నరసింహదాసుని త్యాగరాజస్వామికి పరిచయం చేసాడు!! నిత్య రామనామ పారాయణంతో వెలిగిపోతున్న త్యాగరాజస్వామి ముఖారవిందాన్ని తనివితీర చూసుకునీ.... ఆయన పాదారవిందాల మీద వాలిపోయాడు నరసింహదాసు!....

ఆనంద పారవశంలో కన్నీరు ఉబికి వచ్చీ.... ఆయన కాళ్ళకి అభిషేకం చేస్తున్నాయ్......

త్యాగరాజస్వామి చిరునవ్వు నవ్వాడు........

ఈ ఆవేశం తనకలవాటే.... ఎన్ని సార్లూ కళ్ళుకాసేలా ఏడ్చీ

ఆ రాముడి కాళ్ళమీద పడిపోలేదు తనూ....

అంతరంగమెంత శాంతి పొందలేదూ.......

కీర్తన అందుకున్నాడు త్యాగరాజస్వామి!.... తిరువత్తియూర్ త్రిపుర సుందరి దేవి మీద... 'సుందరి నన్నిందరిలో' అంటూ బేగడ

(బాలాంత్రపు రజనీకాంతరావుగారు రాసిన ఆంధ్రవాగ్గేయకార చరిత్రము చదివి, స్పందించి)

**-భరణి**

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

**కేరాఫ్: “హాసం”, 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,**

**మోతీనగర్, హైదరాబాదు - 500 018**

**అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.**

రాగంలో.

అక్కడ కొన్నాళ్ళుండీ... తనివి తీరాక... త్యాగరాజస్వామి వారిమీద ఆశువుగా పద్యాలు పాడి.... వీణకుప్పయ్యర్ దగ్గర శలవు తీసుకుని ఏకాయకీ.... భద్రాచలం బైలుదేరాడు నరసింహదాసు.

భద్రాచలంలో అడుగుపెట్టేసరికి... మనసుకనిపించింది... ఇంక ఇక్కడే ఉండి... ఇక్కడే రాముణ్ణి సేవించుకుంటూ.... ఇక్కడే.. రాముళ్ళో ఐక్యమౌదామని......

అంతే.... తిన్నగా.... ఆలయానికివెళ్ళి..... కానడరాగంలో చెలియా.... శ్రీరామ చంద్రుని సేవజేతుమా.... అని పాడుకుంటూ.... అప్పటి నైజాముని కలుసుకుని అదివరకు గోపన్నగారు తానీషా వారి సమ్మతిపై భద్రాచల రాముల నిత్యకైంకర్యానికి ఇచ్చిన దాన శాసనం... దుష్టులెవరో చెక్కివేస్తే.... దాన్ని తిరిగి రాయించి నైజాము చేత తిరిగి రాములవారి నిత్యోత్సవాలకు వార్షికం ఏర్పాటు చేయించిన అపర రామదాసు..... తూము నరసింహదాసు....

తన చివరి దశవరకూ భద్రాచలంలోనే ఉంటూ.....

నిత్యం రామచంద్రుని కీర్తించుకుంటూ......

బ్రహ్మానందంతో కన్నీళ్ళు పెట్టుకుంటూ....

సెలవా.... మాకిక సెలవా.... రామయ్యా

సెలవా.... మాకిక సెలవా శరణాగత వరదభరణా

భవతరణా.... అంటూ భవసాగరాన్ని రామభక్తితో

దాటేసి రాముడిలో ఐక్యమైపోయిన పరమ భాగవతోత్తముడు తూము నరసింహదాసు!!



-తనికెళ్ళ భరణి

---

**శ్రీ తనికెళ్ళ భరణి గారికి,**

నమస్కరించి వ్రాయునది. మీరు 'హాసం' పత్రికలో ప్రచురించిన శ్రీ కొచ్చెర్లకోట రామరాజు గారికి మనవరాలిని నేను. ఆ మహానుభావుని గురించి ప్రచురించినందుకు మీకు, హాసం పత్రిక వారికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. మా తాత గారి గురించి వినడమే కాని మేము ప్రత్యక్షంగా చూడలేదు. ఎప్పుడో చిన్నప్పుడు అమ్మగారితో కలిసి తాటిపాక అమ్మమ్మ గారింటికెళ్ళినపుడు ఆయన ఫోటో, వయొలిన్ వాయిస్తూ తీసిన నిలువెత్తు విగ్రహాన్ని చూసాను. తాతగారు పూజించిన శ్రీ సీతారామ లక్ష్మణుల విగ్రహాలు చూసాను.

నేను ఆయన చిన్న కూతురు సుందర సూర్యకాంతం గారి అమ్మాయిని. మా అమ్మగారు కూడా తండ్రివలె రామ భక్తురాలు. శ్రీ రామనవమికి అమ్మగారు మా చిన్నతనంలో ఘనంగా నిర్వహించేవారు. మాది ముమ్మిడివరం అగ్రహారం. మా అమ్మగారు చిన్నప్పుడే రామునిలో కలిసి పోయారు. ఆ తరువాత అమ్మమ్మ గారి వూరు వెళ్ళలేదు. ఇప్పటికి రామరాజు గారు నివసించిన భవనం వుంది. కాని శిథిలం అయిపోయిందని విన్నాం.

తాతగారికి రామలక్ష్మణులు పిలిస్తే పలికేవారని మా అమ్మగారు చెబుతూ వుండేవారు. ఒకసారి తాటిపాక వరదలతో మునిగిపోతుంటే తాతగారు ప్రార్థిస్తే రామలక్ష్మణులు బాణాలు వేసి ఆపారని అమ్మగారు చెప్పినట్లు గుర్తు. తాతగారు తాను పోయే సమయం చెప్పారని, ఆయనకి కపాల మోక్షం అయిందని అమ్మగారు చెప్పేవారు. ఆ మహానుభావుని గురించి మరిన్ని విషయాలు తెలుసుకుని మా తరువాతి తరాలకు అందించాలని నాకు అనిపిస్తుంది. కాని మా చిన్నప్పుడే మా అమ్మగారు గతించడంతో మాకు ఆయన గురించి మరిన్ని వివరాలు తెలియవు. అమ్మగారు లేకపోవటంతో మాకు తాటిపాక వారితో సంబంధాలు పెద్దగా లేవు.

మీరు డాక్టర్ విజయలక్ష్మి గారి నుంచి సేకరించి మా తాతగారి గురించి రాసినట్లు తెలియచేసారు. దయచేసి ఆవిడ అడ్రసు తెలియపరిచిన మేము వారినుంచి మరిన్ని వివరాలు సేకరించుకుంటాము. తాతగారు కొన్ని వందల కృతులు రాముని మీద, కృష్ణుని మీద రాసారు. అమ్మగారు పాడుతూ వుండేవారు. చివరన ఆయన పేరు ప్రతి పాటలోను వుండేది. ఆ పాటలు ఎక్కడున్నాయో తెలియదు.

మీరు ప్రచురించిన 'హాసం' పత్రిక వారికి హృదయ పూర్వక నమస్కారములు మరొక్కసారి అందించుతూ శెలవు తీసుకుంటున్నాను.

ఇట్లు

**బాల త్రిపురసుందరి,**

మల్కాజ్‌గిరి, హైదరాబాద్.

---

ఘంటసాల వారి గాఢాభిమానియైన శ్రీ చల్లా సుబ్బారాయుడు సేకరించి, తయారు చేసిన పుస్తకం **ఘంటసాల గాన చరిత**. ఇందులో ఘంటసాల పాడిన మొదటి చిత్రం నుండి చివరి చిత్రం వరకు ఏయే చిత్రాలలో ఎన్నెన్ని పాటలు ఆయన పాడారు, ఎవరెవరితో పాడారు, ఆయా పాటల రచయితలెవరు, సంగీత దర్శకుడెవరు, నటీనటులు, ముఖ్య సాంకేతిక నిపుణులు ఎవరు వంటి వివరాలు పొందుపరచబడినవి. రూ॥ 250/- ల విలువగల ఈ పుస్తకం 'హాసం' పాఠకులకు రూ॥ 200/-లకే లభిస్తుంది.ఈ కింది కూపన్ నింపి రూ. 200/-ల ఎం.ఓ. రశీదును జతపరచి పంపిన వారికి ఆ పుస్తకాన్ని తన ఖర్చుతో పంపుతానని ఘంటసాల స్వరాలయం వారు తెలియపరుస్తున్నారు. ఈ ప్రత్యేక అవకాశాన్ని 'హాసం' పాఠకులు వినియోగించుకోవాలని ఘంటసాల స్వరాలయం వారి కోరిక.




**హాసం కూపన్**

పేరు : ______________________

చిరునామా : ______________________

______________________

______________________

ఫోన్ : ______ పిన్ : ______

ఎం.ఓ.లు, కూపన్‌లు పంపవలసిన చిరునామా

బి. మోహన్రావ్,
సెక్రటరీ
ఘంటసాల స్వరాలయం,
8-134, కొత్తపేట,
కనిగిరి - 523 230

6 కార్యక్రమాల కోసం వెళ్ళి 25 'షో'లు ఇచ్చిన

# తలత్ మెహమూద్

వేమన్న ఏనాడో చెప్పనే చెప్పారు- 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా!' అని! పుణ్యపురుషులకు మిగిలిన వాటి సంగతి ఎలా ఉన్నా, భవిష్యద్దర్శన జ్ఞానం మాత్రం అనంతంగా ఉండి ఉంటుందన్న సంగతి, ప్రముఖ గాయకుడు తలత్ మెహమూద్ జీవితాన్ని పరిశీలిస్తే స్పష్టంగా అర్ధమవుతుంది. ఎంతవరకో దేనికీ.... ఆయన పాడిన తొలి పాట ఏదో గుర్తుందా? 1941లో హెచ్.ఎమ్.వి.వారు విడుదల చేసిన రికార్డులో ఉంది: 'సబ్ దిన్ ఏక్ సమాన్ నహీథా, బన్‌జావుంగా క్యాసేక్యామై ఇస్కాతో కున్ ధ్యాన్ నహీ థా' అనేది ఆ పాట. (అన్ని రోజులూ ఒకేలా ఉండవు. నేను ఏమేమి అవుతానో దాని గురించి ఆలోచనే ఉండదు అని అర్ధం). నిజంగానే ఆ పాట పాడుతున్నపుడు తాను ఆ తర్వాత ఏ స్థాయికి చేరతానో అన్నది ఆయనే ఊహించి ఉండరు! అలాగే బొంబాయిలో ఆయన పాడిన తొలి హిందీ పాటనూ చూడండి: 'యే దిల్ ముఝే జగా లేచల్ జహాఁ కోయీ నహో' (1949 లో అనిల్ బిశ్వాస్ సంగీత దర్శకత్వంలో రికార్డయిన ఈ పాటను దిలీప్‌కుమార్ మీద చిత్రీకరించారు) ఆ పాటలో ఆయన కోరినట్లే- ఆయన 'మరెవ్వరూ చేరలేని' స్థానానికి చేరటం విశేషం!

తలత్ మెహమూద్ - హిందీ చలన చిత్రరంగంలో మకుటం ధరించని గజల్ మహరాజ్! 1924 ఫిబ్రవరి 24 న లక్నోలో పుట్టిన ఆయనకు చిన్నప్పటి నుంచే సంగీతం అంటే చెప్పలేనంత ఆసక్తి ఉండేది. అప్పట్లో రాత్రిళ్ళకు రాత్రిళ్ళంతా గజల్ గీతాలాపనలతోనే లక్నో నగరం మార్మోగిపోతుండేది. తలత్ గనుక అలాటివాటికి వెళ్ళాడంటే 'ఇక తెల్లారినట్టే'నని వాళ్ళమ్మ నిట్టూర్చేదట! తండ్రి మాజూర్ మహమూద్‌కు ఒక ఎలక్ట్రికల్ క్యూరియోస్టోర్ ఉండేది. అందులో కూర్చొని కూని రాగాలు తీస్తున్న కొడుకును చూసి ఆయన తలత్‌ను మారిస్ మ్యూజిక్ కాలేజీలో చేర్పించారు. అక్కడ చదువుసాగుతున్నప్పుడే ఆయన గజల్స్ పాడే తీరు ఎందర్నో ఆకర్షించింది. 16 సంవత్సరాల వయసుకే ఆయన ఆల్ ఇండియా రేడియో, లక్నోనుంచి గాలిబ్, దాగ్, మీర్, జిగర్‌ల వంటి వారి గజల్స్ ఆలపించేవారు. అవి విన్న హెచ్.ఎమ్.వి.వారు 1941లో- తలత్ మెహమూద్ కు అప్పుడు కేవలం 17 సంవత్సరాలే- తొలి రికార్డు చేసి విడుదల చేశారు. 1944లో ఆయన పాడిన 'తస్వీర్ తేరి దిల్‌మేరా బహలా న సకేగీ' దేశాన్ని ఓ ఊపు ఊపింది. ఆ తర్వాత ఆయనకు కలకత్తా చిత్రసీమ సాదర స్వాగతం పలికి, గాయకుడిగా, నటుడుగా సుస్థిర స్థానం కల్పించింది. రాజలక్ష్మి, తుమ్ ఔర్ మై, సమాప్తి అనే మూడు చిత్రాల్లో హీరోగా నటించిన తలత్, ఆ తర్వాత బొంబాయికి 1949లో చేరారు.

చలన చిత్ర గాయకుల్లో తలత్ కంఠస్వరానది బహు విశిష్టంగా ఉంటుంది. 'గజల్ పాడితే తలత్ పాడాలి!' అన్న ప్రత్యేకతను ఆయన సాధించుకొన్నారు. నౌషాద్‌లాటి సంగీత దర్శకుడు సైతం 'గజల్స్‌ను చాలామంది పాడతారు. కానీ అందులోని భాషా సౌందర్యాన్నీ, భావసౌందర్యాన్నీ సంపూర్ణంగా ఆస్వాదించాలంటే మాత్రం తలత్ పాడినప్పుడే వినాలి!' అనేవారు. ఉర్దూను ఉర్దూగా, ఏ ఇతర భాషా కాలుష్యం లేక పాడగలిగినవాడు తలత్ అని



అందరూ ఒప్పుకొనేవారు. ఒకరా ఇద్దరా.... ఎందరో ఉర్దూ సినీ కువులు.... మజ్రూసుల్తానుపురి, హస్రత్ జైపురి, సాహిర్ లూథియాన్వీ, షకీల్ బదయానీ, రాజేంద్రకిషన్, అసద్ భూపాలీ, జానిసార్ అఖ్తర్, ప్రేమ్‌ధావన్, ఖమర్ జలాలాబాదీ, శైలేంద్ర, ఇందీవర్, కైఫీ ఆజ్మీ, నక్షల్యాల్‌పురీ, రాజామెహ్దీ అలీఖాన్, పి.యల్.సంతోషి, భరత్‌వ్యాస్ వంటి ఎందరో కవులు, తలత్ పాడతానంటే చాలు, గజల్స్ రాసిపెట్టేసేవారు! ప్రముఖ నిర్మాత, దర్శకుడు మెహబూబ్‌ఖాన్ అయితే, తలత్ కంఠాన్ని చూపిస్తూ 'ఖుదా కానూర్ తుమ్హారే గలేమే హై' (దేవుని 'కాంతి' అంతా నీ కంఠంలేనే ఉంది!') అనేవారు!!

తలత్ మెహమూద్‌కు సైతం తన కంఠస్వరంలోని అందం తెలుసు. శారీరకంగా కూడా ఎంతో అందంగా ఉండే తలత్ హీరోగా 13 చిత్రాల్లో నటించారు. 1945లో రాజలక్ష్మి (కాననబాల హీరోయిన్), 1947 లో తుమ్ ఔర్ మై' (కానన్‌బాల), సమాప్తి (1949, భారతీదేవి), ఆరామ్ (1951- మధుబాల, దేవానంద్), దిలేనాదాన్ (1953- శ్యామా, పీస్ కన్వాల్), డాక్ బాబు (1954- నాదిరా), వారిస్ (1954- సురయ్యా, నాదిరా), రఫ్తార్ (1955- నాదిరా), దివాలీ కీ రాత్ (1956- కూప్‌మాల, శశికళ), ఏక్ గావ్‌కీ కహానీ (1957- మాలాసిన్హా), లాలారాఖ్ (1958- శ్యామా), మాలిక్ (1958- సురయ్య), సోనేకీ బిడియా (1958- నూతన్) చిత్రాలలో నటించిన తలత్‌కు ఆ తర్వాత నటనకన్నా, గానం మీదే దృష్టిమళ్ళింది. 1958 తర్వాత ఆయన నటనకు స్వస్తిచెప్పి, గాయకుడిగానే స్థిరపడ్డారు. అయినా, ప్లేబాక్ వచ్చిన తర్వాత కాలంలో తొలి 'సింగింగ్ స్టార్' ఆయనే అనవచ్చు!!

చలనచిత్ర గాయకుడుగా, గజల్ గాయకుడుగా తలత్ అధిరోహించిన శిఖరాలు అనేకం 'పద్మభూషణ్' పురస్కారాన్ని పొందిన తొలి చలన చిత్ర గాయకుడు ఆయనే! (అప్పట్లో లతామంగేష్కర్‌కూడా 'పద్మభూషణ్'గానే ఉండేవారు. మహ్మద్‌రఫీ, మన్నాడే, మహేంద్రకపూర్‌లు ఆ తర్వాత 'పద్మశ్రీ' పురస్కారాన్ని పొందారనేదీ ఇక్కడ ప్రస్తావించుకోవచ్చు!)

1. ఉర్దూ, హిందీ, బెంగాలీ, భోజ్‌పురి, తెలుగు, మరాఠీ, గుజరాతీ, మళయాళం, పంజాబీ, సింధీ, అవధి, మార్వారీ, అస్సామీ భాషల్లో- మొత్తం 12 భాషాల్లో 747 హిట్స్‌ను పాడిన ఘనత ఆయనదే!

2. తొలిసారిగా విదేశాల్లో సంగాతకార్యక్రమాలు నిర్వహించిన ఘనతా ఆయనదే! 1956లో కేవలం 6 షోల కోసం తూర్పు ఆఫ్రికాకు వెళ్ళిన తలత్, ఆఖరికి 25 సంగీత కార్యక్రమాలలో పాల్గొని కానీ తిరిగి రాలేక పోయారంటే- ఆయనకు లభించిన అపూర్వ ఆదరణ ఎవరైనా అర్థం చేసుకోవచ్చు!

3. అసలు మన భారత ఖండలో తొలిసారి 'సిల్వర్ డిస్క్' పొందిన ఘనత కూడా ఆయనదే! కరాచీలోని కరాచీ స్టేడియంలో సుమారు 60వేల మంది శ్రోతలు, అభిమానుల ముందు తలత్‌కు ఇ.ఎమ్.ఐ సంస్థ 1961లో సిల్వర్‌డిస్క్‌ను అందజేసింది.

4. వెస్ట్ ఇండీస్‌లో ఆయన సమర్పించిన సంగీతోత్సవం తీరేవేరు. ఆయన కోసం వెస్ట్ ఇండీస్‌లో నెం.1 అయిన స్టీల్ బాండ్‌వారు. 'తలత్ మెహమూద్, వుయ్ ఆర్ ప్రౌడ్ అండ్ గ్లాడ్, టు హావ్ ఏ పర్సనలి' దీ లైక్ యూ హియర్ ఇన్ ట్రినిడాడ్' అంటూ ఓ ప్రత్యేక గీతాన్ని

ఆయనకోసం రూపొందించి, దేశమంతా గానం చేశారు. అంతటి గౌరవం నాటికీ, నేటికీ ఆయనకే దక్కిందనేది వాస్తవం!

5. దూరదర్శన్ తొలిసారిగా కలర్‌లో ప్రసారాలు ఆరంభించిన తొలిరోజుల్లో - తొలి డాక్యుమెంటరీని ఎవరి గురించి తీయాలా అని ఆలోచించి, చివరకు దానికి తలత్ మెహమూద్‌ను ఎంచుకున్నారు. నిజానికి ఆయనపై తీసిన 'ష్యామ్ ఏ గమ్‌కీ ఖసమ్' డాక్యుమెంటరీ- దేశంలో తొలి కలర్ డాక్యుమెంటరీగా ప్రసారం కావాల్సి ఉంది గానీ, ఏదో కారణాల వల్ల ఆలస్యమయి, రెండో డాక్యుమెంటరీగా ప్రసారమయింది.

6. తలత్‌కు దేశంలో అభిమాన సంఘాలు అనేకంగా వుండేవి. ఒక గాయకుడిని ఆరాధిస్తూ అభిమాన సంఘాలు ఏర్పడటం ఆయనతో ఆరంభం!

7. తలత్‌కు కొత్త వస్తువులంటే చాలా ఇష్టం. వీడియో ప్లేయర్, ఎలక్ట్రిక్‌షేవర్, కాసెట్‌ప్లేయర్, ఎలక్ట్రిక్ టూత్‌బ్రష్, వాక్‌మన్, 8 యం.యం.కెమెరా, ప్రొజెక్టర్‌లవంటి వన్నీ మొదట్లో ఆయనే కొనేవారు. ఇదంతా చెప్పటం దేనికంటే, ఆయనకు 'గజల్ రాజా' లా పేరు పొందటమే కాదు, అలా బతకటమూ ఇష్టంగానే ఉండేది!

8. ఆయన అభిమానుల్లో సామాన్యులే కాదు, నేపాల్‌రాజు వీరేంద్ర, అఫ్ఘాన్‌రాజు జహీర్‌షా వంటివారూ ఉండేవారు. జహీర్‌షా అయితే తలత్‌కు ఒక పెర్షియన్ కార్పెట్‌ను కానుకగా ఇచ్చారు.

9. 'జహనారా' చిత్రంలో 'ఫిర్ వోహీ ష్యామ్, వోహీ గమ్' పాటలో ఆయనకు వేణువుతో



సహకారం అందించిన వ్యక్తి హరిప్రసాద్ చౌరాసియా! చౌరాసియాకు అదే తొలి చలన చిత్రరంగ ప్రవేశం! 'మీతో మీ పాటకు సంగీతం కలపటం నా అదృష్టం!' అని చౌరాసియా, తలత్‌కు తన కృతజ్ఞతలు తెలియజేశారు.

10. సుమన్ కల్యాణ్‌పూర్ (అప్పట్లో ఆమె 'సుమన్ హెమ్మడే') తొలి పాట కూడా తలత్ మెహమూద్‌తోనే కావడం విశేషం. 'దర్వాజ్' చిత్రంలో ఆయనతో కలిసి తొలి పాట పాడటంతోనే, తనకు పరిశ్రమలో సముచిత స్థానం లభించిందని ఆమె నేటికీ అంటారు.

11. తలత్ మెహమూద్ పాటలోనే కాదు, అందం ఆయన కంఠంలోనూ ఉండేది. అయితే హీరోగా ఆయనతో నటించేందుకు తగిన అందగత్తె కావాలని భావిస్తూ, 'దిలే నాదాన్' చిత్రంలో హీరోయిన్ కావాలంటూ నిర్మాత - దర్శకుడు ఏ.ఆర్. కర్దార్, దేశంలో 'ఆల్ ఇండియా బ్యూటీ కాంటెస్ట్'ను నిర్వహించారు. అప్పట్లో దేశంలోనే నెం1 టూత్ పేస్ట్ సంస్థ అయిన 'కాలీనోస్'వారు ఆ పోటీకి సహనిర్వాహకులు. పీస్‌కన్వల్ అనే అందాల యువతి ఆ పోటిలో నెగ్గి, తలత్ సరసన కథానాయికగా ఆ చిత్రంలో నటించింది.

1960 తర్వాత హిందీ సంగీతరంగంలో సంగీతం తగ్గి, రణగొణ ధ్వనులు పెరగటంతో, తలత్‌కు చిత్రరంగం మీద ఆసక్తి తగ్గిపోయింది. అయినా ఆ తర్వాత ఆయన అనేకానేక గజల్స్‌ను పాడుతూనే వచ్చారు. 1986లో హెచ్.ఎమ్.వి.వారు ఆయన పాడిన గజల్స్‌ను 'గజల్‌కే సాజ్ ఉఠావో' పేరు మీద ఆల్బమ్‌గా విడుదల చేశారు. అదే ఆయన ఆఖరి రికార్డింగ్. తన గజల్స్ గానంతో కోట్లాదిమందిని సమ్మోహితుల్ని చేసిన తలత్ 1998 మే 9 న తను పాడిన పాటల్ని మాత్రం మిగిల్చి, తాను కనుమరుగై పోయారు. నేటికీ గజల్స్‌ను గానం చేస్తున్నవారు ఎందరో ఉన్నా, వారందరికీ స్ఫూర్తి మార్గదర్శకం మాత్రం తలత్ మెహమూద్ అన్నది వాస్తవం.

**-పాలకోడేటి**

---




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. కింకరుడు (భూకైలాస్-ఈ మేను)
ఎ) రాక్షసుడు బి) భక్తుడు
సి) ద్వారపాలకుడు డి) సేవకుడు

2. నీతిదూరుడు (భూకైలాస్.... తగునా వరమీయ)
ఎ) నీతిమంతుడు బి) అధ్యాపకుడు
సి) నీతిలేనివాడు
డి) నీతులు వల్లించువాడు

3. సోపానం (భూకైలాస్ - రాముని)
ఎ) ఆసనము బి) మెట్టు
సి) దగ్గరదారి డి) పానీయం

4. మిష (భూకైలాస్ - రాముని)
ఎ) ప్రయత్నం బి) కార్యము
సి) యంత్రము డి) సాకు

5. నిధానం (భూకైలాస్- రాముని)
ఎ) దానము బి) కారణం
సి) నిధి డి) విలాసము

6. కూటమి (భూకైలాస్ - అందములు)
ఎ)అందము బి) సమూహము
సి) సృష్టి డి) చావడి

7. ముదము (భూకైలాస్- సుందరాంగా)
ఎ) సంతోషము బి) తైలము
సి) కోరిక డి) ముఖము

8. మేను (భూకైలాస్ - సుందరాంగా)
ఎ) దేహము బి) పల్లకి
సి) మనసు డి) భావము

9. చాపము (భూకైలాస్ - రాముని)
ఎ) మత్స్యము బి) విల్లు
సి) బాణము డి) శాపము

10. కేలు (భూకైలాస్ - సుందరాంగా)
ఎ) వేలు బి) కాలు
సి) హస్తము డి) నడుము

### జవాబులు

1) d 2) c 3) b
4) d 5) b 6) d
7) a 8) a 9) b
10) c

బాలు




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



# వివాహ మహోత్సవ దృశ్య చిత్రీకరణోపాఖ్యానం!

**ఆ**చంట దగ్గరలో ఒక గ్రామం. ఆ గ్రామంలో సినిమా షూటింగు. ఎప్పుడూ? సంవత్సరాల క్రితం. బ్లాక్ అండ్ వైట్ రోజులు. ఆ సినిమా పేరు గుర్తుకు రావడం లేదు. ఎంచేతంటే సినిమాకి నామకరణం చివరి దశలో జరుగుతుంది- మనుషులకి తొలి దశలో జరిగినట్టు కాకుండా. అంచేత, కొన్ని సినిమాల పేర్లు నోట్లో ఆడవు. అలాంటి సినిమాలు థియేటర్లలో కూడా ఆడవు. ఇంక పేరు గుర్తుండడం అనేది కల్ల. ఆ సినిమా డైరెక్టరు (పేరు చెప్పొచ్చా?.... చెబితే బావుండదేమో.... బావుండేదేమిటి? నిజమే కదా, ఆయనే కదా డైరెక్టరు! జరిగిన విషయమే కదా... కచ్చితంగా చెప్పొచ్చు.... ఐనా ఎందుకులే... తెలిసిన వాళ్ళకి తెలుస్తుంది, గోప్యంగా వుంచుదాం) నిర్మాత కూడా. అది వాళ్ళ వూరే గనక, చాలా విషయాలు కలిసి వస్తాయని అక్కడే షూటింగ్ ప్లాన్ చేశారు.

ఆ సినిమాలో పెళ్ళి దృశ్యం వుంది. బాగా తియ్యాలని దర్శకుడికీ వుంది. ఆలోచించగా, ఆ వూళ్ళో ఒక పెద్దమనిషి గారి అమ్మాయిగారికి పెళ్ళి. ఆ పెళ్ళిలోనే మన షూటింగు కూడా పెట్టేస్తే, ఎంతోమంది పెళ్ళి పెద్దలు, పట్టు చీరలు కట్టుకుని స్త్రీ సమూహాలు, భోజనాలు, హడావుడి.... బ్యాండుమేళం, సన్నాయిమేళం ఖర్చులు కూడా వుండవు. పురోహితులు కూడా అక్కర్లేదు. వాళ్ళే వుంటారు. ఏముంది? ఆ పీటల మీదనే హీరో హీరోయిన్లకు పెళ్ళి చేయించేస్తే సరి! ఈ అద్భుతమైన ఊహకి రెక్కలొచ్చి, ఆ రెక్కలు వెళ్ళి ఆ పెళ్ళి పెద్ద మనిషికి, విషయం వివరించి అనుమతి అడిగాయి. "పెళ్ళిలో షూటింగా? గంద్రగోళం అవుతుందేమో!" అని పెద్దాయన సందేహం వెలిబుచ్చితే, చిన్నవాళ్ళు "చాలా బావుంటుంది నాన్నా. మనమందరం ఆ సినిమాలో కనిపిస్తాం. మేం కెమెరాకి దగ్గర్లో వుంటాం. పైగా మన పెళ్ళి అంతా సినిమాలో చూడవచ్చు. (అప్పటికి వీడియో రాలేదు మరి) ఒప్పుకో నాన్నా ఒప్పుకో" అని గోల చేశారు. పెద్దాయన ఒప్పుకున్నాడు. వెంటనే దర్శకుడు తప్పుకున్నాడు. తన బృందంతో విషయం చెప్పుకున్నాడు. పెళ్ళి పెద్దాయన్ని తన వేపుకి తిప్పుకున్నాడు.

పెళ్ళి రోజొచ్చింది. సందడే సందడి. అసలే పెళ్ళి సందడి, అందులో షూటింగు సందడి. దానికితోడు ఊళ్ళో వున్న వాళ్ళు పక్క గ్రామాల వాళ్ళూ కూడా హాజరైపోయారు. సూర్యోదయంతో పాటు. పెళ్ళి చూడ్డానికి వచ్చినవాళ్ళు, షూటింగు చూడ్డానికి వచ్చినవాళ్ళూ సమేకం అయిపోయారు. కొంతమంది 'అనతిధులు' టిఫిన్లు తినేస్తుంటే పెళ్ళివారు పసికట్టి, వాళ్ళ చేతుల్లోని ప్లేట్లు లాగేసుకుని దూరంగా పంపించేశారు. కొంత రభస, కొంత గొడవా కూడా జరిగింది. దర్శక నిర్మాత, ఎలాగూ పెళ్ళి దగ్గరకి వెళ్తున్నాం గనక, ప్రొడక్షన్ టిఫిన్లు తెప్పించలేదు. లైట్‌మెన్‌నీ, తక్కిన బృందాన్నీ అక్కడే తినమన్నారు. వాళ్ళు తినడానికి వెళ్తే, వడ్డించేవాళ్ళు తిరస్కరించారు- మీరెవరో మాకు తెలీదన్నారు. దాంతో వాళ్ళు ఇన్‌సల్ట్ ఫీలయి వెళ్ళిపోతే, ప్రొడక్షన్ మేనేజరు వెళ్ళి బతిమాలి తీసుకొచ్చి "వీళ్ళంతా మా షూటింగు బృందం బాబూ-, బాగా టిఫిన్లు పెట్టండి. మీమీద కూడా మంచి లైట్లు వేస్తారు; బొమ్మలో అందంగా కనిపిస్తారు- హీరో హీరోయిన్లకంటే..." లాంటి కబుర్లు చెప్పి రెండేసి ప్లేట్ల టిఫిన్లు పెట్టించాడు. అంతలో ఒ అమ్మాయి వాళ్ళ దగ్గరకొచ్చి కాఫీ అందిస్తూ "లైట్‌మాన్ గారూ! లైట్‌మాన్‌గారూ! నా మీద బాగా లైటింగ్ వెయ్యరూ- అందంగా పడతాను"



అంది. వాళ్ళంతా మద్రాసు నుంచి వచ్చిన వాళ్ళు. తెలుగు రాదు. "సరిదా" అనేశాడు ఒకతను నవ్వుకుంటూ.

షూటింగ్ మొదలెట్టాలన్నారు దర్శకుడు, ఛాయాగ్రాహకుడూ. పెళ్ళి బట్టలతో హీరో హీరోయిన్లు రడీ అయారు. వాళ్ళ తలిదండ్రులు, తక్కిన పాత్ర ధారులూ మేకప్‌లు అవుతున్నారు. పెద్ద పెళ్ళిపందిరి. దాన్నిండా జనం. ఆ పందిట్లోనే ఒక మూల మేకప్‌లు జరుగుతుంటే, పెళ్ళి వారంతా అక్కడ చేరి వింతగా చూడ్డం మొదలెట్టారు. అసలు పెళ్ళిలోనూ హడావుడిగానే వుంది. పురోహితులు తతంగం మొదలుపెట్టారు. "ఒరేయ్ చిన్న శాస్తుల్లూ! కొబ్బరికాయ అందుకో" అని పెద్ద పురోహితుడు కేకపెడితే- ఏడీ! చిన్న శాస్తుల్లు మేకప్ చూస్తూ మురిసిపోతున్నాడు. పెళ్ళి కొడుకు తండ్రి తల్లి పీటల మీద కూచున్నారు. పురోహితుడు మంత్రాలు చదువుతూన్నాడు. కెమెరా వాళ్ళకి ఎదురుగా పెట్టారు. దీపాలు వెలిగిస్తున్నారు. పురోహితుడు మంత్రాలు చదువుతున్నాడేగాని, ధ్యాసంతా ఆ దీపాలమీదా కెమెరామీదా వుంది. పెళ్ళి కొడుకు తల్లీ తండ్రీ తాము కెమెరాలో పడిపోతాం కాబోలని వెర్రిగా చూస్తున్నారు. తల్లి తన ముఖానికి పట్టు చీరచెంగు అడ్డువేసింది. అంతలో హీరో తలిదండ్రులు మేకప్‌లయి దుస్తులు వేసుకుని షాట్‌కు సిద్ధమయ్యారు. "వాళ్ళిద్దర్నీ పీటల మీదనుంచి లెమ్మంటే మావాళ్ళిద్దరూ కూచుంటారు. మీరు అవే మంత్రాలు చదవండి. షాటు తీసుకుంటాను" అన్నాడు డైరక్టరు పురోహితుడితో. "ఇంకా ఈ తతంగం పూర్తికాలేదే" అని పురోహితుడు, "పర్వాలేదు. మళ్ళీ ఈ కంటిన్యూ చేదురుగాని. మాకు షూటింగ్‌కి ఆలస్యమవుతుంది" అని దర్శకుడూ వాదులాడుకున్నారు. ఈ గొడవల్లో పీటల మీదనుంచి అసలు వాళ్ళు లేచిపోవటం, యాక్టర్లు కూచోడం జరిగిపోయింది.

"మీకేం డైలాగుల్లేవు. ఆయన మంత్రాలు చెబుతూవుంటారు. ఆయన ఎలా చెప్తే అలా చెయ్యండి. ఆయనే డైరెక్టరు ఈ షాటుకి" అన్నాడు డైరక్టరు. పురోహితుడిని మంత్రాలు చెప్పమన్నారు. మళ్ళీ చెప్పాలంటే దీనికి సంభావన ఎవరిస్తారంటాడు పురోహితుడు "మేమిస్తాం కానీండి" అన్నారు ప్రొడక్షన్ వాళ్ళు. "లైట్స్...." అని ఓ కేక వినిపించగా, పురోహితుడు మంత్రం మొదలు పెట్టాడు. "ఆగండి... నేను చెప్తాను. ఇప్పుడు చెప్పండి" అన్నాడు డైరక్టరు. దీపాలు వెలుగుతూవుంటే, ఎక్కడెక్కడ వున్నవాళ్ళూ దగ్గరకొచ్చేసి పీటల పక్కన నించున్నారు. కొందరు పురోహితుడి చుట్టూ మూగిపోయి కెమెరా చూస్తున్నారు.

"నేను కనబణ్ణా ఏమిటి..... తప్పుకోండి" అని పురోహితుడూ,

"తప్పుకోండి" అని అసిస్టెంటు డైరక్టరూ అరుస్తున్నారు. వెనకాల వున్న జనం అంతా పీటల మీద కూచున్న నటుల మీద పడిపోతున్నారు. "తోసుకోకండయ్యా బాబూ. వేం నలిగిపోతాం" అని హీరో తండ్రి గోలపెట్టాడు. "ఆవిడెవరు సార్.... మీ పక్కన కూచున్న ఆవిడ?" అని ఒకడు ఆ సందులోనే అడిగాడు.

"నా భార్య వేషం!"

"పేరు?"

"ఉండవయ్యా బాబూ... షాట్ తియ్యాలి... సైలెన్స్" అని డైరెక్టరు అరిచాడు. "తియ్యండి... తియ్యండి... రెడీ టేక్" అన్నాడు డైరెక్టరు. పురోహితుడు మంత్రాలు మొదలెట్టాడు. "స్టార్ట్" అన్నాడు డైర్టకరు. ఛాయాగ్రాహకుడు కెమెరాలోంచి చూసి, "సార్ అందరూ కెమెరాలోకి చూస్తున్నారు సార్... ఎలా తియ్యడం?" అన్నాడు జాలిగా.

"ఎవరూ కెమెరా వేపు చూడకండి. పురోహితుడి వేపు చూడండి..." అన్నాడు డైరక్టరు.

"ఆడివక్క చూస్తే మా ముఖమేటి తెలుస్తాది? అని ఓ యువకరత్నం గొణిగింది. మొత్తానికి షాట్ పూర్తయింది. ఈలోగా, కెమరామెన్ పెళ్ళి పందిరి, జనం, బాజాలూ అన్ని షాట్స్ తీశాడు. శుభముహూర్తానిని వేళయింది. నిజం పెళ్ళి కూతురుని గంపలో తీసుకొచ్చాడు. "ఆగండి ఓసారి ఆ గంప ఇవ్వండి బాబూ... మా పెళ్ళి కూతుర్ని కూడా తీసుకొచ్చేస్తాం" అని అసిస్టెంటు డైరక్టరు అడిగితే, ఆ గంప ఇవ్వకూడదన్నారు. వధూవరులు ఇద్దరూ కూచున్నారు. మధ్యలో తెర పట్టారు. "ఈ షాటు మనం కూడా తియ్యాలి కదు సార్" అని సహాయ దర్శకుడు గుర్తు చేశాడు. "అక్కర్లేదు. ఇదే తీసుకుందాం. పెళ్ళికొడుకు వెనక్కి తిరిగివున్నాడు. అవే తెల్ల బట్టలు. తెరవెనుక పెళ్ళి కూతురు కూచుంది. తెలీదు" అని కెమెరామాన్‌కి చెప్పి షాట్ తీయించాడు డైరక్టరు - ఆనందపడిపోతూ.

"తాళికట్టు శుభవేళ...." అని పాడినట్టు ఆ శుభవేళ వచ్చేసింది. అందరికీ అక్షింతలు ఇచ్చారు." పెళ్ళి కొడుకు తాళి కట్టేయగానే మన షాటు తీసుకుందాం. రెడీ. హీరో హీరోయిన్లు ఇక్కడ వున్నారా" అన్నాడు దర్శకుడు.

అంతలో అసిస్టెంటు, డైరెక్టరు చెవిలో గొణిగాడు. "సార్ మనవాళ్ళు మంగళ సూత్రాలు తేవడం మరిచిపోయారు!"

"ఆఁ" అని కోపంగా అని, మళ్ళీ సర్దుకుని "పర్వాలేదులే వాళ్ళ మంగళసూత్రాలు అడుగుదాం. మళ్ళీ ఇచ్చేద్దాం" అన్నాడు డైరక్టరు "ఫ్లాష్" తట్టినందుకు ఆనందపడిపోతూ.

"డైరక్టోరియల్ టచ్ అంటారు ఇదేనా గురూ?" అని సహాయకుడు అడిగాడు. "ఇదే" అన్నాడు డైరక్టరు. పెళ్ళి పెద్దగారిని కలిసి మంగళసూత్రాలు ఓసారి ఇమ్మన్నారు దర్శకుడు. "అదెలా ఇస్తాం! ముందు మీరు మీ హీరోయిన్ మెడలో కడితే, అది మా అమ్మాయికి పనికిరాదు. పెళ్ళికొడుకు కట్టిన తర్వాత ఆ ముడి విప్పకూడదు అన్నాడు పెళ్ళి పెద్ద. ఈ చిక్కుముడి ఎలా విప్పడమో డైరెక్టరుకి అర్థం కాలేదు, టోపీ తీసి తల గోక్కున్నాడు.

సన్నాయి మేళం తారాస్థాయిలో వుంది. "మాంగల్యం తంతునానేనా" అంటున్నారు పురోహితులు. పెళ్ళికొడుకు తాళి కడుతున్నాడు. "ఎందుకేనా మంచిది! ఇదే షాటు తియ్యి..." అని డైరక్టరు, షాటు తీయించాడు. అందరూ అక్షింతలు చల్లారు. "మన వాళ్ళంతా ఎందుకు చల్లారయ్యా, మన షాటుకి అక్షింతలుండవు" అని అరిచాడు డైరక్టరు.

"వాళ్ళని లెమ్మనండి. మావాళ్ళు పీటల మీద కూచుంటారు పురోహితుడుగారూ" అన్నాడు డైరెక్టరు. అలా లేవకూడదంటాడు. "ఇంకా చాలావుంది. చదివింపులున్నాయి"

వధూవరులు తలంబ్రాలు పోసుకుంటుంటే, అదీ షూట్‌చేశారు- వాళ్ళ భాషలో "సేఫ్టీ" కి. కెమెరామాన్ హీరో హీరోయిన్ల ముఖాలు షాట్‌లో తెలియాలి గనక, తాళికట్టడం కావాలంటాడు. క్లోజప్స్ తియ్యాలంటాడు. తాళి లేదు! ఎవర్ని విప్పి ఇవ్వమంటే ఎవరిస్తారు?- అని ఘర్షణ. సప్తపది అవీ వున్నాయి, ఆలైట్లూ గట్రా తీసి దూరం పెట్టమంటున్నారు పెళ్ళివారు. డైరక్టరుకి విసుగొచ్చేసింది. "చిన్న పెళ్ళిమంటపం సెట్టు వేసుకుని మద్రాసులో తాళికట్టేది తీసుకుందాం" అన్నాడు. "తాళి కట్టిన తర్వాత పెద్ద సీనుంది. దానికి జనం వుండాలి. పెళ్ళి పందిరి కంటిన్యుటీ అవుతుందే" అంటున్నారు కెమెరామాన్, అసిస్టెంటూ. "చూదాంలేండయ్యా - సీను మార్చుదాం. ఘర్షణ సీను శోభనంలో పెట్టుకుందాం. ప్రస్తుతానికి పేకప్ చెయ్యండి" అన్నాడు దర్శక నిర్మాత - విసిగిపోయి.

ఆ విధంగా "రసాభాసోపాఖ్యానం" ముగిసింది. "పెళ్ళి సరిగా జరగలేదు, షూటింగూ సరిగా జరగలేదు" అనుకున్నారు ఉభయ పార్టీలవారూ. ■

**రావి కొండలరావు**
**502, సన్నీ రెసిడెన్సీ,**
**165, మోతినగర్,**
**హైదరాబాద్ - 500 018.**
**ఫోన్: 23830137**




గత సంచికలో 6 పాటల విశ్లేషణలను పొందుపరుచుకున్న ఏవియం వారి



చిత్రంలోని పాటలలో మరొక ఆరు ఈ సంచికలో...

మండోదరి : ప్రేమలీవిధమా - విషాదమే ఫలమా
మన్నాయెనా, మా ఆశలు
కన్నీరే మిగిలేనా ॥ప్రేమలీ॥
కన్నెమది చిరువెన్నెల
పున్నమియె కరువాయెనా
తీరని మదికోరిక
కొనసాగగా దరిజేరినా
తరితీయని మన ప్రేమలా
తండ్రియె దూరము చేసే ॥ప్రేమలీ॥
మనరాగమేగా అనురాగం
తనువూ మనసూ సాగిసే ప్రేమరాగం ॥మన॥
రావణ : కోరిన ప్రియులు చేరిన వెనుక
కూరిమి బేరము లాడగనేల ॥కోరిన॥
మండోదరి : కన్నులపూచే నిన్నుగనీ
రావణ : మనసు దోచేసి చేసె, నీదాసుని
మండోదరి : కొనవోయి వెల వోసితి నా మది
రావణ : తీయని కోరికలు తీరును రావె ॥మన॥



సుశీల, ఘంటసాల పాడిన ఈ పాటను జమున, ఎన్.టి.రామారావు అభినయించారు. సన్నివేశ ప్రాధాన్యంగా యస్వీ రంగారావు కూడా కనిపిస్తారు. పాడిన వారి గళం పూర్తిగా వారి ఆధీనంలో ఉన్నప్పుడే సర్వస్వర సంచారం చేయగలుగుతుంది. ప్రతి స్వరస్థానంలోనూ, ఆరోహణ అవరోహణలలోనూ, గమకాలలోను, మలుపుల్లోనూ అందంగా ఒదుగుతుంది. ఈ పాటను కనుక గాయనీ గాయకులు యథాతథంగా పాడి చూసుకుంటే వారి కంఠం వారి ఆధీనంలో ఎంతవరకూ ఉందో, ఉంటుందో తెలిసిపోతుంది. అంత టిపికల్ కంపోజిషన్ యిది. ఇక సాహిత్య పరంగా ఓ రెండు పదాల్ని కూడా గమనించాలి. ఒకటి సాగిసే... రెండు ప్రియులు. అందమైన, ఇంపైన అనే అర్థంలోనే సాగిసే అనే పదాన్ని ప్రయోగించటం జరిగింది. ప్రేయసీప్రియులిరువుర్నీ ప్రేమికులు అనచ్చు కనుక ఒకరికొకరు ప్రియమైన వారు కనుక ప్రియులు అనే పదం కచ్చితంగా నప్పుతుంది. ఇక రావణుడు పౌరుష పరాక్రమవంతుడు, రాజు కనుక 'రాయల్ వుయ్' లా 'ప్రియులు' అని తనని సంభావించుకున్నాడని కూడా చమత్కారంగా అనుకుంటే అనుకోవచ్చు.

ద్వారపాలుర మరల దరిచేయు కృపయో
ధరలోన ధర్మము నెలకొల్పు నెపమో
రాముని అవతారం
రవికుల సోముని అవతారం ॥రాముని॥
సుజన జనావన ధర్మాకారం
దుర్జన హృదయ విదారం ॥రాముని॥






దాశరథిగ శ్రీకాంతుడు వెలయు
కౌసల్యాసతి తపము ఫలించు
జన్మింతురు సహజాతులు మువ్వురు ॥జన్మింతురు॥
లక్ష్మణ శత్రుఘ్న భరత ॥రాముని॥






చదువులు నేరుచు మిషచేత
చాపము దాలిచి చేత
విశ్వామిత్రుని వెనువెంట
యాగము కావగ చనునంట
అంతము చేయు నహల్యకు శాపము ॥అంతము॥
ఒసగును సుందర రూపం ॥రాముని॥






ధనువో జనకుని మనసున భయమో
ధారుణి కన్యా సంశయమో
దనుజులు కలగను సుఖగోపురమో ॥దనుజులు॥
విరిగెను మిథిలా నగరమున ॥రాముని॥
కపట నాటకుని పట్టాభిషేకం
కలుగును తాత్కాలికా శోకం






భీకర కానన వాసారంభం
లోకోద్ధరణకు ప్రారంభం
భరతుని కోరిక తీరుచు కోసం
పాదుక లొసగే ప్రేమావేశం
నరజాతికి నవ నవసంతోషం ॥నరజాతికి॥
గురుజన సేవకు ఆదేశం ॥రాముని॥





అదిగో చూడుము బంగరు జింక
మన్నై చనునయ్యో లంక
హరనయనాగ్ని పరాంగనవంక
అడిగిన మరణమె నీ జింక
రమ్ము రమ్ము హే భాగవతోత్తమ
వానర కుల పుంగవ హనుమాన్ ॥రమ్ము॥
ముద్రిక కాదిది భువన నిదానం ॥ముద్రిక॥
జీవన్ముక్తికి సోపానం ॥జీవన్ముక్తి॥





రామరామ జయ రామరామ
జయ రామరామ రఘుకుల సోమా
సీతాశోక వినాశనకారి
లంకా వైభవ సంహారి
అయ్యో రావణ భక్తాగ్రేసర
అమరం బౌనిక నీ చరిత
సమయును పరసతిపై మమకారం
వెలయును ధర్మ విచారం ॥రాముని॥





'రాముని అవతారం' అనే మకుటంతో సాగే ఈ పాటలో - తరచిన కొద్దీ దొరికే ముత్యాలను అందిస్తూ - కవిగా తన లోతులను ప్రదర్శించారు సముద్రాల. రాముడు సూర్యవంశానికి చంద్రుని వంటి వాడట. ఆయన అవతారం ఈ భూలోకంలో ధర్మాన్ని నెలకొల్పడానికి ఓ నెపమే గానీ - నిజానికి తన ద్వారపాలురైన జయవిజయులను తిరిగి తన దరికి చేర్చుకునే కృపయెనట. విషయాన్ని తిప్పి చెప్పితే ఎంత గొప్పగా ఉంటుందో ఈ సాకీ తెలుపుతుంది. సీతా స్వయంవరం వర్ణనలో - ఈ విల్లుని ఎక్కుపెట్ట గల వారెవరైనా ఉన్నారా అని అనుకునే జనకుని మనసులో భయాన్ని, సీత మనసులో సంశయాన్ని, రాక్షసుల స్వప్న సౌధాన్ని వీటన్నింటినీ ముక్కలు చేస్తూ మిథిలా నగరంలో రాముడు ఎక్కుపెట్టిన విల్లు విరిగిపోయిందట. నెపమే అయినా లోకోద్ధరణకు రాక్షస సంహారం తప్పనిసరి కనుక అందుకు దారి తీయించే అరణ్యావాసం, దానికి మూలంగా నిలిచి విఫలమైన పట్టాభిషేకం, అది కలిగించే తాత్కాలిక శోకం అంతా ఆ లీలా మానుష వేషధారి కల్పించిన కపట నాటకమే. ఇవే భావాల్ని సముద్రాల ఎంత రసవత్తరంగా అందించారో తల్చుకుంటే మనసు పులకరించి పోతుంది. ఇక మాయలేడిని వర్ణిస్తూ - అది బంగరు జింక మాత్రమే కాదట, అడిగిన మరణం లాంటిదట, పరసతి - శివుని మూడో కన్ను వంటిదట - ఇలా చెప్పాలనుకున్న విషయాన్ని వీలయినంత నవీనంగా, 'కవీనం'గా, కమనీయంగా, గమనీయంగా చెప్పిన సముద్రాల - సీనియర్‌నని - మరోసారి నిరూపించుకున్న పాట ఇది.

స్వరపరంగా విశ్లేషిస్తే పాట సాహిత్యాన్ని పక్కన పెట్టేసి - కేవలం వరసని మాత్రం మననం చేసుకుంటూ పోతే -మధ్యలో వచ్చే - సుజన జనావన ధర్మాకారం - దగ్గర లయని కొంచెం త్వరితం చేస్తే - మూలం దొరికిపోతుంది. పల్లె పదాలుగా. లొల్లాయి పదాలుగా విస్తరించుకుంటూ పోయిన జానపద సంగీతం స్పష్టంగా దర్శనమిస్తుంది. ఘంటసాల హిట్స్‌లో నిలిచిపోయిన ఈ పాటగురించి మరొక 50 ఏళ్ళ తర్వాత చెప్పుకున్నా కూడా ఆశ్చర్యం లేదు. అక్కినేని అభినయించిన ఈ పాటలో బి.సరోజాదేవి, విజయనిర్మల(సీతగా) మొదలగువారు కనిపిస్తారు.

నా నోము ఫలించెనుగా
నా నోము ఫలించెనుగా నేడే ॥2॥
సురభామినులు
తలచేవలచే
నవప్రేమామృత సారములు
చవులు గొలిపే నేడే ॥నా నోము॥
కాంతి సోయగమించి
ఆశలు పెంచె
ప్రేమిక హృదయాల ॥కాంతి॥
విరహానల తాపము బాయెగా
తొలిప్రేమలు పూలు పూచి కాయగా
నవ ప్రేమామృత సారములు
చవులు గొలిపే నేడే ॥నా నోము॥
నీదు సొమ్మేరా నా మేను సుకుమార (వీణ)
మృదు గానమీవు లయనౌదు నేను
చేసేము రాగసాధన (వేణువు)
తానన తాన తన్నానన (మృదంగం)
భావరాగ తాళమేళన (మోర్‌సింగ్)
శృంగార కలిత (ఘటం)
సంగీత భరిత (మోర్‌సింగ్)
సరళ (వీణ)
సరస (వేణువు)
రీతి (ఘటం)
గీతి (మోర్‌సింగ్)
సరళ సరస రీతి గీతి
సరళ సరస రీతి గీతి
పొరలిపొంగు వారు విమల ప్రీతి
జగజగాల విరియజేయు హాయి
అమర సౌఖ్యమావహించు రేయి
నా నోము ఫలించెనుగా



తెరపై జమున, ఎన్.టి.ఆర్. అభినయించిన 'నా నోము ఫలించెనుగా' పాట రసస్ఫోరకంగా విజృంభించిన భావరాగ వాద్య సమ్మేళనంగా ఉంటుంది. యమన్ రాగాన్ని ఆధారంగా చేసుకుని ఈ పాట రూపొందింది. రావణాసురుడు సంగీత ప్రియుడు కనుక అతనిలోని ఆ ప్రతిభను వెల్లడించడానికి అతని చేతనే వీణ, వేణువు, మృదంగం, ఘటం, మోర్‌సింగ్ వాద్యాలను వాయింపచేస్తూ తెరపై ఆవిష్కరించిన తీరు - అందుకు ఈ పాటను మలచుకున్న తీరు శ్రవణ నయన మనోహరంగా ఉంటుంది ( అందుకే ఈ పాట సాహిత్యంలో ఎక్కడెక్కడ ఏ వాద్యాన్ని ఉపయోగించారో ఉదహరించడం జరిగింది.) సుశీల అత్యద్భుతంగా పాడిన పాటలలో ఇదొకటి. 'కాంతి సోయగమించి' అనే చరణాన్ని మూడు రకాలుగా పాడడంలో స్వరకల్పనా సామర్థ్యంతో పాటు గాయని ప్రతిభ కూడా గమనించదగ్గది. ఇక ఈ పాటను అద్యంతం గమనిస్తే సంగీత దర్శకుల మేధా సంపత్తితో పాటు దర్శకుడు, రచయిత, ఛాయాగ్రాహకుడు మొదలైన అన్ని శాఖల వారి యొక్క సామూహిక సామర్థ్యం అవగతమవుతుంది.

1. అగ్ని శిఖలతో ఆడకుమా నీవు
ఆపదపాలు గాకుమా
పరసతిగోరి పరుగులువారీ
నరకములోబడి నవయగనేల? ॥అ॥
2. జలధరశ్యామ, మంగళనామ
శ్రీపరంధామా కావుమా
పిలిచిన పలుకుమ, నెనరును చిలుకుమ
వరముల నిడుమ కమలారమణా! ॥జ॥



ఈ రెండు స్వర ఖండికలనూ ఘంటసాల పాడగా నారద పాత్రధారి అక్కినేని నాగేశ్వరరావు అభినయించారు. తొలిఖండిక పార్వతి (బి.సరోజాదేవి)ని రావణుడు (ఎన్.టి.రామారావు) అరణ్యమార్గాన నడిపించుకుపోతున్న సన్నివేశంలో వస్తుంది. రెండవ ఖండిక మాయాసురుడు (ఎస్.వి.రంగారావు) దగ్గిరికి మండోదరి-రావణుల వివాహ ప్రయత్నానికి నారదుడు వచ్చే సన్నివేశంలో వస్తుంది. మాయామోహితుడైన రావణుడు పార్వతీదేవిని ఇల్లాలిగా చేసుకొనకోరి శివుని వద్ద ఆమెను వరంగా పొంది ఆమెను తన ఇంటికి తీసుకెళుతుండగా అది తగదనే హిత బోధను సూచ్యప్రాయంగా తెలియజేయడం

తొలి స్వరఖండిక ప్రయోజనం అయితే మాయాసురుడు విష్ణుభక్తుడు కనుక అతనికి ప్రీతిపాత్రమైన విష్ణువుని స్తుతించటం రెండవ స్వరఖండికలోని ప్రధానాంశం. రెండు స్వర ఖండికలకూ మాండ్ రాగమే ఆధారం.

తగునా వరమీయ
ఈ నీతి దూరునకు, పరమ పావునకు ॥తగునా॥
స్నేహము మీరగ నీవేలగా
ద్రోహము నే జేసితి ॥స్నేహము॥
పాప కర్మ దుర్మదాంధు నన్ను
వేపక దయ చూపితేల - హర ॥తగునా॥
మంగళదాయిని, మాత పార్వతిని
మతిమాలి మోహించితి ॥మంగళ॥
కన్నులనించే శూలాల పొడిచి
కామము మాపుమా ॥కన్నుల॥
తాళజాలను సలిపిన ఘనపాప
సంతాప భరమేనిక
చాలునూ కడతేర్చుము ఇకనైన
వీని పుణ్యహీన దుర్జన్మము
పోనాడితి మతి, వేరేగతి మరిలేదు
ఈ నీచుని తల ఇందే తునకలు గానీ
మేనియ్యెడ వసివాడి మాడి మసిమసి గానీ
పాపము బాపుమా, నీ దయ జూపుమా
నీ దయ చూపుమా
చేకొనుమా దేవా - శిరము
చేకొనుమాదేవా శిరము చేకొనుమా దేవా
శిరము చేకొనుమాదేవా
చేకొనుమా దేవా శిరము చేకొను మహాదేవా
మాలికలో మణిగా నిలుపు -
కంఠ మాలికలో మణిగా నిలుపు ॥3॥
నా పాప భరము తరుగు విరుగు ॥చేకొనుమా॥



రచన, స్వరకల్పన, గానం, అభినయం, చిత్రీకరణ ఒకదానితో ఒకటి పోటీ పడిన రసావిష్కరణకు మరో దర్పణం - ఈ గీతం! భావానికి తగిన భాషను జత చేసి ప్రజల మనసులను పవిత్రమైన రసస్పర్శతో పులకింపజేయటంలోనే కవి యొక్క సంస్కారం గోచరిస్తుంది. ఈ గీతం సాహిత్యం ఆసాంతం గమనిస్తే అది అవగాహనలోకి వస్తుంది. చేకొనుమా శిరము/మాలికలో మణిగా నిలుపు అనే వాక్యాలను వివిధ రీతులలో స్వరపరిచిన విధానం, వాటిని అమృత తుల్యమైన తన గళ మాధుర్యంతో ఘంటసాల ఆవిష్కరించిన తీరు, వాటిని ఆవహింపచేసుకుంటూ వింటే గుండె సంతృప్తితో నిండిపోతుంది. పొంగిపోతుంది. కనులవెంట రసగంగగా పెల్లుబికిపోతుంది కూడా. మాయామాళవగౌళ, పీలూ రాగాల మిశ్రమంతో పాటను స్వరపరచటం జరిగింది.

ఈమేను మూడునాళ్ళ ముచ్చటేరా - మిత్తి
వెన్నంటి తిరుగుతుంటె ఎరుగవేరా
అంతలోనే మానవ ఇంత మారుపేలరా
ఐశ్వర్య దాస్యంబు మానుకోరా ॥ఈ మేను॥
అరచేత కైలాస మరయనెంతో - ఇహ
సౌఖ్యాలు మనసార జూరనెంతో ॥అర॥
ధరయెల్ల ఏలగా ఆశలేలా ॥2॥
యమ కింకరులు కాచుకుంటె కానవేరా ॥ఈ మేను॥
అత్యాశ మానవుని శత్రువంట - త్యాగ
జీవనమె వీడిపోని మిత్రమంట ॥అత్యాశ॥
శరణన్న కనుపించు దేవుడంట ॥2॥
తన కింకరుల చేవిడక కాచునంట ॥ఈ మేను॥



రావణుని చేతిలో వున్న ఆత్మలింగాన్ని నేలపై ఉంచే ప్రయత్నంలో తోడ్పడానికి విఘ్నేశ్వరుడు ఓ బాల పశుల కాపరిలా వచ్చి రావణుని కంట పడడానికి పాడుకుంటూ వెళ్ళే సన్నివేశంతో ఈ పాట వస్తుంది. జీవికి అహంకారం ప్రబలినపుడు అది భక్తితో కూడినదే అయినా ఆ పొరలను తొలగించడానికి, అంతర్ముఖుణ్ణి చేసి ఆత్మ దర్శనంతో తిరిగి పునీతుణ్ణి చేయడానికి తాత్వికచింతన, ఆధ్యాత్మిక ప్రబోధం అవసరమవుతుంది. ఈ పాట ప్రయోజనం అదే! ఇందులో కొంతమందికి అర్థం కాని పదం అంటూ ఉంటే అది ఒక్కటే ... మిత్తి...! మిత్తి అంటే మృత్యుదేవత!!

ఇప్పటికి ఈ 'భూకైలాస్' చిత్రం విడుదలై 45 సంవత్సరాలవుతోంది. ఇవాళ్టికీ ఈ పాటలు సజీవంగా వున్నాయి. అందుకే వీటిని వింటూ ఉంటే చిత్తశుద్ధితో కూడిన శ్రద్ధ, ఆసక్తి ఉంటే పాటలు అజరామరంగా ఉండక ఏమవుతాయి అనిపిస్తుంది.



# ప్రియ జనవాక్యం

మార్కెట్‌లో పత్రికలు మృగ్యం అవుతున్న తరుణంలో మీకు ఆహ్లాదం అందించేందకు నేనున్నానంటూ దూసుకువచ్చిన 'హాసం' అందరినీ అలరిస్తూ తన పేరును నిలబెట్టుకోవటం చాలా గ్రేట్. నిజంగా కత్తిమీద సాము లాంటిది. 'ఎలుకవచ్చె ఇల్లు భద్రం' సీరియల్ బావుంటోంది.

'వజ్రం వజ్రేణ భిద్యతే' కథ నేటి పరిస్థితిని, భవిష్యత్ పరిస్థితిని కళ్ళకు కట్టినట్లుగా చూపించింది. ఇక 'తెలివికి గీటురాళ్ళు' ఎంతద్భుతంగా ఉందో మాటల్లో వివరించి చెప్పలేను. అలాగే వేటూరి 'గంగోత్రి పాట వివరణ గూడా. జోక్స్ గూడా బావుంటున్నాయి.

-వాలి హిరణ్మయిదేవి, హైదరాబాద్

ఆహా ఎంత హాయి...
ఈ సంగీత పత్రిక తిలకించినంత!!
మహానందభరితం
సస్యశ్యామలం ఇందులోని శీర్షికలు!!
మీ సంకల్పానికి మా నమస్సుమాంజలులు
ఆ గీర్వాణి ఆశిస్సులతో
శత శాతపు సాహిత్య విలువలతో
అపరంజితమై
పత్రిక కీర్తి ప్రతిష్టలు
సకల దిక్కులకు వ్యాపించాలి

-తెలికిచర్ల రామకృష్ణ, విజయనగరం.

'హాసం' పక్ష పత్రిక ఒక మిత్రుడు వద్ద చూచి అందుబాటులో ఉన్నంత వరకు కొనుక్కొని చదువుతున్నాను. పాత సినిమాలు, పాత సినిమా పాటలు, పాతతరం సినిమా స్టిల్స్ అంటే ఇష్టపడే నాలాంటి పాతబడిన అభిరుచి కలిగిన ప్రేక్షక పాఠకులకు 'హాసం' 'శబ్దార్థ దీపిక' వంటిది. 'ఆలీబాబా 40 దొంగలు, ప్రేమలేఖలు' వంటి చిత్రాల స్టిల్స్ చూస్తుంటే యాభయ్యవ దశకంలోకి వెళ్ళినట్లు, 'కినియా', 'గుండుసూది' వంటి పత్రికలు జ్ఞాపకం వచ్చాయి. కనుక వీలైనన్ని పాత స్టిల్స్, వర్కింగ్ స్టిల్స్ ప్రచురించి మాకు కన్నుల పండువ చేయగలరు

-మచ్చు లక్ష్మీనరసయ్య, జగిత్యాల.

కొన్నాళ్ళుగా మీ 'హాసం' చదువుతూ పొందుతున్న ఆనందం నాచేత ఈ లేఖ వ్రాయిస్తున్నది. వాయిలీనం ఒకచేత, సి.డి. ఒకచేత దరించి ఆధునాతన వాగ్దేవి మధుర మందహాసం మీ 'హాసం' పత్రికలోని కథలూ వ్యాసాలూ ఉన్నత స్థాయిలో వున్నాయి. కార్టూన్లూ హాస్యోక్తులూ ఎక్కడా చవుకతనమూ, మొరటు స్పర్శా లేకుండా సులలితంగా వున్నాయి.

కలాలు జేబుల్లో పెట్టేసి నటులైపోయిన మంచి రచయితల చేత తిరిగి కలం పట్టించిన ఘనదరహాసం మీ 'హాసం'.

అనేక సంవత్సరాల తర్వాత సర్వాంగ సుందరమైన తెలుగు పత్రికను చదువుతున్న తృప్తినిస్తున్నది 'హాసం'.

పి.జి. రామారావు, హైద్రాబాద్.

ఏప్రిల్ రెండవ సంచిక 'హాసం'లో జోక్స్, కార్టూన్స్ మా ఇంటిల్లిపాదిని ఎంతగానో నవ్వించేయి. ముఖ్యంగా ఏడు సంవత్సరాల మా రెండో అబ్బాయికి ఇవి నేను చూపించి చెబుతుంటే ఆపుకోలేని వాడి నవ్వు మాకు మరింత నవ్వు తెప్పించింది. 'హాసం'కి ధన్యవాదాలు. అయితే నాదో కంప్లయింట్ ప్రతి నెల ఆ రెండు రోజులలో (పత్రిక ఇంటికి వచ్చిన రెండు రోజులలో) నాకు, మా ఆయనకి ఏడు గంటల ఎడబాటు తెస్తుంది 'హాసం'. ఈ ఆరేడు గంటలు ఎడబాటు మా ఆయన 'హాసం' లోకంలోనే వుంటారు. మమ్మల్ని ఇంతలా అలరిస్తున్న మీ పత్రికకి మెనీ మెనీ థాంక్స్.

-గాదె విజయలక్ష్మి, విజయనగరం.

నా దగ్గర 'హాసం' 38 సంచికలున్నవి. విడవకుండ కొనేటట్లు సంగీత విషయాలు తెలియజేస్తున్నారు. కొలోనియల్ కజిన్స్ వారు పాడిన పాట స్క్రిప్టు ఇచ్చినారు. అందుకు చాలా సంతోషంగా వుంది. నన్ను ఒకరు ఆ పాట వినమన్నారు. ఆంగ్ల పాట ఇలావుంటే ఒరిజినల్ కన్నడంలో యీపాట ఎంత మధురంగా, అర్థవంతంగా వుంటుందో.

ఆడియోరివ్యూ ద్వారా ఏ కేసెట్‌లు కొనవచ్చో అర్థమవుతుంది.

నిజంగా హాస్యవల్లరి-సంగీతలహరి కిశోర్ జీవనఝురి. గాయకుడిగా తెలిసిన మాకు అతని జీవిత వైఖరి గమ్మత్తు అనిపిస్తుంది.

భూకైలాస్ లోని పాటలు మధురంగా వినడమే తెలుసు. ఇపుడు ఆ రాగాలు, వాటి గొప్పదనము తెలియజేస్తున్నారు. గాయకులు, రచయితల పట్ల ఆరాధనాభావము పెరుగు తుంది.

- వాసుదేవ, అవనిగడ్డ.

ఏప్రిల్ 16-30 సంచిక 'హాసం' సంపాదకీయం లోని హిందీ పాటల ఔన్నత్యాన్ని, ప్రాచుర్యాన్ని చక్కగా వివరించేరు. హిందీ పాటల ప్రభావం తెలుగు శ్రోతల మీదే కాకుండ తెలుగు పాటల సృష్టికర్తల మీద కూడ వుందనడానికి మన పాత పాటలే నిదర్శనం హిందీ బాణీల అనుకరణలు తెలుగులో ఎన్నో వచ్చాయి. గీత రచయిత షకీల్ బదాయూనీ వర్థంతి సందర్భంగా ఇచ్చిన వ్యాసం నన్ను ఆకట్టుకుంది.

-జె.ఎల్.ఎన్.స్వామి, విజయనగరం.

భూకైలాస్(1958) పాటల విశ్లేషణబాగుంది. విష్ణుద్వేషి, శివ ఆరాధకుడు అయిన రావణునికి వినబడేటట్లు విష్ణువును స్తుతిస్తూ 'శంకర వినుతా!' అని నారదుడు సంభోధించడం (దేవదేవ ధవళాచల- గీతం) సముద్రమంత సముద్రాల ప్రతిభను, చమత్కారాన్ని మన కళ్ళముందుంచుతుంది.

-ఆర్.వి.రాఘవరావు, అద్దంకి.

సహృదయ మిత్రులు హాసం సంపాదకులు మాన్యశ్రీ రాజాగారికి నమస్సులు. 1-15 ఏప్రిల్ 2003 'హాసం' సంచికలో "రాఘవేంద్ర" చిత్రం ఆడియో రివ్యూ చదివాక నా ప్రతిస్పందన తెలియజేయటం కోసం ఈ ఉత్తరం రాస్తున్నాను. "బూతులు తిట్టకురా" అన్న పాట నేను రాసినందుకుగాను మీరు నన్ను మందలించిన తీరులో మీకు నాపట్ల ఎంత గౌరవాభిమానాలు ఉన్నాయో అర్థమైంది. అందుకు ధన్యవాదాలు.



ఒకొక్కసారి అనుకోకుండా మనం చెయ్యని పనికి గౌరవంగాని అగౌరవంగాని మనకు ఆపాదించబడటం పొరపాట్లో గ్రహపాటు. సరిగ్గా ఈ పాట విషయంలో అలాంటిదే జరిగింది. మొట్టమొదట ఆ పాటను నాతోనే రాయించిన మాట నిజమే. కానీ ఏ కారణం చేతనో ఇంకో వెర్షన్ మరో కవిగారితో రాయించి రికార్డు చేయించుకున్నారు. ఆ వెర్షన్ సినిమాలోను మీరు రివ్యూ చేసిన ఆడియో క్యాసెట్‌లోను ఉన్నది. సినిమాలో నా పేరు వేయ్యలేదు గానీ ఆడియో క్యాసెట్‌లో ఆ పాట నేను రాసినట్టుగా ఎందుకు వేశారో నాకు తెలీదు. ఇందులో నా బాధ్యత ఏమిలేదు. కనుక నన్ను అభిమానించే మీలాంటివారు తలదించుకోవల్సిన పాటలు డబ్బుకోసం కానీ మొహమాటాలకు ఒత్తిడులకు లొంగిగానీ ఇంతవరకు రాయలేదని, భవిష్యత్తులో కూడా రాయనని, మీరు నాపట్ల పెంచుకున్న నమ్మకాన్ని వమ్ము కానివ్వనని, సవినయంగా మనవి చేసుకుంటున్నాను.

ధన్యవాదాలతో

- వెన్నెలకంటి (ఫిల్మ్ రైటర్)

